The Largest Circulated Telugu Monthly

# చతుర

జూన్ 1995 రూ 6/-

తృతీయ బహుమతి
రూ 7,500/- పొందిన నవల

## భవామి గృహే గృహే

వెక్కంతం సూర్యనారాయణ రావు



# చతుర ప్రపంచం

## మత్తు సర్వత్ర వర్జయేత్

**మ**ద్యపాన నిషేధమంటూ ఎంత మొత్తుకున్నా గవర్నమెంటు నిషేధాజ్ఞల్ని జారీచేసి, అమలుచేసినా... చాటుగా ఇళ్లల్లో బాటిల్స్ మీద ఎక్కువే తాగుతూవుంటారు, అవకాశాన్ని బట్టి చాలామంది.

అసలు ప్రమాదాలన్నీ అధికపానంవల్లే. కారుడ్రైవింగ్‌లో ప్రమాదాలు, భార్యల్ని చిత్తుగా కొట్టడాలు, మత్తులో రోడ్డు కడ్డంగా పడిపోవడాలు... వగైరా వగైరా ఎన్నో దుష్ఫలితాలు మద్యపానంవల్ల ఎదురవుతాయి




బాటిల్స్ పట్టిస్తూనే వుంటారు పానప్రియులు. శతకోటి దరిద్రాలకి అనంతకోటి ఉపాయాలున్నట్టే మద్యపానానికి మరిన్ని రహస్యమార్గాలు వెతుకుతూనే వుంటాడు అలవాటుపడ్డ ప్రాణి. మద్యాన్ని ఓ మందులా, మోతాదు మించకుండా తాగితే ఫరవాలేదుకానీ అంత కంట్రోలు వుండేది ఎంత మందికి? 'ఇవాళ హుషారెక్కువై మరో పెగ్గువేశానోయ్' అని ఓ మందుబాబంటే 'ఈవాళ బాధ ఎక్కువై మరో రెండు పెగ్గులు అదనంగా తాగాల్సివచ్చిందోయ్' అని మరో పానప్రియుడు విచారపడతాడు. ఏదయినా చివరకు అనుకున్నదాని

ఒక్క మద్యమేకాదు, మేధస్సును మత్తులోనింపే కొకైన్, బ్రౌనుసుగర్‌లాంటి ఎన్నో భయంకరమైన మత్తుమందులు గోప్యంగా చలామణి అవుతూనేవున్నాయి. కొన్నిచోట్ల స్త్రీలు కూడా ఈ మత్తుకి అలవాటు పడిపోయారు. అమెరికాకు చెందిన 23 సంవత్సరాల డరోతి అనే మహిళ కొకైన్ మత్తులో స్వంత కొడుకునే చంపుకుంది. ఆనక విలపిస్తే కలిపొచ్చేదేముంది. కొకైన్ కలవాటుపడిన డరోతి, ఓ

రాత్రి ఇంజక్షన్ తీసుకుని ఆ మత్తులో తన నెలల పసిబిడ్డనే తలగడగా భావించి వాడి మీద తలవుంచి పడుకుంది. బిడ్డ ఏడుపు, మూలుగు ఏవీ వినిపించని సమాధిస్థితిలోకెళ్లి పోయింది డరోతి. తెల్లవారి లేచి చూస్తే ఊపిరా డక పసివాడి ప్రాణం పోయింది. మర్నాడు పోలీసులు శవాన్ని పోస్ట్‌మార్టమ్ చేశారు. ఒక్క ఊపిరి ఆడకపోవడమేకాక బిడ్డ శరీరంలో కూడా కొకైన్ ఇంజక్ట్ చేయబడిందని రిపోర్ట్ ఇచ్చారు డాక్టర్లు. అంటే డరోతి తను తీసుకోవడమేకాక, పిల్లవాడి క్కూడా ఓ సూది పొడిచి ఆనక ఎంచక్కా ఆ పసివాడిమీద తలపెట్టి నిద్రపోయిందన్నమాట. కోర్టులో ఆమెమీద కేసు నడుస్తోంటే 15 వేల డాలర్లు కట్టించుకుని కొద్దిరోజులపాటు బెయిలు ఇచ్చారు కోర్టువారు.

---

## భయపెట్టే అవశేషాలు

మినాస్ సిసారస్, హెూసువానెన్సిస్, టోటోసారస్, ఎమిసారస్, లూబెన్ కోసారస్, లోడోసారస్, సిటగోసారస్, టుంగారిప్టస్, కొథియోసారస్, మాండ్‌సురోసారస్, యోన్గువాన్‌సారస్, షుండున్‌గోసారస్, టెంటోసారస్... చివరిగా డైనోసార్... ఇంతకీ నోరు తిరగని ఈ గజిబిజి పదాలన్నీ డైనోసార్ కుటుంబానికి చెందిన క్రూరమృగాల పేర్లు. ఇవన్నీ ఇరవై కోట్ల సంవత్సరాలకి పూర్వం భూమిమీద నివశించాయి. వీటి అస్థిపంజరాలు ఇన్ని వేల సంవత్సరాల తరువాత కూడా చెక్కు చెదరకుండా దొరికాయి. మ్యూజియంలలో భద్రపరచబడ్డాయి.

'డైనోసార్' అన్న పదానికి చైనా భాషలో ప్రమాదకరమైన డ్రాగన్ అని అర్థం. చైనాలోని బీజింగ్‌లో ప్రఖ్యాతి వహించిన చైనీస్ అకాడమీ ఆఫ్ సైన్స్ రీసెర్చ్ ఇన్‌స్టిట్యూట్ వారు ఈ డైనోసార్ జాతి అవశేషాలను, అస్థిపంజరాలను భద్రపరిచేందుకు ఓ మ్యూజియంను ప్రారంభించారు. అందులో వేలాది సంవత్సరాలకు పూర్వం భూమిపై నివశించిన డైనోసార్ కుటుంబానికి చెందిన జంతువుల అవశేషాలు చూపరులకు భీతిని, ఆశ్చర్యాన్ని కలిగిస్తున్నాయి.




అందులో అరవై అడుగుల పొడవు, పన్నెండు అడుగుల వెడల్పుగల అతిపెద్ద అస్థిపంజరాలు కూడా వున్నాయి. చైనాలో కొద్దికాలం క్రితం... అంటే 1964లో జరిగిన షాన్‌బాంగ్ తవ్వకాల్లో బయటపడిన ఓ డై

నోసార్ అస్థిపంజరం ఎత్తు ఎనభై అడుగులు, వెడల్పు పన్నెండు అడుగులు ఉంది.

ఈ తవ్వకాల్లో గట్టిపడి బండరాళ్లలా తయారయిన డైనోసార్ గుడ్లు కూడా లభించాయి. ఫలితంగా డైనోసార్ పక్షుల మాదిరిగా గుడ్లు పెడుతుందని తెలుస్తోంది. ఈ డైనోసార్ గుడ్లు నాలుగు రకాల ఆకారాల్లో దొరికాయి.

అతి పెద్ద డైనోసార్ గంటకి పదిహేను నుంచి ఇరవై కిలో మీటర్ల వేగంతో పరిగెడుతుందని, అతి చిన్న డైనోసార్ నాలుగు కిలోమీటర్ల వేగంతో పరిగెట్టగలదని తెలుస్తోంది. ఇలాంటి భయాశ్చర్యాలను కలిగించే ప్రమాదకర జంతుజాతి ఎప్పుడో అంతరించినా వాటి అవశేషాలు ఇప్పటికీ చూపరులకు భీతి కలిగిస్తున్నాయి.

## దొంగ స్నేహితులు

ఇంటి దొంగను ఈశ్వరుడు కూడా పట్టలేడని అంటారుగానీ మన పోలీసులు మాత్రం మూడు నిమిషాల్లో పట్టి బంధించారు ఓ ఇంటి దొంగని. కాలేజీలో చదువుకునే సచిన్ అనే విద్యార్థి ఓ వీడియో పార్లర్ యజమానికి 3,000 రూపాయలు బాకీ పడ్డాడు. మూడువేల రూపాయలు కాదుగదా, మూడు రూపాయలు కూడా లేవు సచిన్ దగ్గర. దానికి తగ్గట్టు వీడియో పార్లర్ యజమాని రోడ్డుమీద సచిన్ కనిపిస్తే చాలు డబ్బు అప్పు తీర్చమని గట్టిగా కేకలువేస్తూ అడుగుతున్నాడు. సచిన్‌కది అవమానంగా తోచింది. దాంతో అప్పు తీర్చడంకోసం గత్యంతరంలేని పరిస్థితుల్లో ఇంట్లోనే దొంగతనం చెయ్యడానికి పాల్పడ్డాడు. తన ఇంట్లో బీరువా తాళాలు ఎవరికీ తెలియకుండా తీసి స్నేహితులకిచ్చాడు. రాత్రివేళ పొద్దుపోయిన తరువాత ఇంట్లో అందరూ పడుకున్నట్టు రూఢి చేసుకున్నాక నెమ్మదిగా వీధి తలుపు గడియ తీసివుంచాడు.

అనుకున్న ప్రకారం పన్నెండు గంటల తరువాత స్నేహితులు దొరబాబుల్లా లోపలకి ప్రవేశించి దర్జాగా బీరువా తీసి, తమక్కావలసిన డబ్బు తీసుకుని, సచిన్‌కి కావలసిన డబ్బు అతడి చేతిలో పెట్టి చల్లగా జారుకున్నారు. మర్నాడు ఉదయం లేచి చూసుకున్న సచిన్ తండ్రి లబోదిబోమని పోలీసుస్టేషన్‌కి పరుగెత్తి ఫిర్యాదు చేశాడు. సచిన్ దురదృష్టమేమోగానీ, అతిత్వరలో వాళ్ళు దొంగలని పట్టుకోగలిగారు. అంతేకాదు, దెబ్బలకి తాళలేక అసలు విషయం చెప్పేశారు ఆ దొంగస్నేహితులు.





1942 డిసెంబర్ 30న చిత్తూరుజిల్లా అరికెల గ్రామంలో పుట్టిన శ్రీ వక్కంతం సూర్యనారాయణరావు తిరుమల తిరుపతి దేవస్థానం సాహితీ విభాగంలో అనువాదకులు. "చతురస్థాయికి నవల రాయగలిగినందులకు రచయితగా ఎంతో ఆత్మస్థయిర్యాన్ని పొందగలిగానంటున్న సూర్యనారాయణరావుగారు వివిధ పత్రికల్లో 50 కథలు, 25 నవలలు, 4 నాటికలు, 4 నాటకాలు, ఆడియోక్యాసెట్లకోసం 600 పాటలు, 3 ధార్మిక గ్రంధాలు, 10 గేయాలు రాశారు. అనేక అనువాదాలు చేశారు. భవిష్యత్తులో స్త్రీ పరిస్థితిని దృష్టిలో పెట్టుకుని ఈయన రాసిన "చంపిచూడండి" నాటిక బహుళ ప్రచారం పొందింది. అశ్లీలానికి, హింసకు అతీతంగా, సామాజిక స్పృహ అంతస్సూత్రంగా రాసిన క్రైమ్ కథలు, అపరాధ పరిశోధనలో ఓ నూతన ప్రక్రియను సంతరించుకున్నట్టు పొగడ్తలనందుకున్నాయి.

భారత శిక్షాస్మృతిలో మార్పు రావాలంటూ సాధికారికంగా నిరూపిస్తూ రాసిన "న్యాయదుందుభి" నాటకం 'మనస్విని- ఆత్రేయ' అవార్డు అందుకుంది.

ఈయన రాసిన 'జంతువు', 'కుక్క గొడుగు' కథలు వివిధ పత్రికల్లో ప్రథమ బహుమతులనందుకున్నాయి.

'విపుల'లో ప్రచురితమయిన 'మోడల్' కథ భారతీయ జ్ఞానపీఠ సంకలనంలో ప్రచురితమై అనేక భాషలలోకి అనువదించబడింది.

'వక్కంతం సూర్యనారాయణరావు రచనలు- పరిశీలనము' అనే ఒక సిద్ధాంతవ్యాసం వ్రాసిన వారికి గౌరవ డాక్టరేట్ ప్రదానం చేయబడింది.

# చతుర

సంపుటి: 18 సంచిక: 5 జూన్ 1995

ఆ సువిశాల మైదానంలో మంత్రుల ఆధ్వర్యంలో, పోలీసుల పర్యవేక్షణలో, వేదమంత్రాల మధ్య మరో అరగంటలో సార్వజనీనంగా "పుత్రకామేష్ఠి" యజ్ఞం జరగబోతోంది.

కానీ...

"ఇది పుత్రకామేష్ఠి. పుత్రికామేష్ఠి కాదు. పుత్రుడే కావాలన్న ఈ పక్షపాత యజ్ఞాన్ని మేము నిరశిస్తున్నాము.

జన్మనివ్వడానికి తల్లిగా ఓ స్త్రీ కావాలి.

శారీరక సుఖం ఇవ్వడానికీ, కొడుకులను కనడానికీ స్త్రీయే కావాలి, కానీ ఈ దేశంలో స్త్రీగా మాత్రం పుట్టకూడదు. అసమానతను పెంచే ఈ అధమ ప్రక్రియను ప్రతిఘటిద్దాం..." అంటూ కల్చరల్ క్రూసేడర్‌గా పేరుపొందిన ఆ యువతి సహచర మహిళలతో యజ్ఞవాటికలోకి దూసుకెళ్ళింది. అటుపైన అక్కడ జరిగిన భీకర సంఘటనలు ఎలాంటివి?

స్త్రీ అభ్యున్నతికి కంకణం కట్టుకుని... సమాజ దుర్నీతుల్ని అడుగడుగునా జలకడుగుతూ వచ్చిన ఆ యువతి... తన నిజ జీవితంలో ఎదుర్కొన్న అనుభవాలెలాంటివి?

మహిళాభ్యున్నతికై... ఆమె పూరించిన విప్లవ శంఖారావం... ఎలాంటి పరిణామాలను ప్రతిధ్వనించింది.

నవలల పోటీలో తృతీయ బహుమతి
రూ. 7,500/- పొందిన
వక్కంతం సూర్యనారాయణరావు రచన
"సంభవామి గృహే గృహే"
ఈ నెల 'చతుర' సమగ్ర నవల.



## సంభవామి గృహే గృహే

– వక్కంతం సూర్యనారాయణరావు

శ్రీమహాలక్ష్మి ఏకాగ్రతతో శ్రీ మహావిష్ణువు పాదపద్మాలు వొత్తుతూ కూచుంది. ఆదిశేషుని మీద అలవోకగా పవ్వళించిన శ్రీ మహావిష్ణువు నేత్రాలు లక్ష్మీదేవి ముఖపద్మంమీదే ఉన్నాయి పాదాలు వొత్తుతున్న ఆమె కదలికను అందంగా కొలత వేస్తున్నట్టు. లక్ష్మీదేవి తాటంకాలు విలాసంగా కదుల్తున్నాయి. ఆ తాటంకాల కాంతి ఆమె చెక్కుట ద్దాలమీద బంగారు నగిషీలు చిత్రిస్తోంది. శ్రీమహావిష్ణువు హృదయంలో ఏవో మధురమైన ఊహలు క్షీరసాగర తరంగాల్లా నాట్యంచేయటం ప్రారంభించాయి.

"పదములకడ పనియేమి? ఎద నీ సదనము దేవీ! ఇటురా దేవీ!" మహావిష్ణువు రాగయుక్తంగా అన్నాడు. ఆయన కంఠంలో యుగయుగాలుగా విశ్వాన్ని ఆవరించిన ప్రేమ ప్రతిధ్వనించింది.

శ్రీ మహాలక్ష్మి విశాలనేత్రాలు ప్రేమామృతాన్ని వర్షిస్తూ చూశాయి. విష్ణువు చూపులు అయస్కాంతాల్లా ఆమెని లాగుతున్నాయి. ఆమె చేతులు ఆయన పాదాలనుంచి దూరంగా కదిలాయి. విష్ణువు చేతులు నీలిరంగు తీగల్లా ఆమెవైపు సాగాయి...

కారుమేఘం మీదికి పాకుతున్న మెరుపు తీగలా వయ్యారంగా కదుల్తున్న లక్ష్మి తటాలున ఆగింది. మహావిష్ణువు చేతులు అసంకల్పితంగా ఆయన వక్షస్థలం మీదికి వాలిపోయాయి. ఏకాంత మందిరంలో ఏదో అలికిడి....

ఇద్దరూ వొకేసారి తలలు తిప్పి చూశారు.

యధాప్రకారం మూసివున్న బంగారు తలపుల దగ్గరగా... ఆమె ఎవరో నిలబడివుంది. చింపిరి జుత్తు, లోతుకుపోయిన ఎర్రటి కళ్ళు, చెక్కిళ్ళమీదకి జారి, ఆరిపోయిన కన్నీటిచారలు. చిరిగిపోయి, పీలికలుగా వేళ్ళాడుతున్న దుస్తులు. మొహంమీదా, పైకి కనిపిస్తున్న శరీరం మీద నల్లటి మచ్చలు... ఆమె చూపులు మహావిష్ణువు మొహం మీదే తాపడమయిపోయున్నాయి. ఆమె శరీరం నుంచి ఏదో దుర్వాసన లీలగా కదుల్తూ అప్రాకృతమైన వైకుంఠమందిరాన్ని కలుషితం చేస్తోంది...

మహాలక్ష్మి చూపుల్ని తన నాథునివైపు తిప్పింది. విష్ణువు భృకుటి ముడిపడింది...ఈ వికారాన్ని అభ్యంతర మందిరంలోకి జయవిజయులు ఎట్లా అనుమతించారు?

విష్ణువులో ప్రశ్న తలెత్తిన మరుక్షణం జయవిజయులిద్దరూ చేతులు జోడించి ఆయనముందు నిలబడ్డారు.

"స్వామీ... ఆగ్రహించ వలదని మనవి. ఇందు, మా అపచారము ఇసుమంతయును లేదు..." జయుడు భయభక్తులతో ప్రారంభించాడు.

"స్వామీ...ఈ దేవిని లోనికి పంపుటలో ఆలస్యము జరిగినది. అది ఉద్దేశ పూర్వకమైనదికాదు. భూదేవిని పోల్చుకొనుటకు మాకు కొంత సమయము పట్టినది..." ద్వారం దగ్గరగా నిల్చున్న స్త్రీని చూపిస్తూ అన్నాడు జయుడు.

"భూదేవియా?" మహావిష్ణువు ఆమెవైపు చూస్తూ ఆశ్చర్యంతో అన్నాడు.

మహాలక్ష్మి నివ్వెరపాటుతో చూసింది. భూదేవి శేషతల్పం దగ్గరగా అడుగులేసింది. సందు చూసుకుని జయ విజయులిద్దరూ చల్లగా జారుకున్నారు. లక్ష్మి, విష్ణువు పాదాల దగ్గరగా జరిగింది.

"వసుంధరా! మేమే నిన్ను పోల్చుకొనలేకపోయితిమి. ఏమి ఈ వేషము?" మహావిష్ణువు ప్రశ్నించాడు.

భూదేవి చెక్కిళ్ళమీద అశ్రువులు జారాయి. " వేషమా? స్వామీ... ఇది... వేషంకాదు... నా ప్రస్తుత స్వరూపం"

మహావిష్ణువు ఆమెని ఎగాదిగా చూశాడు. "నీ స్వరూపమా! విశ్వసింపజాలకున్నాము. చెదరిన కేశములు. శిథిల వస్త్రములు. తనువును కళంకితమొనరించిన ఆ మచ్చలు. ఈ





వైపరీత్యములకు కారణమేమి? నీ తనువు నుండి వ్యాపించుచున్న దుర్గంధమునకు కారణమేమి? నిన్ను ఈ స్థితికి దిగజార్చిన దానవాధముడు ఎవ్వడు?"

అశ్రువులు భూదేవి చెక్కిళ్లమీద జీవనదులయ్యాయి. "నా దుర్గతికి కారకుడు దానవుడుకాదు. మానవుడు''

"మానవుడా'' మహావిష్ణువు కంఠంలో ఆశ్చర్యం ప్రతిధ్వనించింది. "మనువు ద్వారా మేము సృజించిన మానవుడు నిన్నింతకు దిగజార్చినాడా? మేము విశ్వసింపలేము''

"నేనును నమ్మజాలకున్నాను..." భూదేవి వైపు అనుమానంగా చూస్తూ అంది లక్ష్మి. భూదేవి విరక్తితో నవ్వింది.

"మానవుడు సంస్కారదూరుడైన క్షణంలోనే నా జుత్తు తైల సంస్కారానికి దూరమైపోయింది.

"నా వస్త్రాలైన వృక్షజాతిని మానవుడు స్వార్థంతో నరికిపారేస్తున్నాడు. చెట్లూ చేమలూ నాశనమయ్యేకొద్దీ అంచెలంచెలుగా... నా... వస్త్రాలు... పీలికలైపోతున్నాయి. నా కడుపున పుట్టిన మానవుడు నన్ను... నన్ను... ఏక్షణంలో... నగ్నస్థితికి చేరుస్తాడో... ఊహించలేకుండా వున్నాను...

"ఇంక ఈ మచ్చలు... మానవుడు అనేక రంగాల్లో నిర్విరామంగా, నిర్లజ్జగా చేస్తున్న అకృత్యాలకూ, అన్యాయాలకూ, అఘాయిత్యాలకూ ఆనవాళ్ళు ఈ మచ్చలు. మానవుడు చేస్తున్న దారుణాలకు ఈ మచ్చలు శాశ్వత శాసనాలు.

"మీరూ, శ్రీలక్ష్మి ముక్కులు మూసుకుంటూ చీదరించుకుంటున్న ఈ దుర్గంధం... నా మీద మానవుడు చేస్తున్న కాలుష్యం నుండి పుట్టింది. హూణ భాషలో దీన్ని పొల్యూషన్ అంటారు. ఈ మచ్చలు ఏర్పడటానికి ఈ కాలుష్యం కూడా ఒక కారణమే..." ఇంక చెప్పలేను అన్నట్టుగా ఆగి, భూదేవి కళ్ళు తుడుచుకుంది.

"అటులనా..." మహావిష్ణువు సాలోచనగా అన్నాడు. "భువిమీద జరుగుతున్న అరాచకములు గూర్చి నారదుడైనను మాకు మనవి చేయలేదే..."

"హు, యుగానికి ఒకసారి గుర్తుచేస్తే చాలనుకున్నాడేమో, ఆయన..." భూదేవి ఎగతాళిగా అంది. "మానవులు చేసే దారుణాలు దానవులు కూడా చేయలేరు స్వామీ. ముఖ్యంగా స్త్రీజాతిపట్ల మానవుడి దుర్మార్గాలు మేరమీరిపోయాయి. స్త్రీని దేవతగా చిత్రించి, ఆరాధించి గౌరవించిన భరతభూమిలో, విద్యకు అధి దేవతగా ఒక స్త్రీనీ, శక్తికి అధిదేవతగా ఒక స్త్రీనీ, ఐశ్వర్యానికి అధిదేవతగా ఒక స్త్రీనీ పూజించి, సేవించిన వేద భూమిలో నేడు స్త్రీ ఒక గుడ్డ పీలిక. "యత్ర నార్యస్తు పూజ్యంతే..." లాంటి సూక్తులకు పుట్టినిల్లయిన కర్మభూమిలో నేడు ఆడది ఒక యంత్రం. అక్కడ ఆడది ఒక బలిపశువు. నా జాతికి చెందిన ఆడది అనుభవిస్తున్న కష్టాల్ని చూడలేక నేను తల్లడిల్లిపోతున్నాను. మీరు త్వరపడి ఏదో తరుణోపాయం ఆలోచించకపోతే..."

"దేవీ... ఆవేశమును నిగ్రహించుము. మేము నియంత్రించు కాలమునకు మేము కూడ బద్ధులమే. యుగమునకు ఒక్కసారి అవతరించి పరిస్థితులను చక్క బెట్టుట మా నియమము. గీతలోనే మేమది వక్కాణించితిమి. తరుణోపాయమాలోచించు తరుణము ఇంకనూ రాలేదు... మేము..."

"మీరు తక్షణం భూలోకానికి వచ్చి స్వయంగా పరిశీలించాలి'' భూదేవి ఉద్రేకంతో అడ్డు తగిలింది. " మిమ్మల్ని వెంట బెట్టుకు వెళ్ళాలని వచ్చాను''

"ఇప్పుడా!" విష్ణువు ఆశ్చర్యంగా అన్నాడు.

"ఇప్పుడే ఈ క్షణమే! మీరు రాకపోతే



నేను తిరిగి వెళ్లను. వైకుంఠ ద్వారం ముందు ధర్నా చేస్తూ కూచుంటాను'' కన్నీళ్లని పిడికిళ్ళతో తుడుచుకుంటూ అంది భూదేవి.

మహావిష్ణువు అర్థంకానట్టు చూశాడు. "ధర్నా...?... ధర్నా అనగానేమి, ధరణీ?"

"అసమ్మతినీ, ఉక్రోషాన్నీ, ఆగ్రహాన్నీ తెలియచేసే సాధనం! ఇలాంటి సాధనాలెన్నో ఉన్నాయి భూలోకంలో. అన్నీ చూపిస్తాను, నాతోరండి. తరుణం రాలేదనీ, రాననీ మీరంటే మీరు వచ్చే తరుణం వచ్చేదాకా నేనూ ఇక్కడే ఉండిపోతాను'' భూదేవి బెదిరిస్తున్నట్టుగా అంది.

మహాలక్ష్మి కంగారుగా చూసింది. ఆమె చేతులు విష్ణువు పాదాల మీద కొత్త నొక్కులు నొక్కాయి. "స్వామీ, ఉదాసీనము చేయకుడు. ఆమె ఇక్కడే వాసము ప్రారంభిస్తే ఆ దుర్వాసన కూడా ఇక్కడే ఉండిపోగలదు. సత్వరమే ఆమెను తోడ్కొని భువికి వెడలి, సమస్యను తొలగించి, వొంటరిగా తిరిగి రండు'' అంటూ లక్ష్మి పద్మనేత్రాలతో ఏవో సంకేతాలు అందజేసింది.

మహావిష్ణువు తల పంకిస్తూ లేచి కూచున్నాడు. "వసుంధరా... నీ ప్రార్థన మన్నించితిమి. భువికి దిగుటకు నిర్ణయించితిమి. భూమండలమున మమ్ములను ఎచ్చటకు తోడ్కొనిపోయెదవు?"

భూదేవి తేలిగ్గా నిట్టూర్చి, చిరునవ్వు నవ్వింది. "సమస్త భూమండలంలోనూ మీకు ఇష్టమైనది భరతఖండమేగా స్వామీ! పైగా హైందవ మతాన్ని అర్థం చేసుకుంటే సర్వమతాలనూ అర్థం చేసుకున్నట్టే అన్న సిద్ధాంతం ప్రకారం, భారతదేశాన్ని దర్శిస్తే ప్రపంచ దేశాలన్నింటినీ దర్శించినట్టే. అంచేత భారతదేశానికే వెళ్దాం..."

"దివ్యమైన ఆలోచన!" విష్ణువు ఉత్సా

హంగా అన్నాడు. "భారతదేశంలో ఎక్కడికి? అయోధ్యకా? మధురా నగరమునకా? హస్తినకా?"

"ప్రయాణిస్తూ ఆ ప్రదేశాలనూ తమరు పావనంచేస్తారు. మీరు అర్చామూర్తిగా వెలిసిన 'భూవైకుంఠం' అనబడే తిరుమలక్షేత్రం వున్న ఆంధ్రప్రదేశ్ రాష్ట్రానికి మిమ్మల్ని తీసుకెళ్ళాలని నా సంకల్పం. ఎందుకంటే భారతదేశాన్ని దర్శిస్తే ఏవిధంగా ప్రపంచాన్ని దర్శించినట్టవుతుందో, అదేవిధంగా ఆంధ్రప్రాంతాన్ని దర్శిస్తే మొత్తం భారతదేశాన్నీ సందర్శించినట్లే!"

"శుభం! ఇక బయలుదేరుదమా?" విష్ణువు లేచి నించుంటూ అన్నాడు.

వాళ్ళిద్దర్నీ మాయం చేస్తూ మూసుకున్న మహద్వారం వైపు చూస్తూ మహాలక్ష్మి క్షణకాలం అలాగే నిలబడిపోయింది. మెల్లిగా కదిలి, శేషతల్పంమీద విష్ణువు పాదాలు ఉంచుకునేవైపు, అలవాటైపోయిన భంగిమలో కూచుని, దీర్ఘాలోచనలో మునిగిపోయింది సాగరకన్య...

★ ★ ★

లిప్తపాటులో విష్ణువూ, భూదేవీ- ఆంధ్రప్రదేశ్ నడిబొడ్డులో వున్న ఒక నగరంలో దిగారు. రోడ్డుమీద లెక్కలేనన్ని వాహనాలు చెవులు పగిలేలా శబ్దాలు చేస్తూ, పొగమేఘాలు సృష్టిస్తూ అటూ ఇటూ దూసుకుపోతున్నాయి. ఒక చేత్తో ముక్కునీ, రెండు చేతుల్తో చెవుల్నీ మూసుకుని, విష్ణువు నాలుగోచేత్తో భూదేవి చేతిని పట్టుకొన్నాడు.

"వసుధా... నిశ్శబ్దముగా, ప్రశాంతముగా పరిమళభరితముగా వున్న ప్రదేశమున...సంచరించిన బాగుండును'' అన్నాడు.

భూదేవి విషాదంగా నవ్వింది. "అలాంటి స్వర్గం ఈ భూమ్మీద వుండదు... ఒకవేళ

పొరపాటున అలాంటి ప్రాంతం వున్నా కూడా మనం అక్కడికి వెళ్ళం! ప్రశాంతత లోపించిన వాతావరణాన్ని చూపించడానికే మిమ్మల్ని దివినుండి దింపాను!"

భూదేవి మలుపుతిరిగి, ఎదురుగా వున్న కలెక్టరాఫీసువైపు విష్ణువును తీసుకెళ్ళింది...

కలెక్టరాఫీసుకు కుడివైపున వున్న రోడ్డు మీంచి ఏవో అరుపులూ, కేకలూ భీకరంగా ధ్వనిస్తూ వాళ్ళ దృష్టిని ఆకర్షించాయి. వందలాది మంది స్త్రీలు నినాదాలు చేస్తూ ప్రవాహంలా వస్తున్నారు. వాళ్ళ ముందూ వెనకా లాఠీలూ, తుపాకులూ ధరించిన పోలీసులున్నారు. క్షణంలో బిలబిలమంటూ చాలా మంది పోలీసులు కలెక్టరాఫీసుచుట్టూ రక్షణవలయంలా నిలబడ్డారు.

"తాగు నీరు కావాలి'' స్త్రీలు అరుస్తూ ముందుకు దూసుకువస్తున్నారు. వాళ్ళ చేతుల్లో ఖాళీ కుండలున్నాయి. కుండలమీద 'తాగునీరు కావాలి' అని రాసివుంది.

విష్ణువు భూదేవివైపు ఆశ్చర్యంగా చూశాడు. "దేవీ, నూతన రిక్తకుంభములతో ఎచట కేగుచున్నారు? స్మశానమునకా?"

"పరిస్థితి ఇంకొంతకాలం ఇలాగే కొనసాగితే, అక్కడికే వెళ్తారు స్వామీ!" భూదేవి కసిగా అంది. "కానీ ఇప్పుడు వాళ్ళు ఈ కలెక్టరు కార్యాలయం ముందు నీటికోసం గొడవచేయడానికి వస్తున్నారు''

"తాగునీటికొరకా? దేవీ, నీకు జలసంపద అనుగ్రహించినాము కద! తాగునీరు ఎందుకు లేదు?" విష్ణువు ఆశ్చర్యంగా ప్రశ్నించాడు.

"మీరు ప్రసాదించిన జలసంపదకన్నా, 'జనసంపద' ఎక్కువైపోయింది, స్వామీ! పైగా అతివృష్టి, అనావృష్టి! వీటివల్ల జలం ఎక్కువగా ఉన్నచోట వ్యర్థమైపోతోంది. లేని ప్రాంతాల్లో ఇదీ వరస!" భూదేవి వివరించింది.

వేలాదిమంది స్త్రీలు కలెక్టర్ కార్యాలయాన్ని తేనెటీగల్లా చుట్టుముట్టేశారు. అరుపులు... నినాదాలు... అంతా గందరగోళంగా తయారైంది.. రణగొణధ్వనుల మధ్య 'సి.యం. డౌన్‌డౌన్' 'కలెక్టర్ బైటికి రావాలి!' అంటూ నినాదాలు అస్పష్టంగా వినిపిస్తున్నాయి...

క్షణంలో పరిస్థితి కొత్తరూపాన్ని ధరించింది. పోలీసులు విజృంభించారు. లాఠీలు తైతక్కలాడుతున్నాయి. స్త్రీలు విసురుతోన్న కుండలు భళ్ళు భళ్ళున పగుల్తున్నాయి... సంకుల సమరం...

కాసేపట్లో పోలీసులు హెూస్‌పైపుల్తో ప్రదర్శన నిర్వహిస్తున్న స్త్రీలమీద నీళ్ళు కొట్టడం ప్రారంభించారు. మోటుగా, బలంగా తాకుతున్న నీళ్ళు ఆడవాళ్ళని ఉక్కిరిబిక్కిరి చేస్తున్నాయి. పోలీసుల చేతుల్లోని లాఠీలు 'జలాస్త్రాల'కి తోడుగా రంగంలోకి దిగాయి. హాహాకారాలు ఆ సన్నివేశానికి నేపథ్య సంగీతం సమకూరుస్తున్నాయి. ఊపిరి ఆడక సొమ్మసిల్లిపోతున్న ఆడవాళ్ళ శరీరాలమీద లాఠీలూ, బూట్లూ భారతనాట్యం చేస్తున్నాయి... వెనకవైపున్న ఆడవాళ్ళు విసురుతున్న 'రిక్తకుంభాస్త్రాలు' బలహీనంగా పగిలిపోతున్నాయి...

"దేవీ, త్రాగునీరు అడిగి, పట్టుకొనకుండా నారీమణులు కుంభములను పగులవేయుచున్నారేమి? ఈ పురుష సైనికులు దండములతో, పాదరక్షలతో వారిని హింసించుచున్నారెందులకు?" పరిస్థితిని అర్థంచేసుకోలేని విష్ణువు భూదేవిని ప్రశ్నించాడు.

"ఆ నీరు ఆడవాళ్ళు కడవలతో పట్టుకోడానికి ఉద్దేశించినవి కావు స్వామి! వాళ్ళను బెదరగొట్టడానికి ఉద్దేశించినవి!" భూదేవి జవాబిచ్చింది.

క్షణాలు గడుస్తున్నాయి. కిందపడి సొమ్మసిల్లిపోయిన ఆడవాళ్ళని కొందరు ఆడవాళ్ళు కంగారుగా మోసుకెళ్తున్నారు. లాఠీల దెబ్బకి వెనక్కి తగ్గిన స్త్రీలు గొంతులు





చించుకుంటూ అరుస్తున్నారు.

"పోలీసు జులుం... నశించాలి!"

"ఆడవాళ్ళని కొట్టించే ఆడంగి ప్రభుత్వం... డౌన్‌డౌన్!"

విష్ణువు భూదేవివైపు ఇబ్బందిగా చూశాడు. "దేవీ, ఈ బీభత్సకాండను మేము దర్శింపలేము"

"రండి... మరో ఊరికి వెళ్దాం..." అంటూ కదిలింది భూదేవి...

... మరో ఊళ్ళో, బస్టాండు సమీపంలో పరిస్థితి ఇంకా బీభత్సంగా వుంది. ప్రభుత్వానికి వ్యతిరేకంగా నినాదాలు చేస్తున్న వందలాది మంది యువతీయువకులు... వాళ్ళని చెదరగొట్టే ప్రయత్నం చేస్తున్న పోలీసులూ ఆ ప్రదేశాన్ని కురుక్షేత్రంగా మార్చేస్తున్నారు. యువకులు రాళ్ళు విసురుతున్నారు. పోలీసులు టియర్‌గాస్ షెల్స్ రువ్వుతున్నారు. గాలిలో కాల్పులు ధ్వనిస్తున్నాయి. ఉన్నట్టుండి నాలుగు బస్సులు తగలబడసాగేయి. ఎర్రటి మంటలు, పొగ...

నివ్వెరపోయిన విష్ణువు భూదేవివైపు ప్ర ప్రశ్నార్థకంగా చూశాడు.

"రిజర్వేషన్లకు వ్యతిరేకంగా నిరుద్యోగ యువతీయువకులూ, విద్యార్థులూ నిరసన తెలియజేస్తూ ఉద్యమిస్తున్నారు, స్వామీ..." భూదేవి వివరించింది.

విష్ణువు అర్థంకానట్టు చూశాడు, "రిజర్వేషనా? అనగానేమి?"

"మరో ఊరికి వెళ్ళేటప్పుడు వివరిస్తాను, అదుగో- అటు చూడండి!" అంది భూదేవి కుడిచేతివైపు చూపుతూ.

విష్ణువు తలతిప్పి చూశాడు. డబ్బాలో వున్న కిరోసిన్‌ని శరీరంమీద దిమ్మరించుకున్న ఒక యువతి, తన శరీరానికి నిప్పంటించుకుంది, రిజర్వేషన్‌కి వ్యతిరేకంగా నినాదంచేస్తూ. మంటల్లో చిక్కుకుని, కాలిపోతున్న ఆమెవైపు జనం పరుగెడుతున్నారు. కాస్సేపట్లో నల్లగా మారిపోయిన ఆమె ఆకారం నేలమీద పడి, దొర్లుతోంది.

ఆశ్చర్యశిల్పంలా మారిపోయిన విష్ణువుని భూదేవి మరో ఊరివైపు తీసుకెళ్ళసాగింది...

ఆ 'మరో ఊళ్ళో' కూడా పరిస్థితి అలాగే ఉంది. 'రాస్తారోకో' వల్ల లారీలూ, బస్సులూ రోడ్డుపొడవునా ఆగి వున్నాయి. బ్యానర్లూ, నినాదాలు రాసిన అట్టలూ పట్టుకున్న యువతీయువకులు ఆకాశం అదిరిపోయేలా అగుస్తున్నారు.

"రిజర్వేషన్ విధానాన్ని తక్షణం అమలుజరపాలి!"

అయోమయంలో పడిపోయిన మహావిష్ణువుకి 'రిజర్వేషన్ అనుకూల విప్లవం' గురించి ఎడ్యుకేట్ చేస్తూ, ఆయన్ని ముందుకు నడిపించింది భూదేవి.

మరో ఊరు...

పూరిగుడిసెలూ, మురికి గుంటలూ వున్న ప్రాంతంలో ఆగింది భూదేవి. ఒక గుడిసె ముందు సాగుతున్న నాటకాన్ని తిలకించమంది.

గుడిసెలోంచి అరుస్తూ ఇవతలకి పరుగెట్టుకు వచ్చిన ఒక నడివయస్సు స్త్రీని ఒక వ్యక్తి వెంబడించి పట్టుకున్నాడు. ఆమె అరుస్తోంది. తిడుతోంది. ఆమె పైట పట్టుకుని లాగుతున్నాడు ఆ వ్యక్తి, ముందుకీ, వెనక్కీ తూలుతూ ఆమెని బండబూతులు తిడుతున్నాడు. చుట్టుపక్కల గుడిసెల్లోని జనం చోద్యం చూస్తున్నారు.

"ఆమె తల్లి. వాడు కొడుకు. సారామత్తులో వావివరసలు మరిచిపోయి, కన్న తల్లిని... నేను... చెప్పలేను స్వామీ!" భూదేవి విష్ణువుతో అంది.

వణుకుతున్న విష్ణువు వేళ్ళు భూదేవి చేతి చుట్టూ బిగుసుకున్నాయి.

"స్వామీ... ఇక్కణ్నుంచి వెళ్ళిపోదాం" భూదేవి ఆయనకి మాట్లాడే అవకాశం ఇవ్వ

కుండా అంది.

"ఈ మురికికూపాలు చాలు! మనం రాష్ట్ర రాజధానికి వెళ్దాం"

హైదరాబాద్...!

జిబ్రాల్టర్ రాక్‌మీద ఎత్తుగా నిల్చున్న బుద్ధుడు, లోకంలోని సుఖదుఃఖాలతో తనకి సంబంధంలేనట్టు నిర్వికారంగా, నిర్నిమేషంగా చూస్తున్నాడు. ఆయన కనుచూపుమేరలో బ్రహ్మాండమైన బహిరంగసభ జరుగుతోంది. కిక్కిరిసిపోయిన జనంచుట్టూ వాళ్లని చేరవేసిన లారీలూ, బస్సులూ కోటగోడలాగా నిలబడ్డాయి. వేదికమీద, మైక్‌ముందు నించున్న నాయకుడు మూర్తీభవించిన ఆంధ్రపౌరుషంలా ఉద్రేకంతో ఉపన్యసిస్తున్నాడు.

"... అంచేత... ఆ కరుణామయుడైన బుద్ధభగవానుడు ఏం చెప్పాడో మీకు ప్రత్యేకించి మనవి చేసే అవసరం లేకపోయినా మంచి మాటలు మళ్లీమళ్లీ చెప్పుకోవాలన్న సూక్తిని గుర్తుచేసుకుని మనవి చేస్తున్నాను! 'హింస చేయకండి!' 'అహింసను ఆచరించండి!' అన్నాడు బుద్ధభగవానుడు. 'మనసా వాచా కర్మణా - మనసుతో, మాటతో, చేతతో అహింసను ఆచరించండి!' అన్నాడాయన. మహాజనులారా! మన జాతిపిత గాంధీమహాత్ముడు బోధించిన మార్గం కూడా అదే! 'ఏ ప్రాణినీ హింసించవద్దు! హింసతో, రక్తపాతంతో దేన్నీ సాధించలేవు!' అన్నాడు గాంధీగారు.

"మహాజనులారా! పవిత్రమైన ఈ దినం, ఈ వేదికమీంచి నేను మనవి చేసేదేమిటంటే ముఖ్యంగా మన నక్సలైటు సోదరులకూ, పీపుల్స్‌వార్ గ్రూప్ సోదరులకూ నేను ప్రత్యేకించి మనవి చేసేదేమిటంటే - హింసామార్గాన్ని విడనాడండి! ఆయుధాలు పారేసి, జనజీవన స్రవంతిలో కలిసిపోండి! అహింసామార్గా



న్ని ఆచరణలో పెట్టండి!"

ఉపన్యాసాన్ని జాగ్రత్తగా వింటున్న మహా విష్ణువు కొంచెం ఆనందంతో భూదేవివైపు చూశాడు. "దేవీ, ఎవరీతడు? సన్మార్గవర్తను నివలె, సాధువర్తనునివలె ఉన్నాడు?"

"మంత్రి... 'మంత్రి' అంటే పూర్వంరోజుల్లో రాజుల కొలువులో ఉన్న మంత్రిలాంటివాడు కాదు. ఆరోజుల రాజులు, ఈ రోజుల మంత్రులు అనే నానుడి ఉంది! అదిగో... ఉపన్యాసం ముగించి మంత్రి వెళ్లిపోతున్నాడు. ఈ నగరంలోనే మరోచోట అతని ప్రసంగం ఉంది..."

"అయినచో మనము అవశ్యము వెళ్లవలసినదే! మనసును వికలమొనరించిన ఆ దృశ్యముల తరువాత ఈతని మాటలు మాకు ఊరట కలిగించుచున్నవి!" మహావిష్ణువు ఉత్సాహంగా అన్నాడు.

విశాలమైన మైదానంలో ఏర్పాటైన బహిరంగ సభలో మంత్రిగారు అప్పటికే ఉపన్యాసం ప్రారంభించేశారు:

"మా ప్రభుత్వమంటే గిట్టనివాళ్లు, వచ్చే ఎన్నికల్లో గెలిచే నమ్మకం లేనివాళ్లు, కులాల పేరుతో మతాలపేరుతో ప్రజల్ని విడదీసే స్వార్థపరులు ఈనాడు అనవసరంగా ఈ 'అల్‌కబీర్' సమస్యను లేవనెత్తి పబ్బం గడుపుకోవాలని చూస్తున్నారు! మహాజనులారా! రోజుకి కొన్నివేల పశువుల్ని మాంసంగా మార్చి, ఎగుమతుల రంగంలో మనదేశానికి కోట్లాది రూపాయల ఆదాయాన్ని ఆర్జించిపెడుతున్న ఒక పరిశ్రమను మూసివేయించాలన్న ఆందోళన అర్థరహితమైందనీ, స్వార్థపూరితమైందనీ నేను గట్టిగా మనవి చేస్తున్నాను! ఈ విషయంలో స్వార్థశక్తులు చెప్పే కల్లబొల్లి మాటలు నమ్మి మోసపోవద్దని..."

"దేవీ... ఏమీ విడ్డూరము! అక్కడ అహింస... ఇక్కడ... హింస! వీడు ద్వంద్వ

వైఖరి అవలంబించుచున్నాడే!" విష్ణువు ఆశ్చర్యంతో అన్నాడు.

"మానవులలో ఇలాంటి వైఖరి వున్నవాళ్లే అధికంగా ఉన్నారు! మీ పానుపు ఆదిశేషుని వేయి పడగలకు రెండువేల నాలుకలున్నాయి. మానవుడికి ఒకే తలకు రెండువేల నాలుకలున్నాయి. గోవులు - వధ అనగానే మీకు కృష్ణావతారం గుర్తొచ్చినట్టుంది. మీ మొహం వివర్ణమైపోయింది! మరొకచోటికి వెళ్దాం రండి!" అంది భూదేవి.

నగరంమీద ఆకాశగమనం చేస్తున్న విష్ణువూ, భూదేవీ కింద జరుగుతున్న మానవ నాటకాన్ని ఏరియల్‌వ్యూలో చూస్తున్నారు. భూదేవి తటాలున దారి మళ్లించి, కొంచెందూరం వెళ్లాక ఆగింది. కింద, ఒక ఇరుకు సందులో జరుగుతున్న దృశ్యాన్ని చూడమని విష్ణువును హెచ్చరించింది.

ఒక ఇంట్లోంచి పోలీసులు ఒక యువతి శవాన్ని మోసుకొస్తున్నారు. ప్రాణాలు తీసుకోడానికి ఆమె ఉపయోగించిన నైలాన్ తాడు ఒక పోలీసు చేతిలో వుంది. శవం అంబులెన్సులోకి చేరవేయబడింది. నలుగురు పోలీసులు ఒక నడివయస్సు వ్యక్తిని ఇంట్లోంచి ఈడ్చుకువస్తున్నారు. అతని చేతులకి బేడీలున్నాయి.

"శవంగా మారిన ఆ యువతి, బందీ అయిన వ్యక్తి ఏకైక పుత్రిక..." భూదేవి విష్ణువుతో అంది.

"పుత్రిక మరణించిన విషాద తరుణంబున జనకుని బంధించుట నిక్కముగా దారుణమే! దేవీ, నీవు మనవి చేసినట్లు మానవులు దానవులయిపోవుచున్నారు'' విష్ణువు సాలోచనగా అన్నాడు.

భూదేవి చిన్నగా నవ్వింది. "నిజమే స్వామీ! తండ్రి-మానవుడు, కానీ దానవుడయ్యాడు! కూతురి దుర్మరణానికి కారకుడు వాడే!"

"కన్నతండ్రి కన్నబిడ్డను హతమొనరించినాడా?" విష్ణువులో ఆశ్చర్యం.

"పరోక్షంగా'' భూదేవి కంఠధ్వని కసితో పదునెక్కింది. "ఆ రాక్షసుడు మద్యం సేవించిన మైకంలో కన్నబిడ్డ అయిన ఆ కన్నెపిల్లను గతరాత్రి... మానభంగం చేశాడు! ఆ ముగ్ధ... తన నూరేళ్ల జీవితాన్ని ఇరవైఏళ్లు కాకుండానే అంతం చేసుకుంది!"

"పాపమ్ శాంతమ్!" విష్ణువు చెవులు మూసుకుంటూ అన్నాడు.

భూదేవి అక్కణ్నుంచి కదిలింది.

"దేవా! అది భారతీయులందరూ జాతిపితగా ఆరాధించే మహాత్మాగాంధీ విగ్రహం. ఇవాళ ఆయన జన్మదినం. ఆ సందర్భంలో ఈ రాష్ట్ర ముఖ్యమంత్రి గాంధీజీ విగ్రహానికి పూలమాల వేసి పూజిస్తాడు..." సెంటర్లో ఎత్తయిన పీఠంమీదున్న గాంధీ విగ్రహాన్ని చూపిస్తూ విష్ణువుతో అంది భూదేవి.

"అది లెస్సగానే యున్నది! అయితే ఆ వందలాదిమంది నారీమణులు గోలచేయుచూ పెడబొబ్బలు పెట్టుచున్నారెందులకు? గాంధీ విగ్రహంచుట్టూ వలయంగా ఏర్పడిన కారణమేమి? విగ్రహం దగ్గరకు తీసుకొనిపోవు సోపానములమీద అడ్డుగా ఆసీనులై అరచుచున్నారెందుకు? ముఖ్యముగా... దండములూ, ఇతర ఆయుధములూ ధరించిన పురుషులు వాళ్లతో తలపడునట్లున్నారెందులకు?" మహా విష్ణువు గుక్క తిప్పుకోకుండా ప్రశ్నించాడు.

భూదేవి జవాబిచ్చేలోగా ఉన్నట్టుండి ఏదో కలకలం బయలుదేరింది. పోలీసులు అటూ ఇటూ పరుగెడుతూ బెత్తాలతో ఆడవాళ్లని వెనక్కి తోయడం ప్రారంభించారు. కార్లు ఒకదానివెనక ఒకటి దూసుకుంటూ వస్తున్నాయి.

"మద్యనిషేధం అమలు జరపాలి!"

"గాంధీ జయంతి సందర్భంలో సంపూర్ణ మద్యనిషేధం ప్రకటించాలి!" మహిళలు గొంతులు చించుకుంటూ అరుస్తున్నారు.




కార్లు ఆగాయి.

"గాంధీజీ విగ్రహానికి పూలమాల వేసే ముందు ముఖ్యమంత్రి సంపూర్ణ మద్యనిషేధాన్ని ప్రకటించాలి!" మహిళలు బిగ్గరగా అరుస్తున్నారు.

క్షణంలో పరిస్థితి గందరగోళంగా తయారైంది. పోలీసులు నూతనోత్సాహంతో ఆడవాళ్లమీద విరుచుకుపడ్డారు.

కొందరు పోలీసులు గుంపుగా నిలబడి నినాదాలు చేస్తున్న ఆడవాళ్లని లాఠీలతో, తుపాకీ మడమలతో మొరటుగా వెనక్కి తోస్తున్నారు.

కొందరు పోలీసులు చేతులూ, చీర చెంగులూ పట్టుకుని మహిళల్ని రాక్షసంగా లాగుతున్నారు.

కొందరు పోలీసులు సభ్యతనూ, సంస్కారాన్నీ మరిచిపోయి కేవలం డ్యూటీని మాత్రమే గుర్తుంచుకుని ఆడవాళ్లని మొరటుగా రెండుచేతుల్తో వొడిసిపట్టుకుని, ఇంకా మొరటుగా వ్యాన్‌లలోకి కుక్కేస్తున్నారు.

పైటలు తొలగిపోయి, జాకెట్లు చిరిగిపోయిన స్త్రీలు హాహాకారాలు చేస్తున్నట్టు అరుస్తున్నారు. పరపురుషుడు చూపులతో కూడా స్పృశించడానికి వీలులేని మహిళల శరీరభాగాలను పోలీసుల చేతులు పాశవికంగా, ఆటవికంగా తాకుతూ, వాళ్లని దూరంగా తోస్తున్నాయి, సిగ్గూ, బిడియం లేకుండా వాళ్లని వొడిసిపట్టుకుని పోలీసు వాహనాల్లోకి గిరాటేస్తున్నాయి...

మహావిష్ణువు ఆశ్చర్యంతో నోరుతెరిచి చూస్తూవుండిపోయాడు.

"ఆ... దేవీ! జరిగిన ఘట్టమును తిలకించుచున్న మాకు కనులు, మనసు కొంచెము చెదరినవి... దుర్మార్గముగా దండింపబడిన ఆ నారీరత్నములు చేసిన నేరము..."

"వివరిస్తాను, స్వామీ..." భూదేవి నిట్టూరుస్తూ అంది. "మద్యపానంవల్ల సంభవిస్తున్న దారుణాల్ని కొన్నింటిని మీరు స్వయంగా దర్శించారు. గాంధీమహాత్ముడు భారతదేశానికి స్వాతంత్ర్యం సంపాదించి ఇచ్చాడు. ఆయన అహింసావాది. భారతదేశంలో ప్రజాస్వామ్యం రామరాజ్యం కావాలని ఆయన ఆశించి, కొన్ని సూత్రాలు నిర్దేశించారు. వాటిలో మద్యపాన నిషేధం కూడా వుంది. అన్నింటిలోనూ ఆయన సూత్రాల్ని ఆచరిస్తామని చాటుకునే ప్రభుత్వం మద్యపాన నిషేధం విషయం వచ్చేసరికి ఆయన్ని మరిచిపోతుంది. గాంధీ పుట్టిన రోజున మద్య నిషేధం విధించి, ఆయన కలల్ని నిజంచేసి, తమ జీవితాల్ని బాగుచేయమని నారీలోకం కోరింది. ఆ కోరిక ఫలితాన్నే మీరు ఇప్పుడు తిలకించారు!"

"మహిళల వాంఛితము వాంఛనీయము. దానిని తిరస్కరించుట అన్యాయము!" విష్ణువు స్వగతంలా అన్నాడు.

"స్వామీ! భూలోకంలో పెరిగిపోతున్న కొన్ని దారుణాలను మీకు చూపించాను. ఇంకా భయంకరమైనవి ఎన్నో వున్నాయి. వెళ్దామా?" భూదేవి ప్రశ్నించింది.

మహావిష్ణువు కంగారుగా చూశాడు. "దేవీ... దర్శించిన దారుణాలతో మా హృదయము వికలమైనది. ఇంకనూ పరికించు ఓరిమిలేదు..."

"అయితే, నా దురవస్థ మీకు అర్థమయ్యేదెట్లా?" భూదేవి నీరసంగా ప్రశ్నించింది.

"దేవీ... సర్వకర్తా సర్వశక్తిమంతుడూ అయిన మాకు కూడా కొన్ని నియమములున్నవి. స్త్రీలకు జరుగుచున్న అన్యాయములు మమ్ము దహించివేసినవి. అయిననూ మేము ఈ యుగధర్మమును అనుసరించి చేయగలిగినది ఏమియునూ లేదు!"

"స్వామీ...!"

"కలతచెందవలదు దేవీ!" మహావిష్ణువు ధైర్యం చెప్తున్నట్టు అన్నాడు.

"నేను పరిష్కారం ఆశిస్తున్న సమస్య లలో అదే ప్రధానమైంది. ఎందుకంటే 'నాతి' ఆనందంగా వుంటే 'జాతి' ఆనందంగా వుంటుంది. నాతి సుఖమే జాతి సుఖము!" అంది భూదేవి.

"ఔను! అందుకే ప్రస్తుతము ధర్మసంస్థాపనమును ఒక స్త్రీమూర్తిచేత చేయింప నిశ్చయించితిమి..."

"స్వామీ?!"

"అదియే తరుణోపాయము! మా త్రిమూర్తులతో సమానమైన మహత్తుగలిగిన 'ఆదిశక్తి'ని ఈ మహత్కార్యమునకు నియమించెదను!" మహావిష్ణువు భూదేవివైపు తదేకంగా చూస్తూ అన్నాడు. "ఆదిశక్తిని ఈ క్షణముననే ఆహ్వానించుచున్నాను!" అన్నాడు.

బ్రహ్మాండమైన కాంతితో ఆదిశక్తి వాళ్ల ముందు ప్రత్యక్షమైంది.

"ఆదిదేవునకు అభివాదము!" ఆదిశక్తి నమస్కరించింది.

"దేవీ, ఈమె... భూదేవి'' మహావిష్ణువు పరిచయం చేశాడు.

ఆదిశక్తి భూదేవిని ఆశ్చర్యంగా చూసింది. "భూదేవియా! విపుల విషూచివలె ఉన్నదే!"

"భువిపైన విశృంఖలముగ పెరిగిన అధర్మము వసుంధర స్వరూపమును భయంకరముగ మార్చివేసినది! ఆ వైనము ఆమెయే నీకు వివరించగలదు!" విష్ణువు వివరించాడు.

భూదేవి గొంతు సవరించుకుని ప్రారంభించింది. ఆదిశక్తి మౌనంగా వినసాగింది. అవనిమీద అతిశయించిన అధర్మమును పూర్తిగా వివరించి భూదేవి అంది:

"ముఖ్యంగా మనిషి జననానికీ, జీవితానందానికీ, వంశోద్ధరణకూ మూలమైన స్త్రీ జాతి అతిఘోరమైన స్థితికి గురిచేయబడింది. గర్భస్థ శిశువుగా వున్న దశనుండీ, కాలంచేసేదాకా మనిషి స్వార్థానికి స్త్రీ అంచెలంచెలుగా బలైపోతోంది.

"ప్రతిరోజూ లెక్కలేనంతమంది స్త్రీలు మానభంగాలకు గురైపోతున్నారు''

"బలవంతంగా వ్యభిచార వృత్తిలోకి దించబడుతున్నారు.

"పశువుల్లాగా విదేశాలకు విక్రయించబడుతున్నారు.

"వరకట్న దావానలంలో పురుగుల్లా కాలిపోతున్నారు.

"ఇంటా, బైటా విలాసవస్తువులుగా వాడుకోబడుతున్నారు.

"తమ జాతికి తమనే శత్రువులుగా రూపొందించే అతి తెలివైన దుర్మార్గానికి అమాయకంగా బలైపోతున్నారు..."

"ఇంక చెప్పకు వసుంధరా!" ఆదిశక్తి ఆగ్రహావేశాలతో వారించింది. "నా జాతి జీవులకు జరుగుచున్న అన్యాయాలను వినలేను, విని సహించలేను!"

"అందువలన మాకు మారుగా నీవే ఈ భువిమీద అవతరించి, మాకు మారుగా ధర్మసంస్థాపనముచేయవలె! ఇది మా సంకల్పము!" ఆదిశక్తి ఆవేశాన్ని గుర్తించిన మహావిష్ణువు ప్రోత్సహిస్తూ అన్నాడు.

"పరంధామా! ప్రత్యేకించి ధర్మసంస్థాపనము చేయవలసిన అవసరము లేదు! స్త్రీని ఉద్ధరించిన ధర్మము ఉద్ధరింపబడగలదు! స్త్రీ తలయెత్తుకొని నడచిన ఎడల ధర్మము నాట్యము చేయగలదు!" ఆదిశక్తి ఉద్రేకంతో అంది.

"లెస్సపలికితివి! స్త్రీ జాతిని స్త్రీజాతియే ఉద్ధరించవలె! అప్పుడుగానీ, స్త్రీజాతికి ఆత్మవిశ్వాసము అంకురించదు! ఈ ప్రయత్నమున మేము నీకు అండగానుండి, సర్వ సహాయములు అందించెదము. నీవు భూమిమీద అవతరించవలెను!"

ఆదిశక్తి ఆవేశంతో చూసింది. "అవతరించెదను! అధర్మమును అణగద్రొక్కి, అబలలను రక్షించెదను!"




"శుభమ్!" విష్ణువు మందహాసం చేశాడు.

"కానీ, ధర్మరక్షణార్థం నీవు కాలవ్యవధి ఏర్పరచుకొని, 'సంభవామి యుగేయుగే' అనినావు, అట్లే చేయుచున్నావు. భూదేవి వివరించిన ప్రస్తుత పరిస్థితులలో యుగమునకు ఒకసారి యుగేయుగే వ్యవధానము చాలదు. అవతార విషయమున నీవు పాటించిన 'కాలనియమము'ను విసర్జించి, నేను 'స్థల నియమము'ను ప్రారంభించదలచితిని..."

"అనగా..." విష్ణువు సందేహిస్తూ చూశాడు.

"శ్రీహరీ! నీవు 'సంభవామి యుగేయుగే' అని వాక్రుచ్చి, ప్రతి యుగంలోనూ అవతరించెదనంటివి. నేను 'సంభవామి గృహే గృహే!' అని శపథము చేయుచున్నాను. ప్రారంభమున భారతదేశములోని ఈ ఆంధ్ర ప్రాంతమున ప్రతి గృహములోనూ నేను జన్మించెదను. ఆవిధముగా వేలాది, లక్షలాది గృహములలో అవతరించి, అధర్మమును నిర్మూలించెదను! అటుపిమ్మట భారతదేశమంతటనూ, ఆ పిమ్మట భూమండలమంతటనూ అవతరించెదను!" ఆదిశక్తి కంఠం జేగంటలా ధ్వనించింది.

మహావిష్ణువు ఆదిశక్తివైపు అబ్బురంగా చూశాడు. "సంభవామి గృహే గృహే! - బాగున్నది! దేవీ నీ ఆలోచన అమోఘము!"

ఆదిశక్తి ఉద్రేకముతో భూదేవివైపు చూసింది. "వసుధా! ఇంక నీవు నిశ్చింతగా నుండుము. ఇంటింటా జన్మించి ఇంతుల ఇక్కట్లు తీర్చెదను! సంభవామి గృహేగృహే!" భూదేవి ఆదుర్దాగా చూసింది.

"దేవీ... నన్ను క్షమించాలి... నీవు ఇంటింటా జన్మించలేవు! ఆ శక్తి నీకు లేదు!"

"వసుంధరా!" ఆదిశక్తి హుంకరించింది. 'ఈ ఆదిశక్తి శక్తినే అనుమానించి, అవమానించుచున్నావు!"

"దేవీ... తొందరపడవలదు! ఆదిశక్తి ప్రభావమును శంకించవలదు'' మహావిష్ణువు భూదేవిని సున్నితంగా మందలించాడు.

భూదేవి తన చూపుల్ని విష్ణువు మీదనుంచి ఆదిశక్తిమీదికి మళ్ళించింది. "ఆదిశక్తి నన్ను క్షమించాలి.. మళ్ళీ ఆ మాటే అంటాను. ఇంటింటా జన్మించే అవకాశం నీకు లేదు దేవీ..."

"ఎందులకు?" ఆదిశక్తి గర్జించింది.

"ప్రతి ఇంటిలోనూ ఒక మాతృగర్భంలో నువ్వు ప్రవేశించిన అచిరకాలంలో గర్భంలో వున్నది స్త్రీ శిశువు అని మానవులు ఇట్టే కనిపెట్టేస్తారు. మరుక్షణం నువ్వు భ్రూణహత్యకు బలైపోతావు''

"ఆ!" మహావిష్ణువూ, ఆదిశక్తీ ఒకేసారి అన్నారు.

"వరకట్న దురాచారం మూలంగా, ప్రస్తుతం ఈ దేశంలో మనుషులు ఆడపిల్లలకి ఆహ్వానం పలకడంలేదు. గర్భస్థశిశువు ఆడో, మగో కనిపెట్టే ప్రక్రియను మనిషి కనిపెట్టాడు. గర్భంలో ఆడపిల్లవుంటే భ్రూణదశలోనే కర్కశంగా చంపిపారేస్తారు. ఒకవేళ పొరపాటున జన్మిస్తే 'శిశుహత్య' జరిగిపోతుంది. అందువల్ల..."

"దారుణం. ఘోరం" విష్ణువు ఉద్రేకంగా అన్నాడు.

"అట్లయినచో నేను జన్మించి తీరవలెను. ఆడజాతిని అంకురదశలోనే అంత మొందించుచున్న అధర్మమును కూడా అణగద్రొక్కవలెను'' ఆదిశక్తి ఆవేశంతో అంది.

"అందుకు మరో ఉపాయం, అపాయంలేని ఉపాయం ఆలోచించాలి'' భూదేవి అంది.

"వేరొక ఉపాయమేమున్నది? అవతరించవలెనన్న పుట్టవలెను. పుట్టవలెనన్న స్త్రీ గర్భవాసమును ఆశ్రయించవలెను. శిశువుగా ఎదగవలెను. భూమిమీద పడవలెను. బాల్యావస్థ

ను, కౌమారావస్థను అధిగమించి యవ్వనావ స్థను చేరవలెను..." విష్ణువు తన రామావ తారాన్నీ, కృష్ణావతారాన్నీ గుర్తుచేసుకుంటూ అన్నాడు. "అటుపిమ్మట ధర్మసంస్థాపనము ను ఆరంభించవలెను''

"ఆ అవస్థలన్నీ గడిచి, ఆదిశక్తి కార్యోన్ము ఖురాలయ్యేటప్పటికి దాదాపు రెండు దశాబ్దా లు అంటే ఇరవై మానవ సంవత్సరాలు పడుతుంది. అప్పటిదాకా నా అవస్థ ఎలా వుంటుందో ఆలోచించండి! పైగా గర్భంలోప డి, పుట్టి పెరిగే, అవకాశం ఆడపిల్లకు లేదని మళ్ళీ మీకు గుర్తుచేస్తున్నాను. అబార్షన్ అనే ఆయుధం మనిషిచేతిలో వున్నంతకాలం, ఆ ఆయుధాన్ని స్వార్థం అనే రాతిమీద మానవు డు పదనుపెడ్తున్నంతకాలం... అది శక్తి ఐనా సరే, ఆదిదేవుడైనాసరే ఈ వేదభూమిలో ఆడపిల్లగా జన్మించలేదు''

"జటిల సమస్య దాపురించినదే'' విష్ణువు సాలోచనగా అన్నాడు.

"ఎంతటి జటిల సమస్యకైనను ఈ ఆదిశ క్తి దగ్గర పరిష్కారం ఉండగలదు'' ఆదిశక్తి సగర్వంగా అంది. గర్భవాసమున ప్రవేశింప కయే, నవమాసములు కాపురం చేయకయే పుట్టకయే పెరుగకయే సంభవించు శక్తి ఈ ఆదిశక్తికి ఉన్నది'

మహావిష్ణువూ, భూదేవీ ఆదిశక్తివైపు ఆశ్చ ర్యంగా చూశారు.

"శ్రీహరీ!: స్త్రీశక్తిని నిరూపిస్తాను. ఆడపిల్ల గా జన్మింపకయే ప్రతి ఇంటియందునూ సంభవిస్తాను''

"దేవీ, అదెటుల సాధ్యము?" విష్ణువు అనుమానంగా అడిగాడు. "ఆ కార్యము మే మే చేయలేకపోయితిమి''

ఆదిశక్తి చిన్నగా నవ్వింది. "ఇప్పటికే జన్మించి, యువతులైన వారిలో నా అంశను ప్రవేశపెట్టి, ఆవిధంగా జన్మించెదను''

"నా సమస్యకు అది అద్భుతమైన పరి ష్కారం" భూదేవి ఉత్సాహంగా అంది.

ఆదిశక్తి ఉద్రేకంతో మహావిష్ణువును చూ సింది. ఉన్నట్టుండి ఆమె ఆకాంక్ష రక్తవర్ణాన్ని సంతరించుకుంది. రెండు భుజాలనుండీ ఎన్నో చేతులు ఆవిర్భవించాయి. ఆ చేతు లలో రకరకాల ఆయుధాలున్నాయి. ఆమె నుండీ వెల్లివిరుస్తున్న కాంతిని చూడలేక భూదేవి ఒక్కసారి కళ్ళు మూసుకుంది. ఆకా శంలో, ఉన్నట్టుండి ఓంకారం ప్రతిధ్వ నించింది.

"సంభవామి గృహేగృహే!" ఆదిశక్తి గంభీరంగా అంది. ఆమె కంఠధ్వని మేఘగ ర్జనలా ప్రతిధ్వనించింది.

"తథాస్తు... విజయోస్తు'' విష్ణువు ఆనందంగా అన్నాడు.

భూదేవి ఆదిశక్తికి నమస్కరించింది. "ధ న్యోస్మి దేవీ''

"సంభవామి గృహే గృహే'' ఆదిశక్తి కంఠం గుహలో సింహనాదంలా ధ్వ నించింది.



ఏకాగ్రతతో రాసుకుపోతున్న సహజ తటా లున ఆగింది. ఆమె చేతిలోని పెన్ అప్రయ త్నంగా జారి టేబుల్‌మీద పడింది. అసంక ల్పితంగా ఆమె తను రాసిన పంక్తుల్ని చదవసాగింది ఆమె చూపులు ఉద్రేకంతో అక్షరాల వెంట పరుగులు తీస్తున్నాయి.

"ఇప్పటికే జన్మించి యువతులైన వారిలో నా అంశను ప్రవేశపెట్టి ఆ విధంగా జన్మించె

దను''

"అంశరూపమున ప్రవేశించి, వారికి నిజమైన స్త్రీమూర్తులుగా పునర్జన్మ ప్రసాదించెదను''

"వారి మూలమున అధర్మమును నాశనముచేసి, ధర్మమును ప్రతిష్ఠించెదను''

"స్త్రీజాతికి గతవైభవమును సముపార్జించెదను''

"సంభవామి గృహేగృహే!"

తను రచయిత్రిగా ఎదగాలనుకున్న తరువాత రాస్తున్న 'సోషియో ఫాంటసీ' నవలలో పరిచయం చేస్తున్న పాత్రల్లో లీనమైపోయి అక్షరబద్ధం చేసిన పంక్తులు సహజను ఏదో ఆశ్చర్యంలో, ఏదో ఆవేశంలో ముంచేస్తున్నాయి. కాలస్థల పరిణామాలను తాత్కాలికంగా మరిచిపోయి, భావోద్రేకంతో తను రాసిన పంక్తుల్ని- ఆదిశక్తి మాటల్ని- అప్రయత్నంగా మళ్ళీ మళ్ళీ చదవసాగింది సహజ. ఒకసారి, రెండోసారి. మూడోసారి.

పాఠకులలో నూతనోత్తేజాన్ని నింపి, ఉద్యమస్ఫూర్తిని కలిగించే ఆలోచనతో తను రచయిత్రి అవాలనుకుంది; కలం అందుకుంది. నల్ల సిరాతో తెల్లకాగితం మీద రాసే అక్షరాలకి అంత శక్తి ఉందా? అక్షరానికి అంత మహత్తు ఉందా? ఉంది. తప్పకుండా ఉంది. దాని పేరే అక్షరం- అంటే నాశనం లేనిది. ఎప్పటికీ నాశనం లేనిదానికి ఎప్పుడూ శక్తి వుంటుంది. అందుకే తను రాసిన అక్షరాలు తనని స్పందింపజేస్తున్నాయి.

ఎవరినో వెన్నుతట్టి మేల్కొలపాలనుకున్న తననే మేల్కొలుపుతున్నాయి.

అంటే... అంటే... తనలో కూడా ఆ ఆదిశక్తి అంశను ప్రవేశపెట్టుకోవాలనేగా!

తనూ ఒక ఆదిశక్తిగా రూపొందాలనేగా!

ఎంత అద్భుతమైన భావం!

సహజ ఇక పడుకోలేక, లేచి కూచుంది. ఔను! తన రచననుండి మొట్టమొదట స్ఫూర్తిని తనే పొందుతుంది. పొందితీరాలి. అది ధర్మం! అది రచయిత్రిగా తన విధి.

ఆదిశక్తి స్వరూపంగా రూపొందమని ఇతర్లని ఉద్బోధించే తనకి, ఆవిధంగా రూపొందాల్సిన బాధ్యత ఉంది. ఉపన్యాసం ఇచ్చి ఉద్బోధించడంతో రచయిత లేక రచయిత్రి బాధ్యత తీరిపోదు; తీరిపోకూడదు. లోకానికి చెప్పాల్సిందేదో చెప్పేసి, పెన్ కిందపెట్టి కళ్లు మూసుకోవడం కేవలం థియరీ! చెప్పాల్సింది నోటితో, రాతతో చెప్పకుండా చేతల్లో చూపించేది ప్రాక్టికల్! యస్! తను ప్రాక్టికల్‌గా ఉండాలి. పాటించకుండా చెప్పే నీతి, నీతికాదు. ఆచరించకుండా చెప్పే ధర్మం ధర్మం కాదు.

అంచేత... అంచేత... తను ఆదిశక్తి అంశను తనలోకి ఆవిష్కరించుకుంటుంది.

ఆదిశక్తిగా రూపొందుతుంది.

స్త్రీ శక్తిని నిరూపిస్తుంది.

ఆడదాని ఆత్మగౌరవాన్ని కొత్తగా ఆవిష్కరిస్తుంది.

సహజ ఆలోచిస్తూ టేబుల్ దగ్గరగా నడిచింది. తను రచయిత్రిగా ఒక చట్రంలో పరిమితం అవకూడదు. ఆ పరిధిని ఛేదించి, వైశాల్యాన్ని సంతరించుకోవాలి.

సహజ తను రచయిత్రి కాకూడదని ఆ క్షణంలో నిశ్చయించుకుంది.

★ ★ ★

"సహజా!"

తండ్రి పిలుపు సహజను- కాలస్థల పరిణామాలకు అతీతమైన ఏదో లోకంలో వున్న సహజను- వర్తమానంలోకి లాగింది.

"వస్తున్నా నాన్నా!" ఆలోచనలకు ఆనకట్ట వేస్తూ కుర్చీలోంచి లేచింది సహజ. గుమ్మందాటి మెట్లు దిగసాగింది. ఇందాకటి నిర్ణయం ఆమెలో నింపిన ఉద్రేకం ఆమె నరాల్లో పొంగిపొర్లుతోంది. మేడమీదనుంచి

ఒక్కోమెట్టే కిందికి దిగుతున్న ఆమెకి ఎందుకో- ఏవో అంతస్థులకి ఎక్కుతున్నట్టనిపిస్తోంది...విచిత్రం!

"ఎన్నిసార్లు పిలిచినా వినిపించుకోకుండా, ఏ లోకంలో వున్నావమ్మాయ్?" మంద లింపూ, విసుగూ కలగలిపి ప్రశ్నించిన తల్లి వేపు సహజ చిరునవ్వుతో చూసింది.

"ఎన్నిసార్లో ఎక్కడ పిలిచారమ్మా! నాన్న పిలుపు చెవిని పడగానే వస్తున్నాగా!" పాత సోఫాలో పక్కపక్కనే కూచున్న తల్లిదండ్రుల ఎదురుగా కుర్చీలో కూచుంటూ అంది.

"ఎన్నిసార్లు పిలిచినా, నీకు చివరిపిలుపే వినిపించి వుంటుందిలే ఆఁ! అదలావుంచుదాం... అసలు విషయం చెప్పు! మదన్ నచ్చాడా? అతని అమ్మా, నాన్నా అయిదు గంటలకి ఇక్కడికి వస్తున్నారు. మంచీ చెడూ మాట్లాడి సమ్మంధం ఖాయం చేసెయ్యాలి" తండ్రి శ్రీమంతరావు అన్నాడు.

"మదన్..." సహజ కళ్లు చిట్లిస్తూ అంది. "అతనెవరు నాన్నా?"

"విడ్డూరంగా మాట్లాడకే! పెళ్ళిచూపులు జరిగి వారం కూడా కాలేదు. అబ్బాయి పేరు మరచిపోయావా?" అమృతమ్మ అసహనంగా అంది. "అడిగిన ప్రతీసారీ 'ఆలోచించి చెప్తా. ఆలోచించి చెప్తా' అంటూ నాన్చి చంపుతున్నావుగా"

సహజ లోపల్లోపలే నాలుక కరుచుకుంది. పెళ్ళికొడుకు. అతన్నీ, అతని పేరునీ తను మరిచిపోయింది. పొద్దుట తను కాగితాలూ, కలం తీసుకున్నప్పట్నుంచీ, రాస్తున్నదాన్ని ఆపేసినప్పట్నుంచీ... ఎందుకో గుర్తున్నవన్నీ మరచిపోతోంది. ఇంతకాలం మరిచిపోయినవాట్ని కొత్తగా గుర్తుచేసుకుంటోంది.

"ఇంకా ఎంత ఆలోచిస్తావ్? చెప్పమ్మా" తండ్రి కంఠస్వరం సహజని హెచ్చరించింది.

"నా నిర్ణయం అలా వుంచు నాన్నా... పెళ్లి చేయడానికి డబ్బు ఉందా నాన్నా?"

శ్రీమంతరావు చిన్నగా నవ్వాడు. "నేతిబీరకాయ పేరూ, నా పేరూ ఒకటే తల్లీ! చేసే శక్తివున్నా, లేకపోయినా కొన్ని ఆగవు. వాటిలో ఆడపిల్ల పెళ్ళి ఒకటి. ఈ ఇల్లుంది, నేనున్నాను... కట్నంకింద ఇల్లు రాసిస్తే చాలంటూ వాళ్లు పరోక్షంగా తెలియజేశారు. పోతే... ఖర్చులకి ఆదా చేసినదానికి అప్పు జతచేసి"

"ఎలాగో జరిపిస్తాం!" అమృతమ్మ అందుకుని పూర్తిచేసింది. "ఐనా, అదంతా నీకెందుకూ? కుర్రాడు నచ్చాడా, లేదా- ఆమాత్రం చూసుకో చాలు"

"ఇల్లు కట్నంకింద ఇచ్చేస్తే... అమ్మా, నువ్వూ ఎక్కడుంటారు,, నాన్నా...?"

శ్రీమంతరావు మందహాసం చేశాడు. "పుట్టిన ప్రతివాడూ, ఈ ప్రపంచంలో సొంత ఇంట్లోనే బతకడంలేదమ్మా! ఏ అద్దెకొంపలోనో కాలాన్ని అరగదీస్తాం. మా గురించి బుర్రపాడు చేసుకోకు. నీ ఇష్టం చెబితే..."

"అబ్బబ్బ... ఇంకా పసిగట్టకపోతే ఎట్లాగండీ. కట్నంకింద ఇల్లు ఇచ్చేస్తే, మీ సంగతేమిటి?' అని అది అడిగినప్పుడే దాని ఇష్టం తెలిసిపోలా? ఇష్టం. లేకపోతే అందాకా రాదుగా" అమృతమ్మ నవ్వింది.

తన మాటలకి వక్రభాష్యం చెప్తున్న తల్లి వైపు చూస్తూ సహజ పైకిలేచింది. "నేనింకా ఏదీ నిర్ణయించుకోలేదు. నాన్నా... నా కోసం నా స్నేహితురాల్ని కూడా ఆలోచించమన్నాను. దాన్తో మాట్లాడి చెప్తాను"

"నీ కోసం మరొకరు ఆలోచించడమేమిటి? తిక్క కాకపోతే ఆమాత్రం నువ్వు తేల్చుకోలేవూ?" అమృతమ్మ కసిరింది. "అవతల... సాయంత్రం వాళ్ళొచ్చేస్తున్నారు"

"వాళ్ళొచ్చేలోగా నచ్చిందీ, నచ్చనిదీ చెప్తాలేమ్మా" అంటూ సహజ మేడమెట్లవైపు వెళ్ళిపోయింది.

★ ★ ★

గుమ్మందాటి లోపలకి వచ్చిన సహజను అతను ఆశ్చర్యంతో, నమ్మలేనట్టు చూశాడు.





తను వస్తున్నట్టు ఫోన్లో చెప్పినప్పుడు అతని కంఠంలో ధ్వనించిన ఆశ్చర్యం ఇప్పుడు అతని కళ్ళల్లోకి వలసవచ్చినట్టు సహజ గుర్తించింది. తనను చిరునవ్వుతో చూస్తున్న సహజను అతను మౌనంగా చూస్తూ వుండి పోయాడు. అతని చూపులు ఆమెని తల నుండి పాదాలదాకా పరిశీలనగా చూస్తూ, అందమైన వర్ణచిత్రానికి ఫైనల్ టచస్ ఇస్తు న్న ఆర్టిస్టు బ్రష్‌లా కదులుతున్నాయి. తను ముందు చూసినప్పటికన్నా ఇప్పుడు ఆమె అందం వెయ్యింతలు పెరిగినట్టనిపిస్తోందత నికి. అప్పుడు- ఆమె చూపుల్ని సిగ్గుతో బరువెక్కిన కనురెప్పలు నిర్విరామంగా కిందికి దించుతూ వుండిపోయాయి. ఇప్పు డు- ఆ చూపుల్లో ఆ నునుసిగ్గు లేదు. నీలిరంగు నీళ్ళతో నిండిన జంటసరోవరాల్లా వున్న ఆమె విశాలనేత్రాలు ధైర్యంగా అతని కళ్ళల్లోకి చూస్తున్నాయి.

"మీతో కొంచెం మాట్లాడాలి..." స్తంభంలా నిలబడ్డ అతన్ని హెచ్చరిస్తున్నట్టు అంది సహజ.

"...అయాం సారీ... ప్లీజ్ సిడౌన్! ఇప్పు డు... నువ్వు సారీ... మీరు... ఇక్కడ... ఐమీన్... అమ్మా నాన్నా మీ ఇంటికెళ్ళా రు..." తడబడుతూ అన్నాడు మదన్. పెళ్ళి చూపులు చూసిన యువకుడు.

"తెలుసు" సహజ నవ్వుతూ అంది. "వా ళ్లు వెళ్ళడం చూసే, లోపలికి వచ్చాను"

ఆమెకి సోఫా చూపించి మదన్ వెనక్కి తిరిగాడు. "మంజూ! మంజూ! కమాన్! ఎవరొచ్చారో చూడు"

ఎదురుగా వున్న డోర్‌కర్టెన్ని తొలగించు కుంటూ ఇరవై ఏళ్ళ యువతి హాల్లోకి వచ్చింది. బాబ్డ్ హెయిర్. పంజాబీ డ్రెస్. చెవులకి గాజులసైజు రింగులు. రక్తం పులిమి నట్టున్న లిప్‌స్టిక్.

"ఎవరో తెలుసా? నాకు కాబోయే... ఐ మీన్... నీకు కాబోయే వదిన! మిస్ సహజ!" దగ్గరగా వచ్చిన చెల్లెలికి పరిచయం చేస్తూ అన్నాడు మదన్. "మై అఫెక్షనేట్ సిస్టర్ మంజరి!"

సహజ నమస్తే చెప్పింది. 'హలో' అంది మంజరి. మదన్ మరో సోఫాలో కూచున్నా డు. మంజరి అతని పక్కనే కూచుంది. ఆమె కళ్లు సహజని అంగుళం అంగుళం వంతున పరీక్షగా చూస్తున్నాయి.

"పెళ్ళిచూపులప్పుడు మంజరి ఊళ్ళోలే దు... ఫోటో చూపించాను. రెండు మూడు రోజుల్లో ఇద్దరం రావాలనుకున్నాం" మదన్ సంజాయిషీ యిస్తున్నట్టుగా అన్నాడు.

"అన్నయ్యా, కాఫీ తెస్తా!" మంజరి లేచి లోపలికి వెళ్లిపోయింది.

విశాలంగావున్న హాలునీ, వంకీలు తిరిగి పైకి వెళ్తున్న మెట్లనీ చూసి, సహజ తన చూపుల్ని అతనివైపు తిప్పింది.

"వరస కలిపినందుకు థాంక్స్!" అంది నవ్వుతూ.

మదన్ చిన్నగా నవ్వాడు. "ఏదో మాట్లాడా లన్నావు..." అన్నాడు ఏకవచనంలో.

"ఇల్లు మీ సొంతమే అనుకుంటాను" సహజ అతని మాటని నిర్లక్ష్యం చేస్తున్నట్టు అంది.

"అఫ్‌కోర్స్! కుడిపక్కవున్న బిల్డింగ్ కూడా మనదే!" మదన్ కంఠంలో గర్వం స్పష్టంగా ధ్వనించింది. "నాలుగు సైట్స్ కూడా వున్నాయి!"

మనదే!... సహజ లోపలే నవ్వుకుంది. అయితే నిర్ణయం జరిగిపోయిందన్నమాట.

"మనదే అంటున్నారు... నేను మీకు నచ్చానా?" అతని కళ్లల్లోకి సూటిగా చూస్తూ అడిగింది సహజ.

చిరునవ్వు మదన్ మొహాన్ని వెలి గించింది. "అఫ్‌కోర్స్..."

"మీ సమాధానం 'చూద్దాం...!' అన్న

రాజకీయ నాయకుడి వాగ్దానంలా చాలా క్లుప్తంగావుంది! ఇంకొంచెం వివరంగా వుంటే గానీ నాకు తృప్తి కలగదు'' సహజ నవ్వుతూ ఆపి అతని మొహంలోకి చూసింది.

"నా అందం చందం మీకు నచ్చాయా?"

"నచ్చాయిగా! నేను కలలుకన్న అందం నీలో కనిపించింది. వివరంగా కావాలన్నావు గా!" మదన్ నవ్వాడు.

"థాంక్స్! నా చదువూ సంధ్యా నచ్చా యా?"

మదన్ ఆమె కళ్లల్లోకి అదోలా చూశాడు. "నాకంటే ఒకటో రెండో ఆకులు ఎక్కువ చదివుంటే నచ్చేది కాదేమో! మనిద్దరి క్వాలి ఫికేషన్ ఒకటేగా! నచ్చకేంజేస్తుంది?"

"ఎగైన్ థాంక్స్! నా సభ్యతా సంస్కారం?..." సహజ నవ్వుతూనే అంది, "నచ్చాయా?"

"అఫ్‌కోర్స్... సందేహంలేదు!"

"థాంక్సెలాట్!" సహజ నవ్వుతూ అంది. "అయితే, నా అందం చందం, చదు వూ-సంధ్యా, సభ్యతా-సంస్కారం వెరసి నా వ్యక్తిత్వం పూర్తిగా నచ్చి మీరు నన్ను పెళ్లా డ్డానికి నిశ్చయించుకున్నారు అంతేగా!"

మదన్ కళ్లు చిట్లిస్తూ చూశాడు. "అఫ్ కోర్స్... ఎందుకలా గుచ్చిగుచ్చి అడుగుతు న్నావ్?"

"మనిద్దరం ఒకర్నొకరు అర్థం చేసుకోడాని కీ, ఒకరి తత్వాన్నొకరు అవగాహన చేసుకోడా నికీ మనకి అవకాశంలేకపోయింది. ఎందు కంటే పూర్వ పరిచయం లేదు, ప్రేమాలేదు! అంచేత నన్ను నన్నుగా ఇష్టపడి, మీరు మీ జీవితాన్ని సగం నాకు ఇచ్చి, నా జీవితాన్ని సగం తీసుకుని జీవించడానికి సిద్ధంగా వున్నారని రూఢి చేసుకోవాలనుకున్నాను తప్పా?" సహజ నవ్వుతూ అడిగింది.

మదన్ చిన్నగా నవ్వేశాడు. "నాటెటాల్! నిజం చెప్పాలంటే ఈ ఇంటర్వ్యూని నేను లైక్ చేస్తున్నా!"

"థాంక్స్! మళ్లీ అడుగుతున్నందుకు మరో లా అనుకోకండి. మీరు ఇందాక చె ప్పిందంతా నిజమేగా! నా వ్యక్తిత్వం, నేనూ నచ్చడం" సహజ నవ్వుతూ ఆగింది.

"నిజం కాకపోతే మా మమ్మీడాడీ ఇవాళ మీ ఇంటికి వెళ్లరుగా?" మదన్ ప్రశ్నతో సమాధానం అందించాడు.

"దెన్... అయాం సారీ... మా అమ్మానా న్నా మిమ్మల్ని తప్పుగా అంచనా వేశారు''

"వాట్!?" మదన్ కంఠంలో ఆశ్చర్యం గంటలా మోగింది. "ఎందుకూ?"

"నేనొక్కత్తినే కాకుండా, నా పక్కన మా ఇల్లు వుంటేగానీ, ఆ ఇంటిని నా కొంగులో ముడేసి యిస్తేగానీ మీరు నన్ను చేసుకోరు అనుకుంటున్నారు!"

మదన్ నోరు కొద్దిగా తెరుచుకుంది. ఆశ్చ ర్యం, అనుమానం, ఒకదానితో ఒకటి పోటీప డుతూ అతని మొహం మీద నాట్యం చేయ సాగేయి.

"అయితే నేను వెళ్తాను! నన్నూ ప్లస్ మా ఇంటినీ కాకుండా నన్ను మాత్రమే మీరు పెళ్లి చేసుకుంటారని మా నాన్నకు అర్జెంటుగా చెప్పాలి!" సహజ పైకిలేస్తూ అంది.

"ఒక్క క్షణం!" మదన్ కంఠంలో ధ్వ నించిన ఆత్రుత సహజను అతనివైపు తిప్పింది.

"మీ నాన్నగారు కట్నం ఇవ్వలేమన్నారు! అందుకని ఇల్లు రాయించుకోడానికి మా వా ళ్లు వొప్పుకున్నారు..." మదన్ చాడీ చెప్తున్న ట్టు అన్నాడు.

సహజ, కళ్లు విశాలంగా చేస్తూ చూసింది "మీకు కట్నం కావాలా?"

"నీ ప్రశ్నకు అర్థం లేదు! 'కట్నం కావా లా?' అని అడగరు. కట్నం ఇస్తాం అని చెప్తారు..."

"మిస్టర్ మదన్, దయచేసి నా ప్రశ్నకి




సమాధానం చెప్పండి! మీకు కట్నం కావాలా?" సహజ అక్షరాల్ని నొక్కుతూ అడిగింది.

మదన్ క్షణకాలం ఆమెని రెప్పవేయకుండా చూశాడు. ఆమె కళ్లు అతన్ని ఛాలెంజ్ చేస్తున్నాయి.

"అఫ్‌కోర్స్!"

"ఇందాక నన్నూ, నా వ్యక్తిత్వాన్నీ నచ్చి, చేసుకుంటున్నానన్నారే!" సహజ చిరునవ్వుతో అడిగింది. "అది అబద్ధమా? మీరు అబద్ధాలాడతారా?"

"అబద్ధాలు ఆడాల్సిన ఖర్మ నాకు పట్టలేదు!" మదన్ ఆవేశంగా అన్నాడు. "అమ్మాయి నచ్చింది' అంటే ఆమె తెచ్చే కట్నంతో కలిసి నచ్చింది అని అర్థం! దటీస్ ది ఆర్డర్ ఆఫ్‌దిడే!"

"దటీస్‌ది డిసార్డర్ ఆఫ్‌దిడే, మిస్టర్ మదన్!" సహజ సోఫాలో కూచుంటూ అంది, "కట్నం అనేది సాంఘిక దురాచారం! కట్నం ఇవ్వడం, తీసుకోడం నేరం!"

మదన్ సమాధానం చెప్పకుండా అయిష్టంగా చూశాడు. సహజ అతనివైపు సానుభూతితో చూసింది.

"మిస్టర్ మదన్.. మీ అమ్మానాన్నలకు మీరొక్కరే కొడుకు. మీకు రెండు ఇళ్లున్నాయి. నాలుగు సైట్స్ ఉన్నాయి. మాకు ఉన్న ఆస్తల్లా ఆ ఇల్లు ఒక్కటే! అది ఇచ్చేస్తే మా అమ్మానాన్న వీధిన పడాలి''

"అయాంసారీ... అదంతా నాకు చెప్పకూడదు! ఇంతదూరం అడిగావు కాబట్టి చెప్తున్నా... కట్నం లేకుండా మావాళ్లు నాకు పెళ్లి చేయరు!"

"పెద్దల సంగతి వదిలేయండి! కట్నం లేకుండా మీరు చేసుకుంటారా?" సహజ అతన్నే చూస్తూ అడిగింది.

"అయాం సారీ... కట్నం గురించి ఏం మాట్లాడాలన్నా పెద్దలతోనే మాట్లాడాలి!" మదన్ ఇబ్బందిగా అన్నాడు.

"దయచేసి మీ సంగతి చెప్పండి!" సహజ సౌమ్యంగా అడిగింది. "మీరు వొప్పుకుంటే మనిద్దరం కలిసి మీ పెద్దలతో మాట్లాడదాం"

మదన్ అయిష్టంగా చూస్తూ, అసహనంగా కదిలాడు, "అయాం సారీ... నా కట్నం మీద మా నాన్న చాలా ప్లాన్ చేశాడు. మీ వాళ్లిచ్చే కట్నంతో లేదా మీ వాళ్లిచ్చే ఇల్లు అమ్మితే వచ్చే కట్నం... ఐమీన్ డబ్బుతో మంజరి పెళ్లి చేయాలనుకుంటున్నారు. అంటే నా కట్నం నా చెల్లెలికి కాబోయే భర్తకు కట్నంగా మారుతుంది''

సహజ ఆశ్చర్యంగా చూసింది. "మా నాన్నచేత ఒక పొరపాటు చేయించి, మీరు రెండు పొరపాట్లు చేయాలనుకుంటున్నారు!"

"పొరపాట్లా? ఏమిటో అవి?" మదన్ కొంచెం కోపంగా అడిగాడు.

"ఒకటి! కట్నం తీసుకుంటున్నారు. రెండు కట్నం ఇస్తున్నారు!" సహజ జవాబిచ్చింది. "మిస్టర్ మదన్, మనది ఆధునిక యుగానికి చెందిన యువతరం! దురాచారాల్ని ఖండించాల్సిన బాధ్యత మనమీద ఉంది! వరకట్న దురాచారాన్ని ఖండించుదాం! నా మాట విని..."

"కట్నం గిట్నం లేకుండా నిన్ను పెళ్లి చేసుకొమ్మంటావ్! అంతేగా!"

"నాతో పెళ్లి గురించి మాత్రమే నేను మాట్లాడ్డం లేదు. కట్నం అనే దురాచారం గురించి మాట్లాడుతున్నాను''

"ఓహో.... యాంటీడౌరీ కాంపేనా! అది నాతో ప్రారంభించాలనుకున్నావా? తెలివైనదానివే!" మదన్ కంఠధ్వని వెటకారంతో పదునెక్కివుంది.

"నిజం చెప్పావన్నయ్యా!" కాఫీ ట్రేతో వచ్చిన మంజరి సహజకు మాట్లాడే అవకాశం ఇవ్వకుండా అంది, "ఈవిడ చాలా చాలా తెలివైంది. వధు కట్నం ఎదురిచ్చి నువ్వీమెని అర్జెంటుగా పెళ్లి చేసేసుకోవాలి!"

"మిస్ మంజరీ..!" మంజరి మాటల్లోని ఎగతాళినీ, హేళననూ గుర్తించిన సహజ ఆశ్చర్యంగా అంది.

మంజరి తల చివాల్న సహజవైపు తిరిగింది. బాబ్డ్‌హెయిర్ కోపంగా కదిలింది. "షటప్! నా విషయంలో కట్నం ఇవ్వొద్దని చెప్పడానికి నువ్వెవరు?" మంజరి హూంకరించింది. "కాఫీ చేస్తూ ఇందాకట్నుంచీ నీ ఆర్గ్యుమెంట్ వింటూనే వున్నా! నాకు కాబోయే భర్తకు కట్నం ఇవ్వాలో వద్దో నిర్ణయించేది నేను, నువ్వు కాదు!"

మంజరి రియాక్షన్ సహజను చెంపపెట్టులా తాకింది. అవమానాన్ని దిగమింగుతూ ఆవేశాన్ని అదుపులో పెట్టుకుంటూ అంది, "అయాం సారీ... నిర్ణయించేది మీరే! అయితే కట్నంపోసి భర్తను కొనుక్కోవాల్సిన ఖర్మ ఆడ పిల్లలకు లేదు అనే సత్యాన్ని గుర్తుంచుకొమ్మని నా సలహా..."

"నీ సలహా నీ దగ్గరే వుంచుకో! ఎందుకంటే నేను కట్నం ఇచ్చే దర్జాగా పెళ్లి చేసుకుంటాను! అత్తారింట్లో నా వాటా గౌరవం నాకు దక్కాలి! రేపొద్దున అవసరంవస్తే 'అడిగినంత పారేసి నిన్ను మొగుడిగా చేసుకొన్నాను' అని అనగలిగే ఆత్మవిశ్వాసం నాకు ఉండాలి! ముఖ్యంగా చిల్లికుండతో అత్తారింటికెళ్లిపోయి వంటగ్యాస్‌కీ, కిరోసిన్‌కీ, రోప్‌ట్రిక్‌కీ బలైపోయే మహద్భాగ్యం నాకు పట్టకూడదు! అత్తింటి వాళ్లెవరూ నన్ను చిన్న చూపు చూడ్డానికి వీల్లేకుండా మహరాణిలా కట్నం పారేసి, యువరాణిలా కాపరానికెళ్తాను! అర్థమైందా?" వీరావేశంతో అరిచి కాఫీ కప్పుల్ని మదన్‌ముందూ, సహజ ముందూ టీపాయ్‌మీద ధన్‌మని పెట్టింది మంజరి.

సహజ మంజరి వైపు నివ్వెరపాటుతో చూసింది. కట్నం ఇవ్వకపోతే మీ అమ్మాయిని చేసుకోను అనే మగాళ్లున్నారని తనకి



తెలుసు! అలాంటివాళ్లని తను రోజూ చూస్తూనే వుంది. అయితే నాకు కాబోయేవాడికి కట్నం ఇవ్వకపోతే పెళ్లి చేసుకోను అనే ఆడపిల్లని తను మొదటిసారిగా ఈ రోజే చూస్తోంది. ఆడపిల్లల హృదయాల్లో ఇలాంటి భయంకరమైన ఆలోచనల్ని పుట్టించగలిగిన కట్నం శక్తి నిజంగా గొప్పదే!

"మిస్ మంజరీ, కట్నంతో మీరు భర్తను కొనగలరు. కానీ గౌరవాన్నీ, ఆత్మవిశ్వాసాన్నీ కొనలేరు!"

"నో లెక్చర్స్ ప్లీజ్!" మంజరి కోపంగా గద్దించింది. "నేను కట్నంతో మొగుణ్ణి కొనుక్కుంటాను! కట్నం ఇచ్చే సత్తా లేకపోతే, గతిలేకపోతే మా అన్నయ్య కాళ్లావేళ్లాపడి బతిమాలుకో! అంతే"

"మిస్ మంజరీ!" సహజ తీక్షణంగా చూస్తూ అంది.

"ఏం? కరుస్తావా?" మంజరి గర్జించింది.

"ఆమెతో నేను మాట్లాడతాను... నువ్వూరుకో" అంటూ మదన్ సహజవైపు చూపుల్ని తిప్పాడు. "అయితే కట్నంగానీ, కట్నంకింద ఇల్లుగానీ ఇచ్చే ఉద్దేశం నీకు లేదు. అంతేగా?"

సహజ అతన్ని నిదానించి చూసింది. "మిస్టర్ మదన్... ఒక సామాజిక దురాచారాన్ని ఖండించే రెండువైపులా పదునున్న కత్తిలాంటి అవకాశం మీ చేతిలో వుంది. దయచేసి కట్నం తీసుకోకండి, కట్నం ఇవ్వకండి! ఆ విషవృక్షాన్ని ఆడజాతిని సర్వనాశనం చేస్తున్న కట్నం అనే కాలకూట విషవృక్షాన్ని కూకటివేళ్లతో పెళ్లగించేందుకు కృషి చేయండి..."

"చూశావా? కట్నం ఇవ్వొద్దు అంటూ మళ్లీ నా విషయంలో..." మంజరి రోషంగా మదన్‌తో చాడీ చెప్పబోయింది.

"నువ్వూరుకో!" మదన్ విసుగ్గా అన్నాడు.

లేచి నిలబడి, సహజవైపు కిందికి చూశాడు.

"మొట్టమొదట నాకో విషయం క్లియర్ కావాలి! నువ్వు కట్నం ఇవ్వలేమని చెప్పడానికి వచ్చావా! వరకట్న వ్యతిరేక ఉద్యమం నడపడానికి వచ్చావా?"

సహజ చిరునవ్వు నవ్వింది. "ఉద్యమమే! నా విషయంలో ఇవ్వను అని చెప్పడం నా ఉద్యమానికి ప్రారంభం అనుకోండి!"

"దెన్... యూకెన్‌గో... నీ కాన్వాసింగ్ అయిపోయింది!" అంటూ మదన్ కదలబోయాడు.

"మిస్టర్ మదన్..."

మదన్ సహజవైపు అయిష్టంగా చూశాడు.

"మగవాడు డబ్బిచ్చి ఆడదాన్ని, ఆడదాని శరీరాన్ని కొనుక్కుంటాడు. అది వ్యభిచారం. ఆడపిల్ల డబ్బిచ్చి, కట్నం ఇచ్చి మగవాణ్ణి భర్తగా కొనుక్కోవడం కూడా నా దృష్టిలో వ్యభిచారమే! మొదటిది తాత్కాలిక వ్యభిచారం. రెండోది శాశ్వత వ్యభిచారం"

"సహజగారూ... మీ దృక్పధానికి కంగ్రాచ్యులేషన్స్! అందమైన, తెలివైన యువతిని నేను లైక్ చేస్తాను. సరైన ఆఫర్ వస్తే పెళ్లి చేసుకుంటాను. మీలో అందం వుంది. అతి తెలివి వుంది! అతి తెలివున్న ఆడది ప్రమాదం! ప్రమాదాన్ని నేను పెళ్లి చేసుకోను. ఎంత కట్నం వచ్చినాసరే! ఇంక దయచేస్తారా?"

"వెల్‌సెడ్ అన్నయ్యా! ఈ మహా తల్లిని ఇంటికోడలిగా తెచ్చుకుంటే అమ్మో ఇంకేమన్నావుందా!" మంజరి చేతులు తిప్పుతూ అంది, "అయితే నువ్వు మాత్రం నీ మాట మీద నిలబడాలిసుమా! విషయం తెలీగానే వాళ్ల నాన్న ఇంకా ఏవేవో ఎరలు చూపుతూ వస్తాడు''

పకపక నవ్వుతున్న మంజరివైపు చూడకుండా గుమ్మంవైపు నడవసాగింది సహజ.

మంజరి నవ్వు ఆమెని వెంటాడుతూనేవుంది. సహజ తటాలున ఆగింది. మెల్లిగా వెనక్కి తిరిగి తీక్షణంగా మదన్‌వైపు చూసింది. వడగళ్లావున్న ఆమె కళ్లనుచూస్తూ తటాలున నవ్వు ఆపేసింది మంజరి.

"మీ చిన్నారి చెల్లెమ్మకు మీరు మాట ఇవ్వొచ్చు! ఎందుకంటే, మా నాన్న సరికొత్త ఆఫర్లతో మీ దగ్గరకు రాడు! మరో విషయం కట్నం తీసుకోకుండా ఉచితంగా నన్ను పెళ్లి చేసుకుంటానని రేపొద్దున మీరు వచ్చినా నేను చేసుకోను! ఎందుకో తెలుసా? కట్నం తీసుకోకపోయినా, కూతురి పెళ్లికోసం కట్నం ఇచ్చే కుసంస్కారమున్న కొంపలో కోడలిగా నేను అడుగుపెట్టను!" స్పష్టంగా పలికిన సహజ మాటలతో మదన్ మొహం ఎర్రబారింది.

"యూ... ఐ విల్ టీచ్‌యూ యే లెసన్!" పిడికిళ్లు బిగిస్తూ అరిచాడు మదన్.

"ఐ విల్ సీ దట్ యూ లెర్న్ టూ లెసన్స్!" సహజ తొణక్కుండా జవాబిచ్చి, గిరుక్కున వెనక్కి తిరిగి గుమ్మం దాటింది.

★ ★ ★

"అదిగో వచ్చేసింది! ఎక్కడికెళ్లావమ్మాయ్! వదినగారూ, అన్నయ్యగారూ గంటసేపట్నుంచీ కాసుక్కూచున్నారు!" గుమ్మంలోకి అడుగుపెడుతున్న సహజను చూడగానే అరిచింది అమృతమ్మ.

సహజ మాట్లాడకుండా వాళ్ళు నలుగురూ కూచున్న చోటికి వెళ్ళింది.

"అదికాదమ్మా... ఎంతసేపటికీ రాకపోతే పెద్దవాళ్ళు ఏమనుకుంటారు?"

"ఎవరికి పెద్దవాళ్ళమ్మా, వాళ్ళు? వాళ్ళు ఏమనుకుంటే నాకేం?" సహజ నిర్లక్ష్యంగా అంది.

"అమ్మాయ్!" శ్రీమంతరావు కంగారుగా అరిచాడు.

మొహాలు చూసుకుంటున్న మదన్ తల్లి దండ్రుల్ని ఆదుర్దాగా చూస్తోంది అమృతమ్మ.

"ఈ పెళ్ళి జరగదని మీ వొదినగారికీ,




అన్నయ్యగారికీ చెప్పి పంపమ్మా!" సహజ తల్లివైపు చూస్తూ అంది.

నాలుగు తలలు ఒకేసారి సహజవైపు తిరిగాయి. అందరికన్నా ముందు అమృతమ్మ ఆశ్చర్యంనుండి కోలుకుంది.

"ఏమిటే! ఏమిటే అది?"

"పెళ్ళి జరగదా? ఎందుకు జరగదు? ఏమిటా పాడుమాటలు?" శ్రీమంతరావు కోపంగా అడిగాడు.

"ఎందుకంటే, వాళ్ళబ్బాయి మదన్‌గారు చేసుకోనన్నారు''

"మావాడు అలా అనివుండడే! ఎవరో గిట్టనివాళ్ళు'' మదన్ తండ్రి మొదటిసారిగా నోరు తెరిచాడు.

"గిట్టనివాళ్ళూ, పుట్టనివాళ్లూ ఎవ్వరూలేరు! నాతోనే అన్నాడు. నేను... ఇప్పుడు మీ ఇంటినుంచే వస్తున్నా..."

"ఆ ఆ ఆ ఆ!" నలుగురూ ఆశ్చర్యంగా నోళ్ళు తెరిచారు.

"అమ్మాయ్... నువ్వంటే అతనికి చాలా ఇష్టంట! అలా ఎందుకన్నాడు?" శ్రీమంతరావు తెప్పరిల్లి అడిగాడు.

"ఇదంతా ఏమిటో నమ్మశక్యంకాకుండా వుంది!" మదన్ తల్లి గుడ్లు తిప్పుతూ, అంది. "మీ అమ్మాయి మా ఇంటికెళ్ళడమేమిటీ? మా అబ్బాయి 'పెళ్ళి చేసుకోను' అనడమేమిటీ..."

"ఇంతకీ ఎందుకు చేసుకోనన్నాడే, అబ్బాయి?" అమృతమ్మ ఆందోళనగా ప్రశ్నించింది.

"ఆ! అదీ! ఎందుకు చేసుకోనన్నాడు? మదన్ తండ్రి అందుకున్నాడు.

"కట్నం లేకపోతే పెళ్ళిచేసుకోడట!" సహజ నిర్లిప్తంగా అంది.

"కట్నం లేకపోవటమేమిటే! కట్నంకింద ఇల్లు ఇస్తున్నాంగా!" అమృతమ్మ అరిచింది.

"ఇవ్వము- అని నేను చెప్పానుగా..."

శ్రీమంతరావు అదిరిపడి, ఒక్క ఉదుటున పైకి లేచాడు. "ఏమిటీ! ఇవ్వనని 'నువ్వు' చెప్పావా? ఎందుకు చెప్పావ్?".

"కట్నం ఇవ్వడం నాకు ఇష్టంలేదు గనక" సహజ తొణక్కుండా అంది.

పిడికిళ్ళు బిగిస్తూ, ఉక్కిరిబిక్కిరవుతూ చూశాడు శ్రీమంతరావు. "ఏమిటా తలతిక్క సమాధానం? సంబంధం చూసేదీ, కట్నం ఇచ్చేదీ, పెళ్ళి చేసేదీ -నేను! మధ్యలో అడ్డదిడ్డంగా నిన్నెవడు మాట్లామన్నాడు?"

"చూసేదీ, ఇచ్చేదీ, చేసేదీ మీరే కావచ్చు నాన్నా! కానీ, కల్యాణం చేసుకునేదీ, కాపరం చేసేదీ నేను! కష్టసుఖాలు అనుభవించే నాకు కట్నం గురించి మాట్లాడే హక్కుంది!" సహజ నిర్భయంగా అంది.

శ్రీమంతరావు బుసలు కొడుతూ చూశాడు "ఫ్రెండింటికి వెళ్ళొస్తానని చెప్పి, ఇదా నువ్వు చేసేది?"

"నాకు కాబోయే భర్త నన్ను నచ్చిన వరుడు నాకు ఫ్రెండే అనుకున్నా, నాన్నా!"

"సహజా!" శ్రీమంతరావు ఆవేశంతో ఊగిపోతూ పొలికేకపెట్టాడు.

"మీరూరుకోండి..." భర్త చెయ్యి పట్టుకుని పక్కకి లాగుతూ అంది అమృతమ్మ. మెల్లిగా అతన్ని సోఫాలో కూచోబెట్టింది. సహజ వాలుగా మదన్ తల్లిదండ్రులవైపు చూస్తోంది. తన తల్లికి 'వొదినగారు', 'అన్నయ్యగారి' చెవిలో ఏవో చెప్తోంది. ఆయన బుర్ర మెల్లిగా పైకీ కిందికీ కదుల్తోంది.

అమృతమ్మ సహజ చేతిని పట్టుకుంది. సహజ తల్లివైపు చూసింది. అమృతమ్మ కళ్ళు ఆమెతో ఏదో చెప్తున్నాయి, మౌనంగా, "ఇలారా... నీతో మాట్లాడాలి..." తగ్గుస్వరంతో అందామె.

సహజ తన చేతిని విడిపించుకుంది. సెగలు కక్కుతూ సోఫాలో కూచున్న తండ్రిపక్కనే కూచుంది. "నేను రాను! ఇందులో

రహస్యాలేం లేవు! ఇక్కడే మాట్లాడుకుందాం!"

కూతురివైపు అయోమయంగా చూస్తూ వుండిపోయింది అమృతమ్మ.

"వొదినగారూ... మీరు కూచోండి!" మదన్ తల్లి సముదాయింపుగా అంది. అమృతమ్మ ఆమెవైపు ఆశ్చర్యంగా చూస్తూ, కూచుంది.

"మనం పెళ్ళిళ్ళు చేసుకున్న కాలం వేరు, మనంవేరు. ఈ కాలం వేరు, ఈ కాలం అమ్మాయిలు వేరు! కట్నం అనేది ఏదో మహాదురాచారం అని ఆవేశంగా అనుకుంటారు పాపం! అమ్మాయిని మీరేం అనకండి. అబ్బాయితో మేం మాట్లాడి వొప్పిస్తాం. మీరు కట్నమూ ఇవ్వొద్దు, ఈ ఇల్లూ ఇవ్వొద్దు..."

"వొదినగారూ!" అమృతమ్మ నమ్మలేనట్టుగా అరిచింది.

"బావగారూ..." శ్రీమంతరావు మదన్ తండ్రివైపు చూస్తూ అన్నాడు.

"నిజంగానా... మీరు... మీరు''

"మా ఆవిడ చెప్తే, నేను కూడా చెప్పినట్టే, బావగారూ... అబ్బాయిని మేం వొప్పిస్తాం! అసలు, మామాట కాదనలేకే కట్నం తీసుకోడానికి వాడు వొప్పుకున్నాడు!" అన్నాడాయన ఆవేశంగా.

"హమ్మయ్య! మా గుండెలమీద బరువు దిగిపోయింది!" అమృతమ్మ తేలిగ్గా ఊపిరి పీల్చుకుంటూ అంది.

తన ముందు జరుగుతున్న నాటకాన్ని సహజ చిరునవ్వుతో చూస్తోంది. మదన్ తల్లిదండ్రులు ఇందాకా ఆడుకున్న గుసగుసల సారాంశం ఆమెకి పెళ్ళిమంత్రాల్లా బిగ్గరగా వినిపిస్తున్నాయి.

"మీ గుండెలమీది బరువు ఇంకా దిగిపోలేదమ్మా!" సహజ తన తల్లివైపు చూస్తూ అంది. "కొడుకులు లేరు కదా... ఇల్లు నాకే-అంటే తమ కోడలికే వస్తుందనీ, మూడు ముళ్ళు పడేదాకా వోపికపట్టి, తరవాత ఇంటి కోసం 'తగిన పద్ధతుల్లో ప్రయత్నం చేద్దామనీ మీ వొదినగారూ, అన్నయ్యగారూ అనుకుంటున్నట్టున్నారు!" సహజ ఆగి మదన్ తల్లిదండ్రులువైపు చూసింది.

ఇద్దరి మొహాల్లోనూ అవమానం ఎర్రగా ప్రత్యక్షమైంది. వాళ్ళు నోళ్ళు తెరిచేలోగా మళ్ళీ సహజే అంది, "కట్నం వద్దు అని అన్నా కూడా, ఇల్లు తరువాత కూడా తీసుకోం అని రాసిచ్చినా కూడా నేను ఈ పెళ్ళి చేసుకోను..."

"ఎందుకో ఆ చారిత్రాత్మకమైన నిర్ణయం?" శ్రీమంతరావు హుంకరించినట్టు అడిగాడు.

"కట్నం తీసుకునే కొంపలోకి, ఆడపిల్లకు కట్నం ఇచ్చే కొంపలోకి నేను కోడలిగా అడుగుపెట్టను!"

"ఏమిటీ?!" అమృతమ్మ అరిచింది.

"కాబోయే భర్తను కట్నంతో కొని, అత్తారింట్లో ఆత్మగౌరవంతో బతకాలన్న ఆలోచనను నాటిన దుష్టసంప్రదాయంతో వీళ్ళు తమ కూతుర్ని పెంచారు! వాళ్ళ ఇంటికి నేను వెళ్ళను!" సహజ తెగేసి చెప్పింది.

"ఇది మరీ బావుందమ్మా! నీ దగ్గర తీసుకోవద్దన్నావు, బావుంది. మా అమ్మాయికి ఇచ్చుకుంటే నీకేం? నీ సొమ్మేం ఇవ్వంగా!" మదన్ తల్లి వెటకారంగా అంది.

"కట్నం ఇచ్చి మొగుణ్ని కొనుక్కోడం శాశ్వత ప్రాతిపదికమీద ఒకే వ్యక్తితో సాగించే వ్యభిచారం! అలాంటి కుసంస్కారాన్ని పాటించే వాళ్ళతో నాకు సంబంధం వుండదు! అంతే!"

"సహజా!" శ్రీమంతరావు హుంకరాంచాడు.

మదన్ తల్లి నిప్పులు కక్కుతూ చూసింది. "మాటలు తిన్నగా రానీ అమ్మాయ్! దేశంలో నువ్వొక్కతివే అప్సరస, మీ నాన్నొ




క్కడే కుబేరుడు అనుకున్నట్టున్నావ్! కట్నం పేరెత్తేవాళ్లందర్నీ వ్యభిచారులనే చేసేలావున్నావ్! ఇంకా నయం. నీ విశ్వరూపాన్ని మూడుముళ్ళూ పడకముందే చూపించి, రక్షించావు!" అంటూ ఆమె భర్తవైపు తిరిగింది.

"బైల్దేరండి! వ్యభిచారులూ, గిభిచారులూ అంటూ నానా మాటలూ పడ్డానికి నాకేం ఖర్మ పట్టలేదు!"

మదన్ తండ్రి ఆదరాబాదరా లేచాడు. సోఫా మీదపడేసిన పర్సుని అందుకుంటూ గొణుక్కుంటోంది మదన్ తల్లి. "ఎవణ్నో ప్రేమించి వుంటుంది. అది తెలుసుకోకుండా వీళ్ళు పెళ్ళిపెటాకులూ, వివాహం, విడాకులూ అనుకున్నారు! హుఁ! ఇంకానయం! పదండి!"

"బలే కనిపెట్టారే!" సహజ నవ్వుతూ అంది. "ఔను! ప్రేమించాను"

"సహజా!" శ్రీమంతరావు ఆవేశంతో అరుస్తూ సహజ ఎడమచేతిని తన ఎడమ చేత్తో పట్టుకున్నాడు.

"ఔన్నాన్నా! ప్రేమించాను! ఆ విషయం మీరు తెలుసుకోలేకపోయారు"

"ఎవర్నే?" అమృతమ్మ బొబ్బలెట్టింది. "ఎవడే వాడు?"

"నా తల్లిదండ్రులు ఇచ్చే కట్నాన్ని కాకుండా, కట్నం కొంగులో ముడేసుకున్న నన్ను కాకుండా కేవలం నన్నే, కేవలం నా వ్యక్తిత్వాన్నే పెళ్ళిచేసుకునే యువకుణ్ణి ప్రేమిస్తున్నాను..."

"చూశారా! నేన్జెప్పలా!" నాటకం చూస్తూ ఆగిన మదన్ తల్లి భర్తతో అంటోంది.

"సహజా!" శ్రీమంతరావు గర్జించాడు. "వాడు ఎవడైనా సరే, నీప్రేమను నేను అనుమతించను! నేను... నేను..."

సహజ పకపక నవ్వింది. "అతనెవరో, ఎక్కడున్నాడో నాకూ తెలీదు. నాన్నా! వరకట్న దురాచారాన్ని ఖండించే వ్యక్తిత్వం, పురుషత్వంవున్న యువకుడు ఎక్కడో వుంటాడు! అతన్నే నేను ప్రేమిస్తున్నా, నాన్నా!"

శ్రీమంతరావు, అమృతమ్మ అయోమయంగా చూస్తూండిపోయారు.

"వస్తామమ్మా... వ...ది...న...గారూ! మీ అమ్మాయిగారు ప్రేమించిన రాకుమారుడు ఎప్పుడో వస్తాడు! అప్పటిదాకా, పెళ్ళి సంబంధాల పేరుతో మాలాంటి సంసారుల్ని బజార్లోకి లాగకుండా, తపస్సుచేస్తూ కూచోండి" మదన్ తల్లి వెటకారం, ఉక్రోషం రెండూ కలిపి అనేసి, చెయ్యిపట్టుకుని భర్తను బరబరా లాక్కెళ్ళింది.

"ఆడపిల్లకు కన్యాత్వం ఎంత ముఖ్యమో కట్నం కూడా అంతే ముఖ్యం, పెళ్ళి కావాలంటే!" శ్రీమంతరావు బుజ్జగింపుగా అన్నాడు. "దటీస్ ది ఆర్డర్ ఆఫ్ ది డే! పిచ్చిపిచ్చి ఆలోచనలు మాని, పెళ్ళిచేసుకుని సుఖపడు! కట్నం ఇవ్వడం, పుచ్చుకోవడం నేరం అంటూ ఉపన్యాసాలు దంచే పెద్దలంతా తమ పిల్లలకి లక్షలూ, కోట్లూ కట్నాలు ఇస్తున్నారు, తీసుకుంటున్నారు! మామాట విని..."

వెనుదిరిగి గుమ్మంవైపు నడుస్తున్న కూతుర్ని చూస్తూ ఆపేశాడు శ్రీమంతరావు.

"సహజా!" అమృతమ్మ అరిచింది. "నాన్నగారి మాటల్ని నిర్లక్ష్యం చేస్తూ ఏమిటా పొగరు! ఎక్కడికా వెళ్ళడం?"

సహజ వెనక్కి తిరిగింది. రెప్ప వేయకుండా తన తల్లి దండ్రులవైపు క్షణకాలం చూసింది.

"కట్నం అనే దురాచారాన్ని సమర్థించేవాళ్ళు ఎవరైనాసరే- వాళ్ళ నీడలో నేను ఉండను నాన్నా!" సహజ కంఠం గంటలా ధ్వనించింది.

"సహజా..." దీనంగా వినిపించిన తండ్రి పిలుపు సహజను కనిపించని సంకెళ్ళతో బంధించి, మళ్ళీ వెనక్కి తిప్పింది.

"ఇలారా..." శ్రీమంతరావు పిలిచాడు.

సహజ అతని కళ్ళల్లోకి చూస్తూ యాంత్రికంగా అతనివైపు నడిచింది. దగ్గరగా వచ్చిన కూతుర్ని శ్రీమంతరావు తటాలున వాటేసుకున్నాడు.

"సహజా... కట్నం అనే ఆయుధం లేనిదే కన్నబిడ్డ పెళ్ళి చేయలేని చేతకానితనంతో నీ వ్యక్తిత్వాన్ని అవమానించాను... నీ అభిప్రాయాన్ని చిత్తశుద్ధితో పరిశీలించలేకపోయాను... నన్ను... నన్ను... క్షమించు తల్లీ!" ఉద్వేగంతో శ్రీమంతరావు కంఠం వణికింది. కూతురి వీపుమీద నిమురుతున్న వేళ్ళు వణికాయి.

"నాన్నా..." సహజ కదిలిపోతూ అంది.

"నా మంగళసూత్రాన్ని కట్నంతో కలుషితం చేయనని వాగ్దానం చేయి, నాన్నా!"

శ్రీమంతరావు మౌనంగా కూతుర్ని దగ్గరగా లాక్కున్నాడు. అమృతమ్మ ఇద్దర్నీ అర్థంకానట్టు చూస్తూవుండిపోయింది...



మహిళా యూనివర్సిటీ ఆవరణలో కోలాహలంగా ఉంది. వేదికముందు కుర్చీల్లో వందలాదిమంది విద్యార్థినులూ, స్త్రీలూ కూచున్నారు. స్థానిక రచయితలు కొంతమందీ, పత్రికా విలేఖరులూ ముందు వరసల్లో కూచున్నారు. వేదికమీద మహిళా యూనివర్సిటీ వైస్‌ఛాన్సలర్, రెజిస్ట్రార్, 'సబల సమాఖ్య' అధ్యక్షురాలు శ్రీమతి చండీప్రసాద్, ఒకనాటి 'పాఠకుల అభిమాన రచయిత్రి వినీలాదేవి, విప్లవ వనితా వేదిక ప్రధాన కార్యదర్శి కాదంబరి, మరో ఇద్దరు ఫెమినిస్ట్‌లూ ఆశీనులయ్యారు. రిటైర్డ్ జడ్జి వీరభార్గవ అధ్యక్షస్థానంలో కూచున్నాడు.

స్వాగతోపన్యాసం తరువాత అధ్యక్షుడు తన 'తొలిపలుకులు' వినిపించడానికి ఉద్యమించాడు. తను పుట్టినప్పట్నుంచీ ఆరు దశాబ్దాలకాలంలో నిరాఘాటంగా సాగిన ఆంధ్ర సాహిత్యాభివృద్ధిని దశాబ్దాల వ్యవధిలో ఆయన ఓపికగా వివరించాడు. ఇటీవల కాలంలో తెలుగు వారపత్రికలలో, నవలల్లో వ్యాపించిన విపరీత పరిణామాలను ఉపన్యాసంలో స్పృశించారు. ప్రేమ పేరుతో, శృంగారం పేరుతో పాఠకులకు సప్లై చేయబడుతున్న అశ్లీలాన్ని అరికట్టకపోతే నేరప్రవృత్తీ, లైంగికవేధింపుల సంఖ్య, లైంగిక నేరాల సంఖ్య మితిమీరిపోయి, న్యాయవ్యవస్థనే సవాలు చేస్తాయన్నారు. ప్రస్తుతం సాహిత్యాన్ని కలుషితం చేస్తున్న అశ్లీలాన్ని నిరోధించే విధానాలను అన్వేషించడానికే ఆ సమావేశం జరుగుతోందనీ, సబల సమాఖ్య అధ్యక్షురాలు శ్రీమతి చండీప్రసాద్ ఆ విషయం బాగా వివరిస్తారనీ చెప్పి, తన ప్రసంగం ముగించాడు.

చండీప్రసాద్ మైక్ ముందుకు రాగానే కరతాళధ్వనులతో ప్రాంగణం దద్దరిల్లిపోయింది. పత్రికా ప్రపంచం వ్యాపారుల చేతుల్లోకి వెళ్ళడంవల్ల, ఆర్థికలాభాలే ధ్యేయంగా మారాయనీ, పాఠకులు వేలంవెర్రిగా కొనేలా పత్రికల్నీ, నవలల్నీ రూపొందించే స్వార్థపూరిత ఉద్యమం ప్రారంభమైందనీ, అందుకే సాహిత్యంలో అశ్లీలం రాజ్యం సాగించడం ప్రారంభించిందనీ అందామె. అశ్లీల సాహిత్యంవల్ల నష్టపోయేది స్త్రీయే అనీ, మంట కలిసేది స్త్రీ ఆత్మగౌరవమే అనీ ఆమె ఆవేశంతో అంది.

ఆ తరువాత ప్రసంగించిన వినీలాదేవి, కాదంబరి, ఇంకా ఇద్దరూ అశ్లీలాన్ని నిరా




కాశ్మీర్‌నుండి కన్యాకుమారివరకూ గల వివిధ భారతీయ భాషలు, సంస్కృతులు, సాంప్రదాయాల అపురూప సంగమం...

వివిధభాషా కథావేదిక




ఈ శీర్షికద్వారా ప్రతినెలా 'చతుర'లో వెలువడే నవలను సమీక్షించే అవకాశాన్ని కల్పిస్తున్నాం. పాఠకులు తమకు నవల ఎందుకు నచ్చిందో లేదా ఎందుకు నచ్చలేదో వివరిస్తూ రచన బాగోగులు గురించి రాయాలి. సమీక్షలు రాసేవారు కథ మొత్తం మళ్ళీ చెప్పకుండా, అవసరమైనమేరకే ప్రస్తావిస్తూ రాయాలి.

1. సమీక్ష అరఠావుకి మించకుండా కాగితానికి ఒకవైపునే రాయాలి.
2. ఏ నెల సమీక్ష ఆ నెల 20వ తేదీలోపు మాకు అందేటట్లు పంపాలి.
3. మీ సమీక్షకు తప్పనిసరిగా ఈ కింది కూపన్ జతపరచాలి.
4. కవరుపై 'చతుర సమీక్ష'కు అని పేర్కొని ఎడిటర్, 'చతుర', ఈనాడు కాంపౌండ్, హైదరాబాద్-500 482 అనే చిరునామాకు పోస్ట్‌చేయాలి.

మాకు సకాలంలో అందిన సమీక్షలలో ఎన్నికచేసిన అయిదు ఉత్తమ సమీక్షలకు రు. 100/- ప్రథమ బహుమతి, రు: 75/- ద్వితీయ బహుమతి, రు: 50/- చొప్పున మూడు తృతీయ బహుమతులను అందజేస్తున్నాం. పాఠకుల పరిశీలనాశక్తిని, రచనాసక్తిని పెంచే లక్ష్యంతో ఏర్పాటుచేసిన ఈ సమీక్షా రచనలో పాల్గొని ఈ అవకాశాన్ని సద్వినియోగం చేసుకోగోరుతున్నాం.

★ కొందరు బహుమతి విజేతలు తమ బహుమతి తాలూకు చెక్కు అందలేదనీ, అడ్రసు మారిందనీ రాస్తున్నారు. బహుమతి మొత్తాలు ప్రతినెలా మొదటివారంలోనే పంపుతున్నాం. అడ్రసుల విషయంలో కూపన్‌లో రాసేటప్పుడే జాగ్రత్తపడటం మంచిది. ఈ విషయంలో ఉత్తర ప్రత్యుత్తరాలు సా[illegible]

టంకంగా గుప్పిస్తూ పాఠకుల హృదయాలనూ, మెదళ్లనూ సర్వనాశనం చేస్తూ ఆడదాని గౌరవాన్ని, ఆత్మవిశ్వాసాన్నీ అమ్ముకుంటూ సొమ్ము చేసుకుంటున్న సంస్థల్నీ, వ్యక్తుల్నీ తూర్పారబట్టారు. సమాజంలోని ప్రతీ వ్యక్తీ ఈ అరాచకాన్ని ఖండించాలనీ, ముఖ్యంగా స్త్రీలు, విద్యార్థినులు, యువతులు తమ జాతి మీద సాగుతున్న అశ్లీలయుద్ధాన్ని అరికట్టేందుకు నడుం బిగించాలనీ ఉద్బోధించారు.

అంతసేపూ షామియానా అంచున నిలబడి అందరి ప్రసంగాలూ విన్న సహజ వేదిక వైపు నడిచింది. ఉపన్యాసాల సమయం అయిపోయిందనీ, కొద్దిక్షణాల్లో 'మహతి' పత్రిక దహనం జరుగుతుందనీ అనౌన్స్ చేస్తున్న కన్వీనర్‌ని రిక్వెస్ట్ చేసి మూడే మూడు నిమిషాలు మాట్లాడ్డానికి అనుమతి సంపాదించింది.

ప్రసంగం ప్రారంభిస్తూ సహజ తనను పరిచయం చేసుకుంది. "ఇంతసేపూ ప్రసంగించిన మహిళామణులూ, పెద్దలూ, విద్యార్థినీ సోదరీమణులూ వివరించినట్టు సాహిత్యంలో అవాంఛనీయమైన ధోరణులు పెరిగిపోయాయి. పాఠకుల బలహీనతలమీద బలంగా పునాదులు వేసుకున్న కొన్ని పత్రికలు- మారిజువానా, చరస్, హిరాయిన్ లాంటి మాదకద్రవ్యాల మిశ్రమంకన్నా భయంకరమైన సరుకుతో వీరవిహారం చేస్తూ సంస్కృతిని సంకరం చేస్తున్న మాట వాస్తవం. అలాంటి పత్రికలకు ప్రతినిధిగా 'మహతి' వారపత్రిక అవిరళకృషి చేస్తున్నమాట యదార్థం. ఇది ఆడదాని ఆత్మగౌరవంతో వ్యాపారం. ఆడదాని మోడెస్టీతో వ్యాపారం. యువత బలహీనతతో వ్యాపారం. దీన్ని అరికట్టాలి. అయితే... పత్రికల ప్రతుల్ని తగలబెట్టడం దానికి మార్గం కాదు..."

"డోంట్ టాక్!" శ్రోతల్లోంచి ఎవరో యువతి అరిచింది.

"కమ్ డౌన్" మరో యువతి కంఠం.

"గో అవే!" మరో యువతి కంఠం.

నవ్వులూ, పిల్లికూతలూ వాళ్ళ అరుపులకి బ్యాక్‌గ్రౌండ్ మ్యూజిక్‌లా ధ్వనించాయి. ఆశ్చర్యపోయిన సహజ క్షణంలో సర్దుకుంది.

"దయచేసి నన్ను చెప్పనివ్వండి. తగలబెట్టడాలూ, దహనాలూ మన అసమ్మతిని తెలియజేసే మార్గాలు మాత్రమే! అయితే మన జాతి ఎన్నో విషయాలమీద, ఎన్నో రకాలుగా తన అసమ్మతిని తెలియజేస్తూనే వుంది, ఉంటుంది. అలాంటి ప్రయత్నాలు చెట్టుబోదెనీ, వేళ్ళనీ వదిలేసి కొమ్మలు నరకడం లాంటివి. 'ఫలానా పత్రికను తగలబెట్టారట. అందులో ఏముందో చూద్దాం' అని జనం ఇంకా విరగబడికొని, దాని సర్క్యులేషన్ పెంచే అవకాశమే ఎక్కువ..."

ఆమె చేతిచుట్టూ ఉద్రేకంతో మొరటుగా బిగుసుకున్న ఏదో హస్తం సహజ ప్రసంగాన్ని రకీమని కత్తిరించింది. తలతిప్పి, తన మొహంలోకి కోపంగా చూస్తున్న విప్లవవనిత కాదంబరి కళ్లల్లోకి చూసింది సహజ.

"ఎవరు నువ్వు? ఏ పత్రిక ఏజెంటువి? ఏ బూతు పబ్లిషర్ తాలూకు మనిషివి?" కాదంబరి గర్జించింది.

'మేడమ్..."

"షటప్" కాదంబరి హుంకరించింది. "పిలవని పేరంటానికి వచ్చి ఈ ఐక్యమహిళా వేదిక తీసుకున్న ఒక బూతుపత్రికను దహనంచేసే చారిత్రాత్మకమైన నిర్ణయంమీద నీళ్లు చల్లే ప్రయత్నం చేయడానికి ఎన్ని గుండెలు నీకు? నువ్వు... నువ్వు... ఆడదానివేనా? మగపేరుతో దొంగతనంగా బూతు రాస్తున్న ఆడరచయిత్రివి కాదుకదా, కొంపదీసి"

నవ్వులూ, కేకలూ భీకరంగా ధ్వనిస్తూ ఆమె మాటలకి తాళం వేశాయి.

"అయాంసారీ... నన్ను అపార్థం చేసుకుంటున్నారు. నన్ను పూర్తిగా..."

"నోర్ముయ్!" కాదంబరి గర్జించింది. "నీ

పేరేమిటన్నావ్? ఆ సహజ. ఇంత అసహజంగా మాట్లాడే నీకు 'సహజ' అని పేరు ఎవరు పెట్టారు''

"అసహజ డౌన్ డౌన్'

"అసహజ డౌన్ డౌన్'

"అసహజను గెంటేయండి''

వందలాది కంఠాలు కోరస్‌గా అరవసాగేయి. సహజ తన చూపుల్ని కాదంబరి మీదనుంచి గోలగా అరుస్తున్న స్త్రీలోకంవైపు తదేకంగా చూసింది. తన చేతిని కాదంబరి పట్టునుండి విడిపించుకుంది. మరుక్షణం ఆమె కంఠం మైక్ ద్వారా ప్రతిధ్వనించింది.

"అరవకండి. వెళ్లిపోతాను. చెలిమితో వచ్చిన నన్ను శత్రువు అనుకుంటున్నారు అని మాత్రం చెప్తున్నాను. థాంక్స్'' వేదిక మీంచి చరచరా దిగిపోతున్న సహజను అరుపులూ, కేకలూ ఎగతాళిగా తరుముతున్నట్టు వినిపిస్తూనే ఉన్నాయి. షామియానా సరిహద్దును దాటాక కూడా పిల్లికూతలు ఆమెని వెంటాడుతూనే ఉన్నాయి.

కాస్సేపట్లో మహతి పత్రిక వందప్రతులు అగ్నికి ఆహూతి చేయబడతాయని అనౌన్స్ చేస్తున్నారు ఎవరో. అరుపులూ, కేకలూ ఆగిపోయాయి.

"ఎక్స్‌క్యూజ్‌మీ..."

మెల్లిగా గేటువైపు అడుగులు వేస్తున్న సహజను ఏదో కంఠం హెచ్చరించింది. సహజ ఆగి వెనక్కితిరిగింది. ఎత్తుగా, లావుగా వున్న యువకుడు ఆమెవైపు చిరునవ్వుతో చూస్తున్నాడు. నీలిరంగు జీన్స్‌లోకి రెడ్‌షర్ట్ టక్ చేశాడు. ఉంగరాల జుత్తు. సన్నటి మీసాలు.

"యస్'' సహజ ప్రశ్నార్థకంగా చూసింది.

"అయామ్ ఉత్తమ్‌కుమార్. ఫ్రీలాన్స్ జర్నలిస్టుని. ఈ ప్రోగ్రాం కవర్ చేయడానికి వచ్చాను... మీరు..." అంటూ అతను ఆగాడు.

"నా పేరు 'అసహజ' అని అందరూ అనౌన్స్ చేశారే. వినలేదా?" సహజ నవ్వే ప్రయత్నం చేస్తూ అంది. అతను నవ్వలేదు.

"అయాం సారీ... దాన్ని 'మంద-బుద్ధి' ఐమీన్ గ్రూప్ మెంటాలిటీ అంటారు. మీ పేరు సహజ అని తెలుసు. మీరే చెప్పారు''

వేదికవైపునుంచి ఉన్నట్టుండి ధ్వనించిన హర్షధ్వానాలు అతనికి అడ్డుతగిలాయి. ఇద్దరూ అటువైపు చూశారు. 'మహతి' దహన సంస్కారం జరుగుతోంది.

"మధ్యలో వచ్చేశారు. ప్రోగ్రాంని పూర్తిగా కవర్ చేయరూ'' సహజ ప్రశ్నించింది.

"దహనాన్ని ఫొటో తీయను. అంచేత ప్రోగ్రాంని కవర్ చేసేసినట్టే. అన్నట్టు మిస్ సహజా! మీ చిన్ని ప్రసంగం నాలో పెద్ద ఆలోచనల్ని రేపింది'' ఉత్తమ్ నవ్వుతూ అన్నాడు. చెట్టుబోదెనీ, వేరునీ వదిలేసి కొమ్మలు నరకడం అన్న మీ స్టేట్‌మెంట్ అక్షరసత్యం.

"థాంక్స్..."

"యస్. ఇట్స్ పవర్‌ఫుల్ స్టేట్‌మెంట్! వెల్... మీరెవరో చెప్పలేదు. మీరు'' ఉత్తమ్ నవ్వుతూ ఆగాడు.

"నేను ఏ పత్రికకీ ఏజెంట్‌ని కాను. ఏ బూతు పబ్లిషర్ తాలూకు వ్యక్తినీ కాను. నేను... ఒక యువతిని. అంతే'' సహజ నవ్వుతూ అంది.

ఉత్తమ్ పకపక నవ్వాడు. "వాళ్లు మిమ్మల్ని పూర్తిగా మాట్లాడనిచ్చి వుంటే బాగుండేది..."

"థాంక్స్... వస్తాను'' అంటూ సహజ వెనక్కి తిరిగింది.

సహజ దగ్గరగా ఆగిన ఆటోలో ఎక్కింది. ఉత్తమ్‌కుమార్ కాంపౌండులోపల చెట్టుకింద ఆపిన తన స్కూటర్‌వైపు అడుగులు వేశాడు.

  

చివరిపేజీ కూడా పూర్తిగా చదివేసి, మహతి వారపత్రికని మూసి బల్లమీదికి,




విసిరింది సహజ.

భాషా ప్రయోగాన్నీ, శిల్పాన్నీ బాగా అర్థం చేసుకోడానికి పుస్తకాల్ని బాగా చదవాలి. తరువాత చదవడం మానేసి, రాయడం ప్రారంభించాలి అంటూ రచయితలు కాబోయే వాళ్లకి ఒక పాశ్చాత్య రచయిత సూచనని అమలు జరిపిన తను ఇటీవల కొంత కాలంగా పుస్తకాలూ, పత్రికలూ చదవడం ఆపి, రాయడంమీద దృష్టిని కేంద్రీకరించింది. అంతేకాకుండా అశ్లీలరచనల్ని ప్రచారం చేయడంలో పేరుపడిన కొన్ని పత్రికల్ని తను చదవలేదు. అందుకే మహతి పత్రిక తనని ఆశ్చర్యంలో, ఆవేదనలో ముంచేసింది.

మహతి వారపత్రికని చదవడం తనని పూర్తిగా డిస్టర్బ్ చేసేసింది. ఏదో అలజడి, ఏదో వికారం తనలో ప్రారంభమయ్యాయి. మొత్తం పత్రికలో తనలో ఆలోచనల్ని రేకెత్తించే అంశం ఒక్కటి కూడా లేదు! దుర్గంధం వ్యాపించిన ప్రదేశంలోవున్న అనుభూతి కలుగుతోంది, ఆ పత్రిక చదివాక తనలో.

మహతి ప్రతుల్ని తగలబెట్టాలన్న వాళ్ల ఉద్యమం అర్థరహితమైంది కాదేమో అనిపించింది క్షణంసేపు సహజకి. వెంటనే ఆమెకి నవ్వొచ్చింది. ఆ ఆలోచన కేవలం క్షణికం! విషవృక్షాన్ని నాశనం చేయాలంటే కొమ్మల్ని నరకడం అనే చర్య చాలదు. మూలాన్ని ఎటాక్ చేయాలి!

"హమ్మయ్య! ఉన్నావా? ఉంటావో, ఉండవో అనుకుంటూ వచ్చాను!"

సహజ ఆలోచనల ఆకాశంలోంచి తటాలున భూమ్మీదికి వాలి, తలతిప్పి చూసింది. పరిమళ గదిలోకి వస్తోంది.

"హాయ్ కమిన్!" సహజ నవ్వుతూ అంది.

"ఆహ్వానం లేకుండానే అంతఃపురంలోకి వచ్చేశాంగా'' పరిమళ నవ్వి, అంది.

"బ్రహ్మాండంగా ముస్తాబైపోయావ్! ఏమిటి సంగతి? సినిమా ప్రోగ్రాంని వెంటబెట్టుకొచ్చావా?" సహజ పరిమళని ఎగాదిగా చూస్తూ అంది.

పరిమళ నవ్వలేదు. "సినిమాకెళ్తున్నానని అబద్ధాలాడి, నీ దగ్గరకు వచ్చాను..."

సహజ ఆశ్చర్యంగా చూసింది. "అబద్ధాలాడ్డం ఎందుకు? నా దగ్గరకే వెళ్తున్నానని నిజమే చెప్పొచ్చుగా''

"నీవద్దకు వెళ్తానంటే నాన్న వద్దనేవాడు..." అనాలోచితంగా అనేసి, పరిమళ నాలుక కరచుకుంది.

సహజ ప్రశ్నార్థకంగా చూసింది.

"సారీ... సహజా... ఈరోజు, ఈ సమయంలో నిన్ను చూడ్డానికి వెళ్తానంటే నాన్న వొద్దనేవాడు అంతే..."

"ఎందుకూ?"

"అది చెప్పాలనే అబద్ధాలాడి ఇలా వచ్చేశాను'' అంటూ పరిమళ గుమ్మం వైపు చూసింది. చకచకా వెళ్లి తలుపులు మూసి గొళ్లెం పెట్టేసి, తనవైపు అర్థం కానట్టు చూస్తున్న సహజను సమీపించింది. మంచం మీదకూచుని, సహజను కూడా కూచోమంది. సహజ కూచుని ప్రశ్నార్థకంగా చూసింది.

"నీకు... ఎలా చెప్పాలో తెలవడంలేదు'' పరిమళ సందేహిస్తూ అంది.

సహజ పరిమళ మొహంలోకే చూస్తూ వుండిపోయింది. అనుమానం, ఆవేదనా పరిమళ మొహంలో రెండు రంగుల్లా కలుస్తూ, విడిపోతూ ప్రత్యక్షమవుతున్నాయి.

"ఎట్లా చెప్పాలో నేను చెప్తాను'' సహజ అంది. "శ్రీతో ప్రారంభించు, శుభంతో ముగించు''

పరిమళ నవ్వలేదు. నిట్టూర్చి, సహజ కళ్లల్లోకి చూసింది. "సహజా... నేను కొన్ని ప్రశ్నలడుగుతాను. వాటికి జవాబులు నాకు తెలిసినా, కన్ఫర్మ్‌చేసుకోడానికి అడుగుతాను''

"అడుగు''

"...నువ్వు... నువ్వు మదన్‌తో కలిసి తిరిగావా?" పరిమళ ప్రయత్నించి అడిగింది.

'ఎవరు చెప్పారు?" సహజ ఆశ్చర్యంతో ప్రశ్నించింది.

"దయచేసి ప్రశ్నలు అడగొద్దు. నా ప్రశ్నల కి సమాధానాలు చెప్పు!"

"లేదు'' సహజ క్లుప్తంగా అంది.

"కనీసం పార్కుకో, హెూటల్‌కో వెళ్లావా?"

"లేదు''

"చివరి ప్రశ్న నువ్వు అతనితో కొన్ని గంటలు లాడ్జి గదిలో.. గడిపావా?" పరిమళ కళ్లని దాచుకుంటూ అడిగింది.

"లేదు'' సహజ కోపాన్ని దిగమింగుతూ ముక్తసరిగా అంది.

పరిమళ కనురెప్పలు పైకి లేచాయి. "మొదటే... అందుకే చెప్పాను... ఈ సమాధానాలు నాకు తెలుసు అని! అతన్తో తిరిగివుంటే నాకు చెప్పేదానివి..."

"ఇప్పుడు నేను ప్రశ్నిస్తాను'' సహజ అడ్డొస్తూ అంది. "ఈ ప్రశ్నల్ని ఎందుకు అడిగావ్?"

"ఆ మదన్‌గాడు నీ గురించి మా నాన్నకు లేనిపోనివి చెప్పాడు..." పరిమళ ఆగి చూసింది.

"విషయమేమిటో వివరంగా చెప్తావా, మీ నాన్ననే నిలదీసి కనుక్కొమ్మంటావా?" ఓపిక నశించిన సహజ కసిరింది.

"ఆ విషయం నాన్న నీకు తెలియనివ్వొద్దని ప్రత్యేకంగా చెప్పాడు. నువ్వు బాధపడ్డం నాన్నకి ఇష్టంలేదు. నీతో చెప్పకుండా దాచే శక్తి నాకు లేదు... అందుకని..."

"సినిమా సాకుతో వచ్చావ్!" సహజ విసుగ్గా అంది. "అసలు విషయం చెప్పు''

"... ఏకాంతంలో కబుర్లు చెప్పుకుందాం అని చెప్పి ప్రోత్సహించి మదన్‌ని నువ్వు లాడ్జిగదికి తీసుకెళ్లావట.. ఆ మాటా, ఈమాటా చెప్పి అతని అందాన్ని మెచ్చుకుని... మెచ్చుకుని... నీ అందంతో అతన్ని లొంగదీసుకునే ప్రయత్నం చేశావట... కట్నం లేకుండా అతన్ని భర్తగా కొట్టేసే దురాలోచనతో అతనికి నీ అందాన్ని రుచి చూపించి... పెళ్లి చేసుకోవాలన్న ప్లానట నీది'' పరిమళ గబగబా చెప్పి ఆగింది.

ఆశ్చర్యం సహజ విశాలనేత్రాల్ని ఇంకా విశాలంగా చేసింది.

"క్రూక్!"

"నాన్నకూడా ఆమాటే అన్నాడు. నాన్న అతని మాటల్ని నమ్మలేదు'' పరిమళ సముదాయిస్తున్నట్టు అంది.

"అతనిలాంటివాళ్లు నాలాంటి ఆడపిల్ల మీద చెప్పే అలాంటి మాటల్ని నమ్మే వ్యక్తులే ఈ లోకంలో చాలా మందివున్నారు పరిమళా!" సహజ మెల్లిగా అంది.

"ఔను! ఆ మాట కూడా అన్నాడు నాన్న!" పరిమళ ఉద్రేకంతో అంది.

"అందుకే మీ అమ్మకీ, నాన్నకీ, నీకూ ఈ పాడు మాటలు తెలియడం మంచిది కాదన్నాడు నాన్న''

సహజ విరక్తిగా నవ్వింది. "మీ నాన్న ఆ పాడు మాటల్ని దాచుకోవచ్చు. ఇతర్లు దాచుకోరు, దాచరు. పాటలాగా వీధివీధికీ పాడేస్తారు! అలా పాడాలన్నదే ఆ మదన మనోహరుడుగారి కోరికకూడా!"

'దొంగముండా కొడుకు!" పరిమళ కోపం వెళ్లగక్కింది.

"అతన్ని తిట్టు! అతని తల్లిని తిట్టొద్దు!" సహజ నవ్వుతూ అంది.

పరిమళ సహజవైపు ఆశ్చర్యంగా చూసింది. "తిడతాను! ఒక పెళ్లికాని ఆడపిల్ల మీద అలాంటి అభాండం వేసిన ఆ లుచ్చాగాడి అమ్మనూ, అమ్మమ్మనూ, నాయనమ్మనూ ఇంకా ఏడేడు పద్నాలుగు తరాల్ని తిట్టిపోస్తాను!"




సహజ చిన్నగా నవ్వింది. "మైడియర్ యంగ్ లేడీ, ఇలాంటి తిట్లతో లోకం తరతరాలుగా స్త్రీజాతిని చిన్నబుచ్చుతూనే వుంది. ఎవర్ని తిట్టాలన్నా ఆ వ్యక్తికి సంబంధించిన ఆడవాళ్లని అమ్మను, చెల్లినీ, అక్కనూ, భార్యనూ కలిపి బండబూతులు తిట్టడం ఆచారమై పోయింది. బజారు, మార్కెట్, సినిమాహాలు ఎక్కడికెళ్లినా ఆడదాన్నీ, ఆడదాని శరీరాంగాలనూ కలిపి తిట్టుకోడం వింటూనే ఉన్నాం. పురుష సమాజం ఎదిగి, తిట్లలో ఆడజాతిని కలగలపడం మానేదాకా స్త్రీకి సమానత్వం రానట్టేలెక్క!"

పరిమళ ఏదో కొత్త విషయం వింటున్నట్టుగా నోరు తెరిచింది.

"సంబంధం లేకపోయినా, ఆడదాని శీలాన్ని శంకిస్తూ, అవమానిస్తూ, ఒక మగవాణ్ణి మరో మగవాడు తిట్టిపోస్తాడు. తనకి ఆగ్రహం తెప్పించిన మగవాణ్ణి మగవాడుగా తిట్టడంతో మరో మగాడు తృప్తిచెందడంలేదు! ఎంత అనాగరికం!"

పరిమళ అప్రయత్నంగా తలాడిస్తూ వుండిపోయింది.

"నీ తిట్టు నా ఆలోచనల్ని కదిలించింది కనుక చెప్తున్నా'' సహజ మళ్లీ అంది. "తననూ, తన శరీరాంగాలనూ కలిపి మగాళ్లు తిట్టుకుంటూ వుంటే విన్న స్త్రీ సిగ్గుతో, అవమానంతో చిన్నబుచ్చుకుంటుంది. ఈ దరిద్ర పరిస్థితి మారినప్పుడే స్త్రీకి పురుషుడితో సమానంగా స్థానం లభించినట్టు రూఢి అవుతుంది''

"సహజా..." పరిమళ తెప్పరిల్లుతూ అంది "నీ వరస నాకేం అర్థం కావడంలేదు! ఆ మదన్‌గాడు నీ గురించి నానా మాటలూ అన్నాడు, నీ పరువుని బజారు పాలుచేసే ఉద్దేశంతో. ఆ విషయం విని రియాక్ట్ కావడానికి బదులు తిట్ల విశ్లేషణలోకి దారిమళ్లించావు! ఇంతకీ అతను... ఆ పాడుపని ఎందుకు చేసినట్టు?"

"అతన్ని నేను అవమానించానుగా? ఆశాభంగం చేశానుగా? అందుకు!" సహజ నవ్వింది.

"అవమానించావా?"

"ఆ! కట్నం విషయంలో తిరగబడి, విమర్శించి, లెక్చరిచ్చి అవమానించాను. కన్నెపిల్లా కట్నంసొమ్మూ జంటగా వొళ్లో వాలకుండా అటకాయించి ఆశాభంగం చేశాను! అతనికి వొళ్లు మండింది! కసి పెరిగింది. పగ రగిలింది. నా ప్రవర్తనకి రంగులు పులిమి, నన్ను బరితెగించిన ఆడదానిగా చిత్రించి, పెళ్లాడాలనుకునే వ్యక్తుల్ని బెదరగొట్టాలనుకున్నాడు! ప్రయత్నిస్తున్నాడు!"

"అంతేనా?"

"అంతే! ఆ ప్రయత్నంచేసే చొరవ అతనికి ఎలా వచ్చిందో తెలుసా? స్త్రీకి సంబంధించినంత వరకూ శీలం అనేది ముఖ్యం అన్న ఆలోచన, పురుషుడికి శీలం పోయినా ఫర్వాలేదన్న అహంకారం!" సహజ ఆలోచిస్తూ ఆగింది.

పరిమళ అసంతృప్తిగా చూసింది. "అంత మాటపడి, ఆ మదన్‌ని వదిలేస్తావా?"

"వదలక? పట్టుకోలేంగా! అతనో లోఫర్ అని మనం దండోరావేసినా లోకం నమ్మదు! అతను మగవాడు! అదే మన విషయంలో ఆనందంగా నమ్మేస్తుంది. నా విషయమే తీసుకుందాం. ఆ మదనమోహన స్వరూపుణ్ణి ఒక కన్నెపిల్ల అయిన నేను ఒక లాడ్జి గదిలో సెడ్యూస్ చేసే ప్రయత్నం చేశానన్న అపవాదుని లోకం ఆదరాబాదరా నమ్మేస్తుంది. 'నిప్పులేందే పొగరాదు' అనేస్తుంది''

"అయితే..." పరిమళ ఏదో చెప్పబోయింది.

"మీ నాన్న వద్దన్నా కూడా విషయం నా చెవిని వేసినందుకు థాంక్సోయ్! రా! నీకు కాఫీ ఇస్తా!" సహజ పరిమళ చెయ్యి పట్టుకుంటూ అంది.

"అది కాదు సహజా... అతను నీకు

చేస్తున్న అన్యాయాన్ని పట్టించుకోకుండా..."

"అబ్బబ్బ... ఆ విషయం కాసేపు మరిచిపో!" సహజ విసుగు నటిస్తూ అంది.

"మరిచిపోతే నష్టం మనకే!" పరిమళ మొండిగా అంది. "నీ గురించి అలాంటి పాడు మాటల ప్రచారం అయితే పెళ్లిచూపులకి రావడానికే భయపడతారు! మీ నాన్న సంబంధం చూడ్డానికి వెళ్లే ప్రతీ చోటా ఎదురుదెబ్బతింటాడు. నిన్నిట్లా చేసి వాడేమో ఎంచక్కా సంబంధాలు చూసుకుంటున్నాడు. హాయిగా పెళ్లి చేసుకుంటాడు! అప్పటికప్పుడే మరో సంబంధం దాదాపు ఫిక్స్ చేసుకున్నాడు. అమ్మాయి ఎవరో తెలుసా! కాలేజీలో మనకి జూనియర్. బాబ్డ్‌హెయిర్ భానుమతి తెలుసా?"

"అలాగా!" సహజ సాదాగా అంది "లెటస్ విష్ దెమ్ లక్!"

★ ★ ★

మూసివున్న తలుపు ముందు నించున్న బంట్రోతుకి తన పేరు రాసిన చీటీ ఇచ్చింది సహజ.

"అయ్యగారు ఇప్పుడు ఎవర్నీ చూడరు..." బంట్రోతు నిర్లక్ష్యంగా అన్నాడు.

"నన్ను చూస్తారు. ఫోన్ చేసి, పర్మిషన్ తీసుకునే వస్తున్నా" అంది సహజ.

బంట్రోతు లోపలికెళ్లి తిరిగొచ్చాడు. తలుపు లోపలికితోసి, వెళ్లమన్నట్టు చేత్తో సైగ చేశాడు. సహజ గదిలోపలికి అడుగుపెట్టింది. తలుపు మూసుకుంది.

విశాలమైన గది. గోడ దగ్గరగా, టేబుల్‌కి అటువైపున రొటేటింగ్ కుర్చీలో కూచున్న అతను ఫోన్లో ఎవరితోటో మాట్లాడుతున్నాడు.

"అన్నట్టు- మరిచిపోవద్దు. నెక్స్‌ట్ వీక్ ఇన్‌స్టాల్‌మెంట్ పకడ్బందీగా వుండాలి. ఎందుకో పట్టిపట్టి రాసినట్టనిపిస్తోంది. పట్టు సడలించు. ఫ్రీగా రాయ్" ఆపి, కాసేపువిని

అతను పకపక నవ్వాడు, మళ్ళీ కాసేపు విన్నాడు.

"ఐ డోంట్‌కేర్! కాల్చడాలూ, చించడాలూ నన్నేం చేయవు. నిన్నూ ఏమీ చేయవు. నీపని రాయడం, నా పని వేయడం. దట్సాల్" అంటూ ఫోన్ని క్రెడిల్ చేశాడు

అతని చూపులు సహజమీద వాలాయి.

"నమస్తే" అంది సహజ.

"యస్! కమిన్ అండ్ సిడౌన్" అన్నాడు మహతి వారపత్రిక ఎడిటర్- పబ్లిషర్ రవిచంద్ర.

సహజ టేబుల్‌ముందున్న కుర్చీలో కూచుంది.

రవిచంద్ర ఫిల్టర్‌కింగ్ వెలిగించి పొగ ఊది, ఆమెవైపు చూశాడు. "యస్... మిస్..."

"సహజ" సహజ అందిచ్చింది.

"యస్! సహజ... ఎ గుడ్ నేమ్! మరో పావుగంటలో నేను ఆఫీసులో వుండాలి. చెప్పండి... ఏం పనిమీదొచ్చారు?"

"మీతో మాట్లాడాలని వచ్చాను"

"దేని గురించి?"

"మీరు ఎడిట్‌చేసి, పబ్లిష్ చేస్తున్న 'మహతి' గురించి" సహజ నవ్వుతూ అంది.

"పత్రిక మీకు నచ్చిందా? ఆ ముక్క ఒక కార్డుముక్కమీద రాసి పడేస్తే పోయేదిగా! పాఠకుల పేజీలో అచ్చయిపోయేది"

"సారీ... మీ పత్రిక నాకు నచ్చలేదు"

"ఆ ముక్క కూడా కార్డుముక్కమీద రాసిపారేస్తేపోయేది. కాకపోతే పాఠకుల పేజీలో మా వాళ్లు అచ్చేసేవారు కాదు" నిర్లక్ష్యంగా నవ్వుతూ అన్నాడు రవిచంద్ర.

సహజ చిరునవ్వు నవ్వింది. "మిస్టర్ రవిచంద్రా... సంపాదకుడిగా, ప్రచురణకర్తగా మీరు కొంచెం బాధ్యతాయుతంగా వ్యవహరించాలని మీకు చెప్పడానికి వచ్చాను"

రవిచంద్ర గుబురు కనుబొమలు పైకిలేస్తూ, అతని నుదుట్ని పైకి తోశాయి "అంటే"




"అయాం సారీ... ఇంటిల్లిపాదీ... చదవాల్సిన 'సంసారపక్షమైన వారపత్రిక' అంటూ కవర్‌పేజీమీద చాటింపువేసే మీ పత్రికలో అశ్లీలం అధికభాగాన్ని ఆక్రమించింది..."

రవిచంద్ర పెదాల మధ్యవున్న సిగరెట్‌ని ఇవతలకి లాగాడు. పొగలోంచి అగుపిస్తున్న అతని కళ్లు నివురుగప్పిన నిప్పుల్లా చూస్తున్నాయి.

"అది అశ్లీలం కాదు, శృంగారం. శృంగారం నిషేధం కాదు. నవరసాల్లో ఒకటి"

సహజ చిన్నగా నవ్వింది. "మీరు అచ్చేస్తున్నదంతా శృంగారం అని మీరు అనుకుంటే, అశ్లీలం అనేది ఏమిటో చెప్పండి"

"వాట్ నాన్‌సెన్స్..." రవిచంద్ర విసుగ్గా అన్నాడు.

"చెప్పండి. మీ మహతిలోని సరుకు అశ్లీలం కాకపోతే, ఇంక 'అశ్లీలం' అనేది వేరే వుండాలి. అదేమిటో చెప్పండి చూద్దాం" సహజ అతన్ని తీక్షణంగా చూస్తూ సవాలు చేసింది.

"మీరు చెప్పలేరు. ఎందుకంటే మీరు మార్కెట్లోకి సరఫరా చేస్తోందంతా అశ్లీల సాహిత్యమే.

"మీరు ఇందాకా బుకాయించినట్టు నిజంగా మీరు పబ్లిష్ చేస్తున్నది ఒకవేళ శృంగారమే అయితే- అయివుంటే, 'అశ్లీలం' అంటే ఏమిటో మీరు సులభంగా చెప్పగలిగేవారు"

"నాన్‌సెన్స్" రవిచంద్ర కోపంగా అరిచాడు.

"యస్! అశ్లీలం అనేది నాన్‌సెన్సే"

"డోంక్ టాక్ నాన్‌సెన్స్" రవిచంద్ర హుంకరించాడు. "అసలు అశ్లీలమంటే ఏమిటో నీకు తెలుసా?"

"ఎందుకు తెలీదు? మీ 'మహతి'లో మీరు అచ్చేస్తున్న అయిదు సీరియల్స్‌లోని నాలుగింటిలో, ఆరు కథల్లోని అయిదింటిలో, జోక్స్‌లో సైతం అక్షరబద్ధం చేస్తున్నదంతా అదే. అశ్లీలమే" సహజ ఎగతాళిగా అంది.

రవిచంద్ర రౌద్రంగా చూశాడు. "పిచ్చివాగుడు వద్దు. అశ్లీలం, అశ్లీలం అంటూ గావుకేకలు వేస్తున్నావ్! దానికి నిర్వచనం నీకు తెలుసా? మహామహా మేధావులే అశ్లీలానికీ, శృంగారానికీ తేడా చెప్పలేకపోయారు"

"మహామహా మేధావుల సంగతి నాకు తెలీదు. మీరడిగిన నిర్వచనం తెలుసు" సహజ అతని కళ్ళల్లోకే చూస్తూ అంది. "హృదయాన్ని రంజింపచేసేది శృంగారం. శరీరాన్ని రెచ్చగొట్టేది అశ్లీలం. నలుగుర్నీ కూచోబెట్టుకుని పైకి చదవగలగేది శృంగారం. కట్టుకున్న భార్య ముందు కూడా మీరు చదవడానికి జంకేలా చేసేది అశ్లీలం రవిచంద్రగారూ... వాదులాట వద్దు. మీరు ప్రెస్ అనే ఫ్యాక్టరీలో తయారుచేసి, అమ్మిస్తున్న సరుకంతా అశ్లీలమే! ఆ నిజం మీకూ తెలుసు. ఒక పత్రికను నడిపే అనుభవం, శక్తి మీకున్నాయి. పౌరుడిగా మీకున్న బాధ్యతల్నీ మీరు పాటించాల్సిన ఆబ్లిగేషన్స్‌నీ దయచేసి గుర్తించండి. మీ చేతిలోని పత్రిక బలిష్టమైన సాధనం. దాని ద్వారా మన సంస్కృతినీ, సాహిత్యాన్నీ పెంపొందించండి! అశ్లీలాన్ని ప్రచురించకండి. యువతరాన్ని మిస్ లీడ్ చేయకండి"

ఓపిగ్గా విన్న రవిచంద్ర చిన్నగా నవ్వాడు. "నువ్వెవరో నేను అడిగి తెలుసుకోలేదు. అడక్కుండానే తెలుసుకున్నాను. మొన్న నా పత్రిక ప్రతుల్ని తగలబెట్టిన వీరవనితల తాలూకు సంస్థల ఏజెంటువి. కాపీల్ని దహనం చేయగానే దడుసుకుని నా పత్రికని మూసేస్తాననుకున్నారు. లేదా మీరు అశ్లీలమనుకునే రచనల్ని ఆపేస్తాననుకున్నారు. లొంగకపోయేసరికి వాళ్ళ ఏజెంటుగా నువ్వు రాయబారానికి వచ్చావ్" అన్నాడు

"నన్ను ఎవ్వరూ పంపలేదు. నాకు

నేనుగా వచ్చాను నేను ఒంటరిదాన్ని'' సహజ నవ్వుతూ అంది.

"ఓహెూ... ఒంటరి క్రూసేడర్‌వి అన్న మాట. ఎందుకు నీకీ తీట?"

"నేను స్త్రీని కనుక! ఎక్కడ అశ్లీలం వుంటుందో, అక్కడ ఆడదాని గౌరవం అంత రిస్తుంది కనుక! నా జాతి గౌరవాన్ని అంటే మీకు జన్మనిచ్చిన ఆడదాని గౌరవాన్నీ, మీకు ఆనందాన్నీ, సంతానాన్నీ ఇస్తున్న ఆడదాని గౌరవాన్నీ, మీ కూతురి గౌరవాన్నీ, మీ కోడలి గౌరవాన్నీ నిలబెట్టాలనుకుంటున్నా ను కనక! ఆడదాని మోడెస్టీ అక్షరాల రూ పంలో అమ్ముడుపోకూడదని ఆశిస్తున్నాను కనక!" రెప్పవేయకుండా అతన్నే చూస్తూ అంది సహజ.

"షటప్! అండ్ గెటౌట్" రవిచంద్ర పిడి కిలి బిగిస్తూ అరిచాడు. "నాకు సంబంధించిన స్త్రీల పేరు ఎత్తితే నేను సహించను''

"అందరి స్త్రీలపట్లా మీరు అలాంటి దృక్ప థాన్నే కలిగివుండడం మంచిది''

రవిచంద్ర పిడికిలి టేబుల్‌మీద చప్పుడు చేస్తూ సహజకి అడ్డుతగిలింది. అతను తటా లున లేచి నిలబడ్డాడు. నిప్పులు కక్కుతూ సహజవేపు బెదిరింపుగా చూశాడు. "డోంట్ టాక్ రబ్బిష్. గో అవే''

"మిస్టర్ రవిచంద్రా..."

"ఐసే గో అవే! గెట్ లాస్ట్''

"అరవకండి. నేనంత సులభంగా భయప డను; పారిపోను. మీకు చేతనైతే మీరు పబ్లిష్‌చేస్తున్న సీరియల్సూ, కథలూ అశ్లీలం కాదనీ, మీరు చేస్తున్నదంతా సాహితీ సంస్కృతుల సేవే అనీ నాచేత ఒప్పించండి. నన్ను మీరు కన్విన్స్ చేస్తేతోక ముడుచుకుని వెళ్ళిపోతాను. నన్ను కన్విన్స్ చేయలేకపోతే మీరు ప్రచురిస్తున్న బూతు సీరియల్స్‌ని ఆపేసి, జాతి జీవితాలనూ, ఆశలనూ, ఆశయా లనూ, సమాజంలోని అక్రమాలనూ, అన్యా యాలనూ ఆవిష్కరించే రచనలు ప్రచు రించండి''

"నాన్‌సెన్స్'' రవిచంద్ర అరిచాడు. "నేను చేస్తోంది అదే! ఓ ఆడదాని ఆత్మగౌరవాన్ని అమ్ముకుంటున్నానంటూ నువ్వు విమర్శిస్తు న్న నేను రన్ చేస్తున్న మహతి పత్రికను కొని చదివే పాఠకుల్లో మీ ఆడవాళ్ళ శాతమే ఎక్కువ తెలుసా?"

"అది ఆడపాఠకుల్ని వల్లో వేసుకోడానికి మీ పత్రిక నిర్వహించినట్టు చెప్పుకుంటున్న సర్వే ఫలితాలు. అదంతా పబ్లిసిటీ స్టంట్. 'స్టంట్' అన్నపదమే అందులో 'నిజం తక్కువ' అని చెప్పకనే చెప్తుంది. ఒకవేళ వాదనకోసం మీ పత్రికని చదివేవాళ్లలో స్త్రీలే ఎక్కువ అనుకున్నా, ఎక్కువమంది స్త్రీలు మీ పత్రికని చదువుతున్నారు అని అర్థంకాదు. ఆ మాటకొస్తే ఎక్కువమంది స్త్రీలు మీ పత్రికని అసహ్యించుకుంటున్నారు..."

"ఐ డోంట్‌కేర్"

"ఇంక మీరిచ్చుకుంటున్న పబ్లిసిటీ పూర్తి గా అబద్ధమనీ, అసంబద్ధమనీ, మిస్‌లీడ్ చేసేదనీ, ప్రజల్ని మోసం చేసేదనీ నిరూపిస్తా ను''

"అది నీ తరం కాదు. అది..."

"నన్ను పూర్తి చేయనివ్వండి'' సహజ తీక్షణంగా అంది. "మెగా సీరియల్ ఆఫ్ ఇయర్ అంటూ మీరు ప్రచురిస్తున్న సీరియల్ గురించి ఏం రాస్తున్నారో గుర్తుందా? 'ప్రతీ భర్తా తన భార్యచేతా, ప్రతి భార్యా తన భర్తచేతా చదివించాల్సిన సీరియల్' అంటూ ఊరిస్తున్నారు. మిస్టర్ రవిచంద్రా, ఏ ఆడదీ ఆ బూతుపురాణాన్ని పఠించి, అధ్యయనం చేయమని తన భర్తకు రికమెండ్ చేయదు. ఏ భర్తా ఆ చెత్తను చదివి, అధ్యయనం చేయ మని తన భార్యకి సలహా ఇవ్వడు''

"అది నీ భ్రమ"

"నిజం చెప్పండి. ఆ సీరియల్ని చదవ మని మీ భార్యకి మీరు ఇచ్చారా? మీ





కూతురికి రికమెండ్ చేశారా?"

రవిచంద్ర మొహం కందగడ్డలా అయింది. "వాట్ నాన్‌సెన్స్! వాట్..."

"సమాధానం చెప్పండి'' సహజ గర్జించింది. "నేను చెప్తాను. మీరు ఇవ్వలేదు, ఇవ్వలేరు''

"నాన్‌సెన్స్!"

"ఆ పదాన్ని వదిలేసి మరోపదం అనండి. విని విని విసిగిపోయాను'' సహజ నవ్వుతూ అంది. ఆంధ్రలోని ఆడవాళ్ళందరూ విధిగా 'చదివితీరాల్సిన సీరియల్ అని మీరు సిగ్గు, బిడియం, భయం ఏమీ లేకుండా చాటింపువేస్తున్న మీ సీరియల్ అంత మహత్తరమైనదైతే నేనో పరీక్ష పెడతాను తట్టుకుంటారా?"

"ఏమిటి నీ బోడిపరీక్ష? నాకు పరీక్ష పెట్టడానికి నువ్వెవరివి? హూ ఆర్ యూ?"

"మొదట పరీక్ష ఏమిటో చెప్తాను. అందరూ 'విధిగా చదివి తీరవలసి'న మీ మెగా సీరియల్ని నేను మీ సమక్షంలో మీ అమ్మగారికి చదివి వినిపిస్తాను. ఒక ఇన్‌స్టాల్‌మెంట్ ఆమె విన్నాక ఎలా వుందో ఆమెని అడుగుదాం. ఆమె బాగుందంటే, మెచ్చుకుంటే నా అంచనా తప్పని వొప్పుకుని, క్షమాపణ అడిగి వెళ్ళిపోతాను. ఆమె 'ఛీ' అంటే వెంటనే ఆ సీరియల్నీ, ఇతర అశ్లీల సాహిత్యాన్నీ ఆపేస్తారా?"

ఛాలెంజ్ చేస్తూ చూస్తున్న సహజ విశాల నేత్రాల్లోకి తన ఎర్రటి చూపుల్ని నాటుతూ క్షణకాలం అలాగే ఉండిపోయాడు రవిచంద్ర.

"మర్యాదగా లేచి వెళ్తావా, బైటికి గెంటించమంటావా?" రవిచంద్ర కంఠం ఖంగుమంది.

సహజ లేచి నిలబడింది. "నేను పెట్టే పరీక్షకి నిలబడే శక్తి ధైర్యం, నాగరికత, నీతి నిజాయితీ, సభ్యత మీకు లేవు- అని మీ బెదిరింపుతో నాకు చెప్పారు. మీ తల్లిగారు మిమ్మల్ని క్షమించదనీ, మీరు చేస్తున్న అక్షర వ్యభిచారం సాగనివ్వదనీ పరోక్షంగా ఒప్పుకున్నారు. మీ మహతిలో మీరు అచ్చేస్తున్నదంతా అశ్లీలమే అని అంగీకరించారు. థాంక్స్! మిస్టర్ రవిచంద్రా..."

"షటప్!" రవిచంద్ర కంఠం పిస్టల్ షాట్‌ని వెక్కిరించింది. "వేస్తాను. అశ్లీలమే అచ్చువేస్తాను. అమ్ముకుంటాను. ఏం చేస్తావ్?"

సహజ అతని కళ్లల్లోకి పొడుస్తున్నట్టు చూసింది. "మీరు- సారీ- నువ్వు చేస్తోంది- పత్రికా వ్యాపారం కాదు. వ్యభిచారగృహం నడిపేవ్యక్తికీ, నీకూ నా దృష్టిలో తేడా లేదు. వాడు అబలల శరీరాల్ని అమ్మి సొమ్ము చేసుకుంటున్నాడు. నువ్వు ఆడదానీ మానాన్ని బట్టబయలు చేస్తూ, అభం శుభం ఎరుగని కన్నెపిల్లల మోడెస్టీనీ, సంసారపక్షంగా బతికే స్త్రీ మోడెస్టీనీ అక్షరాలలో ఆరబెట్టి అమ్ముకుంటున్నావు.''

"అయిందా?" రవిచంద్ర ఎగతాళిగా అన్నాడు. "ఇందాకే చెప్పాను. నా పత్రికని అట్లాగే ప్రచురిస్తాను. అమ్ముతాను. సొమ్ము చేసుకుంటాను. నిషిద్ధ సాహిత్యాన్ని నేను ప్రచురిస్తూ ఉంటే ప్రభుత్వం ఎందుకు ఊరుకుంది? ప్రభుత్వానికి లేని తీట నీకెందుకు? ఎందుకు సిస్టర్?"

"ఎందుకంటే- మనది ప్రజాప్రభుత్వం. అంటే ప్రభుత్వమంటే ప్రజలే అని అర్థం. ప్రజల్లో ఒక మెంబరుగా, ప్రభుత్వంలో ఒక అణువుగా నేను నిన్ను హెచ్చరించాను. ఆ హక్కు నాకుంది. అర్థమైందా బ్రదర్?" సహజ నవ్వింది.

రవిచంద్ర వెటకారంగా నవ్వాడు. "నీ హక్కు, నా హక్కుని ఏమీ చేయలేదు. కనీసం- కనీసం నా పత్రిక కవర్‌పేజీని కూడా అది చింపలేదు, అది తెలుసుకుని, వొంటి నిండా పైటకప్పుకుని ఇంటికెళ్ళిపోయి 'రామ కోటి' రాసుకుంటూ, వంట చేసుకుంటూ బతుకు ఫో'

సహజ అతనివైపు చిరునవ్వుతో చూసింది. "రామకోటిలో ఎంత మహత్తువుందో

నాకు తెలీదు. కానీ, నువ్వు రాయించి, అచ్చు వేస్తున్న 'కామకోటి'ని చదవడంకన్నా ఆ రామకోటి రాయడం బెటరే'

"దెన్ రన్ అండ్ డూ ఇట్' రవిచంద్ర మొరిగినట్టు అరిచాడు. "రన్ అవే'

"మొన్న నీ పత్రిక కాపీల్ని తగలబెట్టిన స్త్రీశక్తి రెచ్చిపోయి నీ పత్రిక ఆఫీసునూ నిన్నూ తగలబెట్టే స్థితిరాకుండా, నిన్ను ఎడ్యుకేట్ చేసే ప్రయత్నం చేశాను. నీలోని సభ్యమాన వుణ్ణి, బాధ్యత కలిగిన పౌరుణ్ణి నిద్రలేపే ప్రయత్నం చేశాను. కానీ, ఇంతసేపూ నేను రాతిమీద రబ్బరుసుత్తితో కొట్టానని అర్థం చేసుకున్నాను. త్వరలో అతి త్వరలో రబ్బరు సుత్తిని పారేసి సమ్మెట తీసుకుంటాను''

'గెటౌట్ యూ..." రవిచంద్ర విసురుగా ఆమె దగ్గరగా వచ్చాడు.

"రవిచంద్రగారూ..."

తలుపుని సమీపించబోతున్న రవిచంద్ర తటాలున ఆగాడు. వెనక్కితిరిగి ఆశ్చర్యంగా చూశాడు.

"మీతో ఒక నిమిషం, ఒకే ఒక్క నిమిషం మాట్లాడనిస్తారా?"

"మీ అశ్లీల వ్యాపారంవల్ల అధికంగా నష్టపోయేది స్త్రీజాతే! మీ మాతృమూర్తిగా, అర్ధాంగిగా, అక్కగా, చెల్లిగా, కూతురిగా, కోడలిగా అవతరించే స్త్రీత్వాన్ని డబ్బుకోసం బజారుపాలు చేయకండి! ఆ స్త్రీత్వంయొక్క సర్వస్వాన్ని నగ్నంగా ఊరేగించకండి!" సహజ కంఠం జీరబోతూ, తాత్కాలిక మౌనాన్ని ఆశ్రయించింది. ముత్యాల్లా ఆమె కళ్ల నుండి జారిన కన్నీటి బిందువుల్ని రవిచంద్ర చిరునవ్వుతో, గర్వంగా చూశాడు.

"ఇదేనా నీ సమ్మెట?" అతని కంఠస్వరం ఎగతాళికి పదునుపెట్టింది.

"మిస్టర్ రవిచంద్రా! సూర్యచంద్రుల ఇద్దరి పేర్లూ కలగలిపి పెట్టుకున్న నీలో చీకటి రాజ్యం చేస్తోంది! నా మెసేజ్ నీకు అర్థమవుతుందనుకున్నాను. మాటలు మనిషికి అర్థమవుతాయి. మనిషిలోని మృగానికి అర్థంకావు! త్వరలో నీలోని మృగానికి అర్థమయ్యే భాషలో మెసేజ్ అందిస్తాను! వస్తాను!" సహజ గిరుక్కున వెనక్కి తిరిగి చకచకా అవతలికి నడిచింది.

"ఆగు!" రవిచంద్ర అరుపు ఆమె చెవుల్ని దెబ్బలాగా తాకింది.

సహజ ఆగకుండా తలతిప్పి, చిరునవ్వుతో చూసింది. "నో! నవలల్ని సీరియల్స్‌గా నువ్వు కత్తిరించినట్టు, నీ డర్టీ బిజినెస్‌ని వాయిదాలపద్ధతిలో కత్తిరించేదాకా ఆగను!"

ఆగ్రహంతో, ఉక్రోషంతో అతను నోరు చేస్తున్న అర్థంలేని చప్పుళ్లని పూర్తిగా నిర్లక్ష్యం చేస్తూ సహజ అతని భవంతి మహద్వారాన్ని తెరిచి అవతలికి నడిచింది. రోషంతో అతను మూసిన గది తలుపు మహతి పత్రికలో అతను అచ్చువేసే బూతుశబ్దాల్ని ప్రతిధ్వనిస్తున్నట్లు శబ్దంచేసింది...



**స**హజ యాంత్రికంగా ఫుట్‌పాత్‌మీద నడుస్తోంది. ఇందాకటి వాగ్యుద్ధం ఆమెలో, ఆమె ప్రయత్నంలేకుండానే పునరావృతం అవుతోంది. తను గెలిచిందా, ఓడిందా? సహజ తననితానే ప్రశ్నించుకుంది.

'రిక్షా అండి అమ్మాయిగారూ!' అన్న





రిక్షావాడి పిలుపు ఆమెని వర్తమానంలోకి లాగింది. తనిప్పుడు ఎక్కడుంది? సహజ పరిసరాల్ని పరికించింది. నేతాజీ రోడ్డు. నేతాజీ రోడ్డు ఆమెకి పరిమళనీ, మాలినినీ, భానుమతినీ చకచక గుర్తుకు తెచ్చింది. మాలినిని అడిగి తను బాబ్డ్‌హెయిర్ భానుమతి ఇల్లెక్కడో కనుక్కుంది ఆరోజు బజార్లో.

భానుమతి ఇల్లు నేతాజీ రోడ్డు, రామాలయం వీధీ కలిసేచోట ఉంది. మాలిని ఇంటినంబరు కూడా చెప్పింది. ఆశగా చూస్తున్న రిక్షావాణ్ని వెళ్లమని సహజ ముందుకి కదిలింది. అయిదు నిమిషాల్లో ఆమె భానుమతి ఇంటిముందు ఆగింది.

వరండాముందు ఆగివున్న లూనాని ఎక్కబోతున్న భానుమతి, లోపలికి వస్తున్న సహజని చూస్తూ ఆగింది.

"హలో! సర్‌ప్రైజ్ విజిట్! రండి రండి!" భానుమతి హుషారుగా ఆహ్వానించింది.

"ఇలా వెళ్తుంటే నువ్వు గుర్తొచ్చావు! బాగున్నావా భానూ?" సహజ నవ్వుతూ అడిగింది.

భానుమతి ఉల్లాసంగా బాబ్డ్‌హెయిర్ ఎగరేస్తూ పోజిచ్చింది. "మీరే చెప్పండి!"

"నేను చూసినప్పటికంటే వందరెట్లు పెరిగింది నీ అందం! పెళ్లికళ కనిపిస్తోంది!"

"ఫేస్‌రీడింగా?" భానుమతి నవ్వుతూ అంది. "రండి! లోపలికెళ్లి కబుర్లు చెప్పుకుందాం. పెళ్లి కబుర్లు!" అంది సహజ చేతిని పట్టుకుంటూ.

"కంగ్రాట్స్ భానూ! పెళ్లి కుదిరిందటగా?"

"పెళ్లి... ముహూర్తం కూడా కుదిరింది. అయితే పొగరు అణగలేదు, అణగదు!" భానుమతి సినిమా పాటను విరుస్తూ అంది.

సహజ నవ్వుతూ, ఆలోచిస్తూ భానుమతి వెంట ఇంట్లోకెళ్లింది...



ఎక్కడికెళ్లావని అడిగిన తల్లితో ఎక్కడికీ వెళ్లలేదు అంటూ అందీపొందని అబద్ధమాడింది సహజ. అన్నం తినమంటే ఆకలి లేదంది. ఆకలి విషయంలో ఆమె నిజమే చెప్పింది. సహజకి ఆకలి వేయడంలేదు. కడుపులో ఉండాల్సిన ఆకలి విచిత్రంగా ఆమె హృదయంలోకి వలస వెళ్లిపోయింది. 'కడుపులో మండే ఆకలి - హంగర్ ఇన్ ది స్టమక్ లోకానికి మేలు చేయదు. హృదయంలో ఉండే ఆకలి - హంగర్ ఇన్‌ది హార్ట్ లోకానికి మేలు చేస్తుంది' అనిపించింది ఎందుకో సహజకు.

ఆలోచిస్తూ సహజ తన గదిలో టేబుల్ ముందు కూచుంది. ఆలోచన, బరువుగా ఆమె కనురెప్పల్ని మూసింది. కాసేపట్లో ఏదో నిర్ణయం ఆమె కనురెప్పల్ని పైకి లేపింది.

సహజ చేతిలోని కలం, కాగితం మీదికి ఏకాగ్రతతో వాలింది. 'రాష్ట్ర సాహిత్య అకాడమీ అవార్డు గ్రహీత, ప్రముఖ రచయిత్రి శ్రీమతి సమతాదేవిగారికి...' సహజ రాయడం ప్రారంభించింది. ఒకటోపేజీ... రెండు... మూడు... నాలుగోపేజీ చివరి పేరా...

"పబ్లిషర్ బ్లర్బ్‌గా ప్రతీవారం నాగా లేకుండా వాడుకుంటూ, వ్యాపార ప్రకటనగా మార్చేసుకున్న మీ స్టేట్‌మెంట్ అక్షరసత్యమే అనీ, దశాబ్దాల తరబడీ మీరు కలలు కన్న ఒక పత్రికను 'మహతి'లో చూస్తున్నారనీ మీరు హృదయపూర్వకంగా భావిస్తే ఇంతవరకూ విలువలు కలిగిన రచనలనే వెలువరించిన మీరు ఆ పత్రికకోసం, దాని ట్రేడ్ మార్క్ అయిన ఒక సెక్స్ సీరియల్ రాయండి. పబ్లిష్ చేయించండి. అలాంటి అశ్లీల రచన చేసే దిగజారుడుతనం మీ కలానికి పట్టలేదు అని భావిస్తే పై పేరాలో నేను చేసిన విన్నపాన్ని మన్నించి తక్షణచర్య తీసుకోండి! అనుభవం పండిన ఒక స్త్రీని, ఒక యువతి కోరుతున్న కోరిక ఇది!"

సహజ సంతకం చేసి, కాగితాల్ని మడిచి కవర్లోపెట్టి, కవర్ని అతికించింది. అడ్రసు

రాసి, పెన్ను బల్లమీద పడేసి విశ్రాంతిగా వెనక్కి వాలింది...



మదన్ హుషారుగా ఈల వేసుకుంటూ ఇంట్లోకి దూరాడు. హాలుమధ్య సోఫాలో పక్కపక్కనే బుంగమూతులు పెట్టి కూచున్న తల్లినీ, చెల్లి మంజరినీ చూడగానే అతని ఈలపాటకు గాలి అందడం ఆగిపోయింది.

"నాన్నేడీ? వాళ్లింటికెళ్లాడా?" తల్లినీ, చెల్లినీ జాయింటుగా ప్రశ్నించాడు మదన్.

"ఎవరింటికి?" క్షణం తరువాత ఎదురుప్రశ్న వేసింది మంజరి.

"ఎవరింటికి? పెళ్లికూతురింటికి. ఇవాళ వాళ్లు డబ్బిస్తున్నారుగా! నువ్వూ వెళ్లకుండా నాన్న ఒక్కర్నే ఎందుకు పంపించావమ్మా?"

జవాబుగా అతని తల్లి నిట్టూర్చింది.

"నాన్న వాళ్లింటికి వెళ్లలేదు... వెళ్లడు'' మంజరి ముక్తసరిగా అంది.

మదన్ సోఫాలో కూచుంటూ అర్థంకానట్టు చూశాడు. "వెళ్లడా? ఎందుకటా?"

మంజరి అతని మొహంలోకి తదేకంగా చూసింది. "వాళ్లు వాళ్లమ్మాయిని మనింటికి ఇవ్వరట..."

"వాట్!?" మదన్ అదిరిపడ్డాడు. "నేనన్నమ్మను!"

"నమ్మకపోతే అమ్మనడుగు!" మంజరి నిర్లక్ష్యంగా అంది.

"అవున్రా నాయనా! ఆ అమ్మాయి నిన్ను చేసుకోనందట. సమ్మంధం ఆచూకీ చెప్పిన అవధాని ఇందాకే చెప్పి వెళ్లాడు చావుకబురు. మీ నాన్న వెంటనే మేడెక్కేశారు..."

మదన్ రెప్ప వేయకుండా తన తల్లిని చూస్తూండిపోయాడు. ఆ అమ్మాయి భానుమతి తనని చేసుకోనందా? నాలుగురోజుల క్రితం తనతో పార్కుకి వచ్చినప్పుడు భానుమతి తనతో చెప్పిన మాటలన్నీ అతనికి గుర్తొస్తున్నాయి. తను నచ్చాడంది. తను అంగీకరిస్తే ఉద్యోగం చేస్తానంది. లేకపోతే లేదంది... ఇంకా ఎన్నో... ఎన్నో అంది. ఇప్పుడిదేమిటి? ఎక్కడో ఏదో పొరపాటు జరిగింది.

"అమ్మా! నిజంచెప్పు. మొదట అనుకుంది కాకుండా ఎక్స్ట్రా కట్నం అడగలేదుగా నువ్వు?"

"కట్నమూ అడగలేదు, కానుకలూ అడగలేదు!" అతని తల్లి కోపంగా అంది.

"అయితే ఇందాకా వచ్చాక ఊరూవాడా తెలిసిపోయాక ఎందుకు కాదంటున్నారో నేనే స్వయంగా వెళ్లి కనుక్కొని కడిగేసి వస్తాను!"

"ఆ అడగడాలూ, కడగడాలూ అన్నీ అమ్మ అక్కడే చేసింది. నువ్వు స్వయంగా పోయి, పరువు పోగొట్టుకోవాల్సిన అవసరంలేదు!" మంజరి ఉక్రోషంతో అంది.

లేవబోతున్న మదన్ సోఫాలో కూలబడ్డాడు. "అవధాని ఏం చెప్పాడు? వాళ్లు మన సమ్మంధం ఎందుకు వద్దన్నారో, ముఖ్యంగా భాను నన్నెందుకు చేసుకోనందో నాకు తెలియాలి!"

పౌరుషంగా అన్న మదన్ని ఇద్దరూ నిదానించి చూశారు. వాళ్ల మౌనం మదన్ శరీరంమీద గొంగళిపురుగుల్లా పాకుతోంది.

"చెప్తారా, నాన్నని అడగనా?" విసుగ్గా అరిచాడతను.

"నువ్వే చెప్పవే అమ్మాయ్. ఆ పాడు మాట నేను చెప్పలేను''

తల్లివేపు ఆశ్చర్యంగా చూసి మదన్ చూపుల్ని ప్రశ్నార్థకంగా మంజరివైపు తిప్పాడు. మంజరి గుటకలు మింగుతూ మూగదానిలా చూసింది. మదన్ కోపంగా చివాల్న పైకి లేచాడు.

"నీలో... మగ... అదే... నువ్వు నపుం.. ఇంపొటెంట్వని ఎవరో చెప్పారట... వాళ్లకి..." మంజరి నేలచూపులు చూస్తూ అంది.

మదన్ తటాలున సోఫాలో కూచుండిపో





యాడు. అయోమయంగా తల్లినీ, చెల్లినీ చూస్తూ నాలుక కొనతో పెదాలు తడుపుకున్నాడు. అతని పిడికిళ్లు బిగుసుకున్నాయి.

"ఎవరా కూసింది?"

"మనల్ని చూసి ఓర్వలేని పాడు ముండాకొడుకులు ఎవరో ఆ అపనింద వేసివుంటార్రా నాయనా..." మదన్ తల్లి ఏడుపుగొంతుతో అంది.

అవమానంతో, విచారంతో వాలిపోయిన తలని పైకెత్తకుండా తన గదిలోకెళ్లి, తలుపు మూసుకున్నాడు. తను నపుంసకుడా? భానుమతి అందా? ఎందుకలా అంది? తన గురించి ఆమె అంత దారుణంగా అబద్ధమాడడానికి కారణం ఏమిటి? కారకులు ఎవరు?

అతని ప్రశ్నకి సమాధానం ఇస్తున్నట్టు బల్లమీదున్న టెలిఫోన్ మోగింది. మోగుతూనేవుంది. విసుగ్గా వెళ్లి రిసీవర్ని అందుకున్నాడు. "యస్" అన్నాడు బొంగురుగా.

"కుడ్ ఐ స్పీక్టు మిస్టర్ మదన్ ప్లీజ్?" స్త్రీకంఠం శ్రావ్యంగా అతని చెవిలో ప్రశ్నించింది.

"నేనే... ఎవరు? భానూ...?" అప్రయత్నంగా అన్నాడతను.

"భానుమతితో కూడా మాట్లాడాను!" అవతలి కంఠం చిన్నగా నవ్వుతూ అంది. "నేనెవరో పోల్చుకోలేదా? సహజ! గుర్తున్నానా?"

"స...హ...జ...! ఎందుకు ఫోన్ చేశావ్?" ఆశ్చర్యాన్ని ఆగ్రహంగా మారుస్తూ గద్దించాడు మదన్.

"భానుమతిని పెళ్లాడబోతున్నావటగా! ఆమెతో మాట్లాడాను..."

మదన్ మూగవాడిలా మౌనంగా వుండిపోయాడు.

"ఏం మాట్లాడానో, ఆమెకి ఏం చెప్పానో తెలుసా?" సహజ ప్రశ్న నవ్వుతో ముస్తాబు చేయబడివుంది. "ఆమధ్య మనిద్దరికీ పెళ్లి కుదిరిన సంగతి చెప్పాను. నీ పర్సనాలిటీ చూసి మతిపోయి, మరులుగొని తెలివిగా నిన్ను లాడ్జిగదికి తీసుకెళ్లిన విషయం చెప్పాను. నా అందంతో, యవ్వనంతో నిన్ను లొంగదీసుకుని, కట్నం లేకుండా నిన్ను కాజేసే ప్రయత్నం చేసినట్టు చెప్పాను. నువ్వు లొంగలేదనీ, ఆ ప్రయత్నంలో నేను సక్సెస్ కాలేకపోయాననీ, అందుక్కారణం నీలో మగతనం లేకపోవడమే అని కనుక్కున్నాననీ చెప్పాను. నీ పేడితనం గురించి, పాపం నీక్కూడా ఆ క్షణందాకా తెలీదని చెప్పాను! నమ్మించాను" సహజ నవ్వు అతన్ని సన్నగా వెక్కిరించింది.

మదన్ చేతిలోని రిసీవర్ వణకసాగింది. కాసేపట్లో ఆ వణుకు అతని శరీరమంతా వ్యాపించింది. అతని మొహం బిగుసుకుపోయింది. రిసీవర్ దగ్గరగా వున్న అతని పెదవులు కోపంతో కదిలాయి. "యూ... బిచ్..."

"యూ... యూనక్!" సహజ కంఠం అతని కర్ణభేరిని ఫట్మంటూ తాకింది. "కట్నం గురించి నీతో వాదించినందుకూ, పెళ్లి చేసుకోనని మొహం పగలేసినట్టు చెప్పినందుకూ కసి పెంచుకుంటావా? ఒక కన్నెపిల్ల నీతో ఒంటరిగా లాడ్జిగదికి వచ్చిందనీ, అందాన్ని నీముందు కుమ్మరించి, నిన్ను లొంగదీసుకోబోయిందని దండోరా వేస్తావా? కసి నీకేకాదు, మదనా! నాక్కూడా వుంది. పగ నీలోనేకాదు, నాలోనూ ఉంది! నాగురించి పాడు కథలు అల్లి, నా శీలాన్ని బజార్న పడవేయాలని చూస్తావా? జన్మకి నాకు పెళ్లి కాకూడదనుకున్నావా? నా శీలంమీద నువ్వు బురద చల్లావు. నీ పురుషత్వంమీద నేను చల్లాను! క్విట్స్!"

"నిన్ను... నిన్ను... సర్వనాశనం చేస్తాను!" నిన్ను..."

"షటప్! ఇంపొటెంట్ ఇడియట్! ఆరోజు నాకు గుణపాఠం నేర్పుతానని శపథం చే

శావ్! నువ్వు రెండు గుణపాఠాలు నేర్చుకునే లా చూస్తానంటూ నేను శపథం చేశాను! నీ శపథాన్ని నువ్వు గుర్తుపెట్టుకున్నావ్! నా శపథాన్ని నేను మరిచిపోలేదు! గుర్తు చేసు కుంటూనే వుంటాను! అదెప్పుడూ గుర్తుపెట్టు కో!"

అటువైపున రిసీవర్ అతని చెవిని పగలే స్తూ క్రెడిల్‌మీద పడింది. కోపంతో పళ్లు కొరుకుతూ, వణుకుతూ కాసేపు చెట్టులా నిలబడిపోయాడు. నిశ్శబ్దంగా తనని వెక్కిరి స్తున్న రిసీవర్ని విసిరికొట్టి మదన్ కుర్చీలో కూలబడ్డాడు. తగువిధంగా సమాధానం చె ప్పి, మొహం పగలేసే అవకాశం ఇవ్వ కుండా డిస్కనెక్ట్ చేసిన సహజమీద ఆగ్రహం అతని నిలువెల్లా విషంలా వ్యాపిస్తోంది.

తలుపు చప్పుడైంది. మదన్ ఉలిక్కిపడి తల తిప్పి చూశాడు. ద్వారబంధంలో మంజరి నిలబడివుంది. ఆమె కళ్లు తీక్ష ణంగా, ఎగతాళిగా అతన్నే చూస్తున్నాయి.

"అయితే సహజమీద అభాండం వేశావ న్నమాట!" మంజరి ఎగతాళిగా అంది.

మదన్ ఉక్కిరిబిక్కిరవుతూ చూశాడు.

"మెయిన్ ఫోన్‌లో అంతా విన్నాను! సహజ చేసిన చిన్న తప్పుకు చాలా చాలా పెద్ద శిక్ష వేశావ్. సహజ నీకు తగినశిక్ష విధించింది.

"నోర్ముయ్!" మదన్ పళ్లుకొరికాడు.

"నా నోరు మూయించగలవ్! సహజ నోరూ, భానుమతి నోరూ మూయించలేవన్న య్యా!" మంజరి వెటకారంగా అంది.

"నువ్వు మగాడివి. పది పెళ్లి సంబంధా ల్ని తప్పించి, సహజమీద పగ తీర్చుకోగ లవు. సహజ ఐదు సంబంధాలేనా తప్పి స్తుంది నీకు! ఆ గ్యారెంటీ నేనిస్తాను!" మంజరి వెనక్కి తిరిగి తలుపుల్ని భళ్లున మూసింది. కాడి మోయడంకోసం రైతుచేత ఎద్దుగా మార్చబడిన ఆబోతులా నీరసంగా చూస్తూ వుండిపోయాడు మదన్.

★ ★ ★

"ఏమిటో... ఇంటిపట్టున ఉండకుండా.. ఎక్కడెక్కడికో తిరుగుతున్నావు! ఏమిటా రా చకార్యాలు?"

హ్యాండ్ బాగ్‌ని గిరాటేసి, సోఫాలో వాలి, పద్మాసనంలో సర్దుకుని, తలవెనక్కివాల్చి విశ్రాంతిగా కళ్లు మూసుకున్న సహజను చూస్తూ అంది అమృతమ్మ.

సహజ కళ్లుతెరిచి, తలవాల్చి తల్లివైపు చూస్తూ నవ్వింది "రాచకార్యాలు కావమ్మా... రాణి కార్యాలు అను! రాచకార్యాలు మగాళ్లు చేసేవి!"

"మాటలు బాగా నేర్చావు! ఇవాళ్టినుంచీ, ఆ మూడు ముళ్లూ పడేదాకా నువ్వు ఇంట్లోంచి కదలడానికి వీల్లేదు!" అమృతమ్మ నిర్ధారణగా అంది.

"ఎందుకమ్మా! ఎండలో తిరిగితే నల్ల బడిపోతాననా?" సహజ నవ్వుతూ అడిగింది.

"నల్లబడేది నువ్వుకాదు, మన బతుకు, మన పరువు!" అమృతమ్మ ఉక్రోషంగా అంది.

సహజ తనలో నవ్వుకుంది. మదన్ ప్ర తాపం చివరికి తన తల్లిదండ్రులకి తెలిసిపో యింది.

"నేనేం తప్పుచేశాను నాన్నా?" అమాయ కంగా అడిగిందితండ్రికేసి తిరిగి

"తప్పు నేనే చేశానమ్మా..." శ్రీమంతరావు నిట్టూర్చాడు.

"ఏమిటి నాన్నా?"

"నీకోసం మరో సంబంధం చూశాను... వాళ్లు... వాళ్లు..."

"చేస్కుకోనన్నారా?" సహజ ప్రశ్నించింది.

"అలా అంటే బాధకలిగేదికాదు... వాళ్ల కి... ఎవరో... మనగురించి లేనిపోనివి చెప్పా రు వాళ్లు..."

"మన గురించి కాదు నీ గురించి!"




అమృతమ్మ భర్తకు అడ్డు తగుల్తూ కూతురితో అంది.

"మదన్‌తో నేను హోటళ్లకీ, లాడ్జిగదులకీ తిరిగానన్న సంచలనవార్తేగా అది?" సహజ నవ్వుతూ అడిగింది.

"నీకెలా తెలుసు?" అమృతమ్మ నివ్వెర పోతూ అడిగింది.

"ఎలా అయితేనేం? తెలుసు!" సహజ నవ్వింది.

"ఆ దరిద్రుడు మన పరువు తీస్తూంటే నీకు నవ్వులాటగా వుందా?" అమృతమ్మ గద్దించింది.

"సహజా... అయితే నీకు.. ఆ విషయం తెలుసన్నమాట! మాకెందుకు చెప్పలేదు?" శ్రీమంతరావు అడిగాడు.

"ఎవరో ఒకరు తప్పకుండా దండోరావేసే విషయాన్ని నేను చెప్పడం దేనికని ఊరుకున్నాను నాన్నా!" సహజ నవ్వింది.

"అదిగో... మళ్లీ నవ్వు... పుకార్లు పుట్టించి ఆ భ్రాష్టుడు సంబంధాలు చెడగొడుతూంటే నవ్వెలా వస్తోందే నీకు?" తల్లి ప్రశ్నకు జవాబుగా సహజ పకపక నవ్వింది.

"సహజా!" శ్రీమంతరావు మందలింపుగా అన్నాడు. "మాకు విచారం కలిగించే విషయం నీకు నవ్వు తెప్పిస్తోందా?"

"విచారం దేనికి నాన్నా? కొత్త సంబంధం కుదర్లేదనేగా? అతను నా పరువు తీశాడనేగా? మనల్ని ఏడిపించాలనుకున్న ఆ హీరో ఇప్పుడు తనే ఏడుస్తూ మూల కూచున్నాడు నాన్నా!"

"సహజా! ఎట్లా... ఎట్లా చేశావ్? ఏం చేశావ్?" శ్రీమంతరావు ఆదుర్దాగా అడిగాడు.

సహజ లేచి అతని దగ్గరగా వెళ్లి, మెడచుట్టూ చేతులు వేసింది. తలవాల్చి, పెదాల్ని అతని చెవి దగ్గరగా పెట్టి గుసగుసగా చెప్పి, నిలబడి నవ్వుతూ చూసింది.

"మైగాడ్! ఐ కాంట్ బిలీవ్!" శ్రీమంతరావు గుడ్లు పెళ్లగిస్తూ అన్నాడు.

"తెలుగులో అంటే మేమూ వింటాంగా!" అమృతమ్మ కసిరింది.

"సహజా..." శ్రీమంతరావు అనుమానంగా చూస్తూ అన్నాడు. "నువ్వు... అలా చేయకుండా వుంటే బాగుండేదేమో..."

సహజ తండ్రివైపు ఆశ్చర్యంగా చూసింది. ఆశ్చర్యం మాయంచేసిన చిరునవ్వు ఆమె మొహం మీద మెల్లగా ప్రత్యక్షమైంది. "నీ చెవిలో చెప్పింది అమ్మ చెవిలో చెప్పివుంటే అమ్మ నన్ను మెచ్చుకునివుండేది నాన్నా! ఎందుకంటే అమ్మ ఆడది! నువ్వు పురుషుడివి. పురుషుణ్ణి స్త్రీ అవమానిస్తే మరో పురుషుడు సహించలేడు నాన్నా! అందుక్కారణం యుగయుగాలుగా ఆచారం రూపంలో మగ రక్తంలో ప్రవహించి, ప్రవహించి సహజ ప్రవృత్తిగా మారిపోయిన పురుషాతిశయం నాన్నా!"

"సహజా...!"

"కాదా నాన్నా?"

"సహజా... అయాంసారీ..."

"ఇట్సాల్‌రైట్ నాన్నా!"

"అమ్మాయ్, మీ నాన్న చెవిలో చెప్పిన ఆ చిదంబర రహస్యమేమిటో నాకు చెప్తావా లేదా?" అమృతమ్మ ఉడుక్కుంటూ అడిగింది.

"చెప్తాను..." అంటూ సహజ ఇద్దర్నీ కలయజూసింది. "మీరిద్దరూ నాకో వాగ్దానం చేయాలి... నేను అడిగేదాకా నాకు పెళ్లి చేయకూడదు. నేను గ్రీన్ సిగ్నల్ ఇచ్చేదాకా సంబంధాలు వెతక్కూడదు"

"అదేమిటి? పెళ్లి చేసుకోకుండా వాయిదా వేసి ఏం చేద్దామనుకుంటున్నావ్? గోళ్లు గిల్లుకుంటూ కూచుంటావా?" అమృతమ్మ అడిగింది.

"గోళ్లు గిల్లుకునే అవసరం లేకుండా నాకు నేనే ఒక ఉద్యోగం ఇచ్చుకున్నాను. సెల్ఫ్ ఎంప్లాయ్‌మెంట్!"

"ఉద్యోగమా! నీకు నువ్వే ఇచ్చుకున్నావా?" అమృతమ్మ రాగం తీస్తూ అడిగింది. "జీతం కూడా నువ్వే ఇచ్చుకుంటావా?"

"ఇచ్చుకుంటాను! నా జీతం ఏమిటో తెలుసా అమ్మా?" సహజ నవ్వుతూ అంది.

అమృతమ్మ కళ్లు చిట్లించింది.

"తృప్తి" సహజ నవ్వుతూ అంది.

★ ★ ★

టీ తాగేసి, కప్పు టేబుల్ మీదపెట్టి, రవిచంద్ర మహతి కరెంట్ ఇష్యూ అందుకున్నాడు.

సిగరెట్ వెలిగించి, దమ్ములాగి, పత్రికని తిరగేశాడు. సీరియల్‌కీ, సీరియల్‌కీ మధ్య సెక్స్‌అప్పీల్ ఏమాత్రంలేని షార్ట్‌స్టోరీస్ ఉన్నాయి. 'మహతి' విలువలు కలిగిన సాహిత్యాన్ని పబ్లిష్ చేస్తుందనడానికి సాక్ష్యాలుగా ఆ వెజిటేరియన్ కథలు బాగా పనికొస్తాయి! ఆ కథల్లో ఒక్క కథని కూడా తను ఇంతవరకూ చదవలేదు!

నవ్వుకుంటూ అతను పేజీలు తిప్పి 'నగ్న హృదయం' సీరియల్‌ని ఇష్టంగా చదవడం ప్రారంభించాడు. 'నగ్నహృదయం' రచయిత్రి హారతి, తన పత్రికద్వారా హఠాత్తుగా రచయిత్రిగా పాఠకలోకం మీద ఊడిపడింది. సాధారణంగా రచయిత్రులు చేయలేని సాహసం చేసింది గనకే ఆమె మూడేమూడు బుల్లికథలతో సీరియల్ రచయిత్రిగా ప్రమోషన్ కొట్టేసింది. మూడు కథల్లోనూ మగవాళ్లకు తీసిపోని లెవెల్లో సెక్స్ రాయగలిగింది గనకే ఆమె స్టార్ రచయిత్రి అయిపోయింది!

నవ్వుకుంటూ అతను రచయిత్రి హారతి కలం నుండి జాలువారిన నగ్నహృదయాల్ని ఆబగా చదవసాగేడు. నిమిషాలు దొర్లిపోతున్నాయి. బెడ్‌రూమ్ సీనులోని హీరోయిన్‌లో అతనికి హారతే కనిపిస్తోంది.

లోపలికి వచ్చిన బంట్రోతు రాక అతన్ని డిస్టర్బ్ చేసింది. అసంకల్పితంగా పత్రికను మూసేసి, విసుగ్గా చూశాడతను. బంట్రోతు కొరియర్ సర్వీస్‌లో వచ్చిన నాలుగు ఉత్తరాల్ని అతని ముందు పెట్టి వెళ్లిపోయాడు. ఎప్పుడో ఆరిపోయిన సిగరెట్‌ని యాష్‌ట్రేలో పడేసి, ఉత్తరాల్ని అందుకుని ఫ్రమ్ ఎడ్రస్‌లు చూశాడతను. మూడు ఉత్తరాల్ని నిర్లక్ష్యంగా టేబుల్ మీదికి పడేశాడు. నాలుగోది అలా పడవేయలేకపోయాడు. అది రచయిత్రి సమతాదేవిది.

ఊపిరి బిగబట్టి ఏక బిగిని చదివిన రవిచంద్ర చేతులు వశం తప్పి వణకడం ప్రారంభించాయి. అప్రయత్నంగా అతను పళ్లు కొరుక్కున్నాడు. అసంకల్పితంగా అతను ఆ ఉత్తరాన్ని బల్లమీదికి విసిరాడు.

సహజ దట్ ప్యూరిటన్ బిచ్! అటువైపు నుంచి నరుక్కొచ్చింది. డబ్బు పారేస్తే ఒకరు కాకపోతే మరొకరు తన పత్రికకి రాస్తారు! రవిచంద్ర పెదాలు నవ్వుతో కదిలాయి. మరుక్షణం అతని నవ్వుని ఏదో అదృశ్యహస్తం తుడిచేసింది. దీనికి కారణం ఆ సహజ! పళ్లు కొరుక్కుంటూ అతను రచయిత్రి సమతాదేవి రాసిన ఉత్తరాన్ని అందుకున్నాడు.

ఉత్తరాన్ని చదువుతున్న అతని మొహంమీద చెమట బిందువులు పూసల్లా ప్రత్యక్షమవుతున్నాయి. అవమానం, ఉక్రోషం అతని లోపల బద్దలవుతున్నాయి. సమతాదేవి ఉత్తరాన్నీ ఆమె జత చేసిన సహజ ఉత్తరాన్నీ చదవడం ముగించి, విసురుగా విసిరేశాడతను.

సమతాదేవి తను చేసిన పొరపాటుని తెలుసుకుందిట. అశ్లీలానికి పెద్దపీట వేస్తున్న మహతిలో సాహితీ వ్యాసాలు రాయడం క్షమించరానిదని ఆవిడకి ఇప్పుడు అర్థమైందట! దశాబ్దాలుగా తను కలలుకన్న పత్రిక మహతిలో తనకి దర్శన మిచ్చిందన్న తన స్టేట్‌మెంట్ అనాలోచిత చర్యట! వ్యాస పరంపరనీ స్టేట్‌మెంట్‌నీ ఉపసంహరించుకుంటోందట! అశ్లీలాన్ని అచ్చువేయడం ఆపి, ఆడదాన్ని గౌరవించాలట!




రవిచంద్ర ఎగతాళిగా నవ్వుకున్నాడు.

ఈవిడగారి సాహితీ స్రవంతి ఎండిపోతే తన పత్రికకి వచ్చే నష్టం ఏమీలేదు! ఆ మాటకొస్తే పాఠకలోకానికీ, లోకానికీ కూడా నష్టంలేదు!

టెలిఫోన్ మోత అతన్ని ఉలిక్కిపడేలా చేసింది. రిసీవర్ అందుకుని "యస్?" అన్నాడతను.

"రవిచంద్రగారేనా?"

"ఆc" అన్నాడతను అవతలి స్త్రీ కంఠాన్ని పోల్చుకోడానికి ప్రయత్నిస్తూ.

"సమతాదేవినుండి శుభలేఖ అందిందా?"

"ఎవరు? ఓహ్... నువ్వా!" రవిచంద్ర సహజ కంఠాన్ని పోల్చుకోకపోయినా ఆమే అని గ్రహించగలిగాడు.

"నేనే! కనిపెట్టేశావే!" సహజ నవ్వుతూ అంది.

"డోంట్‌లాఫ్! ఇల్లు అలగ్గానే పండగ అయిపోయిందనుకోవద్దు! నీ సంగతి నేను చూస్తాను! ఇట్స్ ప్రామిస్!"

కసిగా పళ్లు కొరుకుతూ రిసీవర్ని పడేసి, మళ్లీ పైకెత్తాడు. సమతాదేవి సాహిత్యం దంపుడుని ఆపమని అర్జెంటుగా తన సిబ్బందికి చెప్పాలి! రవిచంద్ర అయిష్టంగా తన పత్రిక ఆఫీసు నంబరు డయల్ చేయసాగాడు...

★ ★ ★

ఉత్తరాన్ని చదవటం పూర్తి చేసిన పరిమళ, భానుమతీ సహజ వైపు అబ్బురంగా చూస్తూ ఒకేసారి పైకిలేచారు. చెరోవైపునుండీ ఒకేసారి ఇద్దరూ ఆమెని కౌగిలించుకున్నారు. నాలుగు పెదవులు సహజ రెండు బుగ్గలమీదా ఒకేసారి ముద్దు పెట్టాయి.

"కంగ్రాట్స్!" ఇద్దరూ ఒకేసారి అన్నారు.

"థాంక్స్!" సహజ నవ్వుతూ అంది.

"కాలక్షేపానికి పత్రికలు చదవడమేగానీ, నేను ఒక్కసారి కూడా నీలాగా, సహజంగా ఆలోచించలేదు సుమా!" పరిమళ మెప్పుగా అంది.

"నేను కూడా!" భానుమతి వంతపాడింది. "సహజా, ఒక సాహిత్య అకాడెమీ పురస్కారం సంపాదించిన రచయిత్రిని ఒకే ఒక ఉత్తరంతో ఆకట్టుకుని ఆమెచేత చారిత్రకమైన నిర్ణయాలు చేయించడం నిజంగా గ్రేట్! బూతు సాహిత్యం ఆడదాన్ని ఎంత చవకబారుగా తయారుచేస్తోందో ఇప్పుడే అర్థమైంది నాకు!"

"అది సరేనోయ్! ఏవిధమైన వార్నింగూ లేకుండా పత్రికా ప్రపంచంమీదికి,, లిటరేచర్ మీదికి ఉన్నట్టుండి దండయాత్ర ప్రారంభించావేం?" పరిమళ ప్రశ్నించింది.

"మహతి పత్రిక, మహిళా యూనివర్సిటీ కాంపస్‌లో కాలి బూడిదైన క్షణంలో నాలో ఈ దండయాత్ర ఆలోచన వచ్చింది!" సహజ వివరించింది. జాతికి సంస్కృతి ప్రాణం. సాహిత్య కళారంగాలు సంస్కృతికి రూపాన్నీ, ఆకారాన్నీ అందించే దర్పణాలు. స్త్రీని చీకటి గదుల్లో అవమానించి, వాడుకునే రోజులు మారిపోయాయి. కళ్లు మిరుమిట్లు గొలిపే వెల్తుర్లో, పబ్లిగ్గా స్త్రీని వాడుకునే విశృంఖల యుగం ప్రారంభమైపోయింది. స్త్రీని సమాజం గౌరవించాలంటే, స్త్రీ తనని సమాజానికి గౌరవప్రదంగా చూపించాలి. సాహిత్యకళారంగాలు కూడా స్త్రీని గౌరవప్రదంగా ఆవిష్కరించాలి! సమకాలీన సమాజాన్ని కళలు వాస్తవరూపంలో ఆవిష్కరించాలి. ఆ బాధ్యత ఆ రంగాలకి స్వతసిద్ధంగా సంక్రమించింది. అలాంటి శక్తివంతమైన ఆ రంగాలలో స్వార్థపరత్వం చోటుచేసుకున్న కారణంగా ఆ రంగాలు స్త్రీని కేవలం విలాసవస్తువుగా కాకుండా చవకబారు విలాసవస్తువుగా, ఒక యూస్డప్ శానిటరీ నేప్‌కిన్‌లా, ఒక యూస్డప్ కండోమ్‌లా చిత్రీకరించడం అవాంఛనీయం! ఎందుకంటే, వాస్తవాన్ని

ప్రతిబింబించే గురుతర బాధ్యత వున్న ఆ రంగాలు, ఇతర మోటివ్స్‌తో వక్రీకరణను అదేపనిగా చిత్రిస్తూవస్తే సమాజం ఆ వక్రీకరణనే వాస్తవంగా స్వీకరించుకుంటూ క్రమంగా తన అసలు స్వరూపాన్నీ, స్వభావాన్నీ మార్చుకుంటుంది! ఫలితంగా వక్రీకరణ వాస్తవం అయిపోతుంది!" సహజ ఆగి ఇద్దర్నీ నవ్వుతూ చూసింది.

"అద్భుతమైన విశ్లేషణ!" భానుమతి అంది.

"అందరూ ఈవిధంగా ఆలోచిస్తే ఎంత బాగుణ్ణు!" పరిమళ అంది.

"ఆలోచించేవాళ్లూ, ఆచరణలో పెట్టేవాళ్లూ ఎప్పుడూ కొద్దిగానే వుంటారు! మిగిలినవాళ్లు అనుసరిస్తే చాలు!" అంటూ భానుమతి సహజవైపు చూసింది, ఏదో గుర్తుకు తెచ్చుకున్నదానిలా.

"సహజా... నాకో విషయంలో సందేహం ఉంది. అది తీర్చుకోడానికే వచ్చాను''

"సందేహాలకీ, సమస్యలకీ ఎప్పుడూ సమాధానాలుండాలి. ఉంటాయి! షూర్!" సహజ నవ్వుతూ అంది.

"అదే... ఆ మదన్ గురించి... నువ్వు చెప్పిందంతా నిజమేనా?"

"ఏం?"

"అప్పట్లో నిజమేనేమో అనిపించినా, ఆలోచిస్తూంటే ఎందుకో అనుమానం వస్తోంది... అతన్తో నువ్వు లాడ్జికి వెళ్లడం... అతన్ని రెచ్చగొట్టడం... వగైరా వగైరా పద బంధం గళ్లలో ఇమడని పదాల్లా అవుపిస్తున్నాయి''

"అతన్ని చేసుకోవడంలేదుగా నువ్వు?" సహజ నవ్వుతూ అడిగింది.

"ఈ జన్మకి... లేనట్టేగా!"

"గుడ్! అయితే విను. అతన్ని లాడ్జిగదికి లాక్కెళ్లి నేను సెడ్యూస్ చేయ ప్రయత్నించడం అబద్ధమైతే, అతను మగాడు కాదు అనడం కూడా అబద్ధమే!"

"అంటే... అంటే...!"

"మైడియర్ బ్రైడ్! వాడు నా పరువు తీయడానికీ, నాకు పెళ్లి సంబంధాలు రాకుండా చేయడానికీ నామీద ఆ బూతుకబుర్లు ప్రచారం చేసి పగ తీర్చుకున్నాడు. అతను సప్లై చేసిన లాడ్జిగది ఐడియానే చక్కగా ఉపయోగించుకుని, అతనిచ్చిన లైన్లోనే కథ అల్లి అతన్ని నపుంసకుణ్ని చేశాను! అంతే!"

"గుడ్‌గాడ్!" భానుమతి అరిచింది. "అతనికి నీమీద పగ దేనికి?"

"కట్నం ఇచ్చి భర్తను కొనుక్కోవడం వ్యభిచారం అన్నాను. కట్నం తీసుకోవడం మగతనానికి మచ్చ అన్నాను. అతను హర్ట య్యాడు. నన్ను హర్ట్ చేయాలనుకున్నాడు. కట్నం లేకుండా చేసుకోను పొమ్మన్నాడు! పాఠం నేర్పుతానని శపథం చేశాడు!"

"థాంక్స్ సహజా!"

"ఎందుకూ? పెళ్లి చెడగొట్టినందుకా?"

"నో! కట్నం ఇచ్చి కళ్యాణం చేసుకోవడం కళంకం అని చెప్పినందుకు!"

"భానూ...!"

"యస్ టీచర్! ఈ ఎపిసోడ్‌లో నేనూ ఒక పాఠం నేర్చుకున్నాను. కట్నం కావాలనే పెళ్లికొడుకుని కన్నెత్తి చూడను!" భానుమతి ఉద్రేకంతో అంది.

సహజ కదిలిపోతూ భానుమతిని కుర్చీలోంచి లేవనెత్తి కౌగిలించుకుంది.

"నన్నూ కౌగిలించుకోవే! నేను కూడా అంతే!" అంటూ నవ్వుతూ పరిమళ తనే ఇద్దర్నీ కౌగిలించుకుంది.

హాయిగా నవ్వుతున్న ఆ ముగ్గురి నవ్వులూ ఒక సందేశాత్మక గీతంలా ధ్వనించాయి...

★ ★ ★

సహజ టెక్స్‌టైల్స్ షోరూంలోంచి ఇవతలికి వచ్చింది. ఆటో ఎక్కి తన ఇంటి అడ్రసు




చెప్పి వెళ్లమంది. ఆటో కదిలింది. రోడ్డు మలుపు తిరిగిన ఆటో తటాలున ఆగింది. సన్నగా వున్న ఆ వీధిలో ఆటోలూ, సైకిల్ రిక్షాలూ ఆగివున్నాయి. ఎదురుగా ఏదో కల కలం. ఏదో ఊరేగింపు వస్తున్నట్టుంది. బాజా భజంత్రీల చప్పుళ్లు లేవు. శవం అంతిమ ప్రయాణం చేస్తోందా? ఆలోచిస్తూ సహజ ఆటోలోంచి తల ఇవతలికి పెట్టి చూసింది. ఏదో ఊరేగింపే! అయితే ఊరేగింపు సాగుతు న్న ఆ వాతావరణంలో ఉత్సాహంలేదు, ఏడుపులూ లేవు. అదోరకం స్తబ్దత... కొత్తగా వాతావరణంలో వ్యాపించినట్టనిపిస్తోంది.

రోడ్డుకి ఇరువైపులా ఆగిన జనం శిలాప్రతి మల్లా నిలబడ్డారు. అందరి తలలూ ఊరే గింపు వస్తున్నవైపే తిరిగివున్నాయి. 'ఎవరా అమ్మాయి? నగ్నపూజకా? ఇన్‌సైడిబుల్!' ఎవరో అంటున్న మాటలు సహజకి స్పష్టంగా వినిపించాయి. అమ్మాయా? నగ్నంగానా? సహజ అసంకల్పితంగా ఆటోలోంచి దిగింది. ఆటోని దాటి కొంచెం ముందుకి వెళ్లి తొంగి చూసింది. సహజ గుండె ఒక్కసారి కొట్టు కోడం మానేసింది. తను చూస్తోంది యథార్ధ మా? కలా? సహజ అప్రయత్నంగా కళ్లు మూసి తెరిచి చూసింది. ఎదురుగా ఆ దృ శ్యం మాయం కాలేదు...

ఎదురుగా... ఎదురుగా ఇరవైఏళ్ల యువతి... స్వప్నచారిణిలా నడుస్తోంది నగ్నంగా... ఊహుఁ... నడిపించబడుతోంది! బలిష్టంగా వున్న ఇద్దరు మగాళ్లు ఆమె రెండు చేతుల్నీ ఇరువైపులకీ లాగిపట్టి ఆమెని బల వంతంగా నడిపిస్తున్నారు. దుడ్డుకర్రలు పట్టు కున్న ఇద్దరు వ్యక్తులు ముందు నడుస్తున్నా రు. ఎవరో వెనుకనుంచి ఆమెను మొరటుగా ముందుకు తోశారు. ముందుకి తూలిన ఆమె శరీరం విల్లులా వంగింది. ఇరువైపులకీ లాగ బడుతున్న ఆమె చేతులు ఆమె శరీరాన్ని... నగ్న శరీరాన్ని వెనక్కి లాగాయి.

ఊరేగింపు దగ్గరగా వచ్చింది. దుడ్డుకర్ర లు పట్టుకున్న గూండాలు జనాన్ని బెదిరింపు గా చూస్తున్నారు. సహజ చూపులు ఆ యువ తిమీద తాపడం అయిపోయాయి. ఆమె జుట్టు చిందరవందరగా భుజాలవెనక వేళ్లాడు తోంది. చెక్కిళ్లమీద కన్నీళ్లు నిస్సహాయంగా జారుతున్నాయి. ఆమె... వొంటిమీద నూలు పోగు లేని ఆమె ఆకులన్నీ దూసిపారేసిన తమలపాకు తీగలావుంది. తనని ఆ స్థితిలో చూస్తున్న సిగ్గుమాలిన లోకాన్ని చూడ్డానికి ఇష్టంలేనట్టు ఆమె కళ్లు మూతలు పడివు న్నాయి.

సహజ నరాల్లో రక్తం ఉరకలు పెడు తోంది. ఎందుకో ఆమె చర్మం బిగుసుకుపో తోంది. బిగుసుకుపోతున్న చర్మంమీద ఎన్నో గొంగళిపురుగులు పాకుతున్నట్టనిపిస్తోందా మెకి.

ఎందుకీ ఘోరం జరుగుతోంది? ఎందుకు?

ఆ దారుణాన్ని ఎవ్వరూ ఆపే ప్రయత్నం చేయడంలేదు! ఎందుకు?

ఎందుకు? ఎందుకు? ఎందుకు?

సహజ నరాల్లో ప్రవహిస్తున్న రక్తం తె ర్లడం ప్రారంభించింది. ఏదో విశేషచలనం ఆమె సర్వస్వాన్నీ కుదిపేస్తోంది. తనకి తెలీ కుండానే సహజ ఊరేగింపుకి ఎదురుగా పరు గెడుతోంది, ఆమె కళ్లకి నగ్నంగా ఊరేగించబ డుతున్న యువతి తప్ప మరేమీ కనిపించ డంలేదు. ఆమె చేతిలో వున్న క్యారీబాగ్, ఖాళీగా గాలిలో ఎగురుతూ నేలమీదికి వాలి పోయింది. పరుగెడుతూ, అసంకల్పితంగా ఆమె విప్పదీసిన దళసరికాగితంకింద పడింది. షోరూమ్‌లో కొన్న చీర ఆమె చేతిలో వుంది.

గాలిలో దూసుకెళ్తున్న సహజ తనని అడ్డుకోడానికి ప్రయత్నించిన ఒక దుడ్డుకర్రను ఊహించనివిధంగా తోసేస్తూ ఆ యువతిని సమీపించింది. సహజ చేతుల్లోని చీర మడత లు విడిపోయి పొడుగ్గా తయారైంది. రెప్పపా టులో సహజ ఆమె ముందుకు చేరింది. కొత్త

చీరని ఆమె నగ్నశరీరానికి అడ్డంగా తెరలా పట్టుతూ, ఆమె భుజాలమీద రెండు చేతుల్నీ వేసింది.

ఆ యువతి కళ్లు తటాలున విచ్చుకున్నాయి. రెప్పపాటు కాలవ్యవధిలో ఆ ఎర్రటి కళ్లలో ప్రత్యక్షమైన ధైర్యాన్నీ, ఆశనూ, ఆవేదననూ వర్ణించే శక్తి తనకి లేదనిపించింది సహజకు.

తటాలున సహజ కళ్లముందు ఎన్నో మెరుపులు మెరిశాయి. తల వెనుకభాగం పగిలినట్టనిపించింది. సహజ ఆ యువతి పాదాల ముందు నేలమీద కూలిపోయింది. అంతసేపూ ఆ యువతికి మానసంరక్షణ చేసిన కొత్తచీర నేలమీద కుప్పకూలిపోయింది. ఉరేగింపు నిరాటంకంగా సాగిపోయింది...

★ ★ ★

సహజ కళ్లు మెల్లిగా తెరుచుకున్నాయి. ఎక్కడో, ఏవో అగాధాల్లోకి మునిగిపోయి, మరెక్కడో పైకి తేలివచ్చినట్టనిపిస్తోందామెకి. రెప్పలు టపటపలాడించి, తన మొహంలోకి ఆదుర్దాగా చూస్తున్న తల్లిదండ్రుల మొహంలోకి చూసింది.

"అమ్మా... నేను... ఎక్కడున్నాను?"

"మనింట్లోనే వున్నావు తల్లీ... రోడ్లో స్పృహతప్పి పడివుంటే చూసి, ఇదిగో ఈ అబ్బాయి నిన్ను ఇంటికి తీసుకువచ్చాడు!" కుడివైపు చూపిస్తూ అంది అమృతమ్మ.

సహజ తల మెల్లిగా అటువైపు తిరిగింది. మంచందగ్గరగా నిలబడ్డ యువకుడు చిరునవ్వుతో చూస్తున్నాడు.

సహజ కళ్లు చిట్లించింది. అతన్ని ఎక్కడో చూసినట్టుంది. ఎక్కడ?

"హలో!" అతను నవ్వుతూ పలకరించాడు. సహజ ప్రశ్నార్థకంగా చూస్తూనేవుంది.

"మనం ఒకసారి కల్సుకున్నాం. మహిళా యూనివర్సిటీ క్యాంపస్‌లో... మరిచిపోయారా?" అతను నవ్వుతూ ప్రశ్నించాడు.

సహజ కళ్లల్లోని ప్రశ్నార్థకం కరిగిపోయింది. "మిస్టర్... ఉత్తమ్ కుమార్... బాగున్నారా?"

"నేను బాగానే వున్నా, హేల్ అండ్ హెల్తీ! మీకెలావుందో చెప్పండి?"

"తల నొప్పిగా... వుంది... నిద్రమత్తు"

"డాక్టర్ నాలుగు సూచర్స్ వేశాడు. మీది లక్కీహెడ్ అన్నాడు!" ఉత్తమ్ కుమార్ నవ్వుతూ అన్నాడు.

"ఏం జరిగింది?" సహజ తల వెనుకభాగం తడుముకుంటూ అడిగింది. ఆమె కంఠం జీరగా ధ్వనించింది.

"నాయనా! అడగడం మరిచిపోయాను... మా ఇల్లు నీకెలా తెలుసు?" అమృతమ్మ ప్రశ్నించింది.

"ఆమధ్య మహిళా యూనివర్సిటీదగ్గర మీ అమ్మాయిగారూ, నేనూ కలుసుకున్నాం. ఆమె ఆటోలో వచ్చేశారు. స్కూటర్‌మీద ఆటోవెంబడే వచ్చాను. నేనూ ఇటువైపే వెళ్తున్నాలెండి. అప్పుడు చూశాను మీ ఇల్లు!" ఉత్తమ్‌కుమార్ నవ్వాడు.

"నువ్వెళ్లి అబ్బాయికి కాఫీ తీసుకురా. ఈలోగా నేను మందులు తీసుకొస్తాను" శ్రీమంతరావు భార్యను పురమాయించాడు.

"ఇంక నేను వెళ్తాను..." అంటూ సహజ వైపు చూశాడు.

"థాంక్యూ వెరీమచ్! మీరు చేసిన మేలు మరిచిపోలేను!" సహజ నవ్వుతూ అంది. "నాన్నా నేనూ వెళ్ళి పోలీసురిపోర్ట్ ఇస్తాం"

"యస్. మీరాపని చేయండి. నేనుకూడా స్టేట్‌మెంట్ ఇస్తాను. ఈలోగా జరిగిన నాటకం గురించి వివరాలూ, ఆ విక్టిమ్ వివరాలూ, విలన్లవివరాలు దొరుకుతాయేమో నా పద్ధతుల్లో ప్రయత్నిస్తాను"

సహజ కృతజ్ఞతాపూర్వకంగా చూసింది, "వివరాలు తెలీగానే"

"మీకు వినిపిస్తాను" ఉత్తమ్‌కుమార్ పూర్తి చేశాడు.




"ఆమె ఎవరో కనుక్కోండి... నేను... ఆమెని కల్సుకోవాలి'' సహజ అంది.

"నువ్వు ఎవ్వర్నీ కలుసుకోవు; ఎక్కడికీ వెళ్ళవు!" అప్పుడే గదిలోకి వస్తూ అంది అమృతమ్మ.

సహజ తల్లివైపు చిరునవ్వుతో చూసింది. 'పిచ్చి అమ్మ!' అంటూ అటువైపు తిరిగి పడుకుంది.

అర్ధంకానట్టు కూతురివైపే చూస్తున్న వాళ్ళి-ద్దర్నీ వదిలేసి, ఉత్తమ్‌కుమార్ మెల్లిగా అవతలికి నడిచాడు.

★ ★ ★

మరునాడు, దినపత్రికల్లో పడిన 'నగ్నప్రదర్శన' వార్త నగరంలో, రాష్ట్రమంతటా పెద్ద సంచలనాన్ని సృష్టించింది. రాక్షసంగా, నగ్నంగా ఊరేగించబడిన యువతి కాత్యాయని ఫోటో, ఆ దుర్మార్గాన్ని ప్రతిఘటించిన 'విద్యావంతురాలైన యువతి' సహజ ఫోటో పత్రికల్లో అచ్చయ్యాయి. ఇద్దరి ఇంటర్వ్యూలనీ పత్రిక లోపలి పేజీల్లో ప్రత్యేకంగా ముద్రించింది ఒక పత్రిక. 'ఇన్‌సెట్'లో తలకి దెబ్బతగిలి స్పృహలేకుండా రోడ్డుమీద పడున్న సహజ ఫోటో అచ్చయ్యింది.

ఇలాంటి వార్తలు వచ్చినప్పుడు మామూలుగా జరిగే 'గందరగోళాలు' అన్నీ చకచకా జరిగిపోయాయి. ప్రతిపక్షాల నిరసనలు, మహిళాసంఘాల ఊరేగింపులూ, వగైరా... వగైరా...

పత్రిక కథనం ప్రకారం 'సభ్యమానవులు తలదించుకునే విధంగా' సాగిన ఆ నగ్నప్రదర్శనకి కారణం సంపూర్ణ మద్యనిషేధ ఉద్యమం. దొంగమద్యాన్ని దొంగచాటుగా విక్రయించినందుకు ఓ మాజీ మద్యంషాపు యజమాని ఇంటిమీద సంపూర్ణ మద్యనిషేధ మహిళా ఉద్యమకారులు ధర్నా చేశారు. ఆ ఉద్యమంలో, ముఖ్యంగా ధర్నాలో కాత్యాయని ప్రముఖ పాత్ర వహించింది. ఇంటి పైకప్పునుంచి ఎవరో విసిరిన ఖాళీ బాటిల్ని ఆమె షాపు యజమాని 'విరూపాక్షం' ఇంటి మీదికే విసిరింది. పైనుండి మరికొన్ని సీసాలు విసిరారు. ఆందోళనకారుల్లో కొంతమందికి గాయాలయ్యాయి. ఆందోళనకారులు పోలీసుస్టేషన్‌ని చుట్టుముట్టి మద్యం షాపు యజమాని అరెస్ట్‌ను డిమాండ్ చేశారు. పరిస్థితి విషమించడంతో పోలీసులు విరూపాక్షంని ఇలా అరెస్టు చేసి, అలా వదిలిపెట్టేశారు. ఆ అరెస్టు అతన్ని ఘోరంగా అవమానించింది. ఆందోళనకారులకి 'తగు' విధంగా బుద్ధిచెప్పి, వాళ్ళని లిమిట్స్‌లో పెట్టే ఉద్దేశంతో, కాత్యాయనిమీద పగతీర్చుకునేందుకు అతను కాత్యాయనిని వివస్త్రనుచేసి, ఊరేగించే పథకం అమలుజరిపాడు.

తనకి జరిగిన దారుణావమానానికి దోహదంచేసిన పైవివాదాల్ని కాత్యాయని తన ఇంటర్వ్యూలో వెల్లడించింది. ఊరేగింపు జరిగిన వైనాన్నీ తను కాత్యాయని మానం కాపాడ్డానికి చేసిన ప్రయత్నాన్నీ సహజ తన ఇంటరువ్యూలో వివరించింది.

పోలీసు యంత్రాంగం వైఫల్యాన్ని పత్రిక నానా రకాలుగా ఖండించింది. హత్యకు గురైన యువకుడి శవాన్ని వెతికి, అతన్ని గుర్తించి, అపరాధుల్ని దండించడంలో పోలీసుశాఖ విఫలమైందంటూ పత్రిక విమర్శించింది.

కుక్కను కొడితే వెంటనే వచ్చే రెస్పాన్సు వేగంతో 'వైన్‌షాపు యజమాని నుండీ రెస్పాన్స్ వచ్చింది! స్టార్ హోటల్లో అతను ప్రత్యేకంగా ప్రెస్‌మీట్ ఏర్పాటుచేశాడు. గుచ్చి,గుచ్చి విలేఖర్లు రువ్విన ప్రశ్నలన్నింటికీ, చెదరని చిరునవ్వుతో ఆచి, తూచి నిర్భయంగా సమాధానాలు చెప్పాడు.

అరగంట తరువాత పోలీస్ ఇన్స్‌పెక్టర్ పీతాంబరం, తన ఆఫీసులో అఫీషియల్ ప్రెస్‌మీట్ ఏర్పాటుచేశాడు.

వార్తాపత్రికలో నగ్నప్రదర్శన వార్త చదవగానే తను యాక్టివేట్ అయ్యాడు. కాత్యా

యని ఇచ్చిన ఫిర్యాదుని స్వీకరించాడు. సహజ అనే యువతి ఇచ్చిన ఫిర్యాదునీ స్వీకరించాడు. ఉత్తమ్‌కుమార్ అనే జర్నలిస్టు స్టేట్‌మెంట్‌నీ స్వీకరించాడు.

నగ్నప్రదర్శన సాగినట్టు చెప్పబడిన వీధి లోని గడప గడపకీ తన సిబ్బందితో విజిట్ చేశాడు. ఒక్క వ్యక్తి కూడా తమ వీధిలో నగ్నప్రదర్శన జరిగింది అన్న పాపాన పోలేదు! నాట్ ఈవెన్ ఎ సింగిల్ సోల్!

హత్యా? అది కూడా కల్పితమే. శవమా? ఎవరిది? ఎక్కడుంది?

విరూపాక్షం ప్రెస్‌మీట్ విశేషాలూ, పోలీసాఫీసర్ పీతాంబరం ప్రెస్‌మీట్‌లో ఇచ్చిన అఫీషియల్ స్టేట్‌మెంటూ మరుసటిరోజు పేపర్లలో, ఫోటోలతోసహా అచ్చయ్యాయి.

పోలీసులు విరూపాక్షంతో కుమ్మక్కై జరిగిందాన్ని జరగలేదన్నట్టు చిత్రీకరిస్తున్నారంటూ వివిధ మహిళా సంఘాలు వారంరోజులపాటు ఉధృతంగా నిరసన, ఉద్యమాలు నడిపాయి. వార్తాపత్రికలు ఆ సమస్యకు వారం రోజులపాటు ప్రాణం పోస్తూ వచ్చాయి. నడివీధిలో అబల నగ్నప్రదర్శన విషయం నిన్నటి న్యూస్‌పేపర్లో పాతబడి, మరుగున పడిపోయింది.

భారతదేశంలో అతిపెద్ద చీపుర్లున్నాయి. 'చెత్తని' సమర్థవంతంగా చిమ్మడంలో వాటికి ప్రపంచవ్యాప్తంగా గొప్ప పేరుంది.

భారతదేశంలో అతిపెద్ద, దళసరి తివాచీలున్నాయి. ఎంత 'చెత్త'నైనా తమకింద ఇముడ్చుకుని దాచగలిగిన శక్తి ఆ తివాచీలకి వుంది. ఈ విషయంలో వాటికి కూడా ప్రపంచవ్యాప్తంగా గొప్ప పేరుంది.

ప్రపంచ ప్రఖ్యాతిగాంచిన 'భారతదేశం చీపుర్లూ', 'భారతదేశం తివాచీలూ' విషమ సమస్యలొచ్చినప్పుడు చక్కని అవగాహనతో, ఐకమత్యంతో పనిచేస్తాయి. సమస్యల చెత్తని చీపుర్లు శుభ్రంగా చిమ్మి, జాగర్తగా తివాచీల కిందికి తోసివేస్తాయి. తివాచీలు బహుభద్రంగా ఆ చెత్తని తమకింద దాచుకుంటాయి.

ప్రస్తుతం- కాత్యాయని అనబడే ఒక మహిళ వస్త్రాపహరణం, ఊరేగింపు సమస్యని, సాక్ష్యం చెప్తానంటూ సహజ అనే మరొక మహిళ లేవనెత్తిన సమస్యని, వార్తాపత్రికలు లేవనెత్తిన సమస్యని భారదేశపు చీపుర్లూ భారతదేశపు తివాచీలూ మాయంచేసేశాయి!

★ ★ ★

కాత్యాయని ఊరేగింపు జరిగిన రోజు నుండీ జరిగిన సంఘటనల్నీ, వార్తాపత్రికల కథనాల్నీ సింహావలోకనం చేసుకుంటూ కూచున్న సహజ అసంకల్పితంగా నిట్టూర్చింది.

ఓటమి... ఒకవిధంగా తను అనుభవిస్తున్న ఓటమి చిన్నది. కాత్యాయని అనుభవిస్తున్న ఓటమి... చాలా చాలా పెద్దది! ఆరోజు... ఊరేగింపు జరిగిన తరువాత... ఉత్తమకుమార్‌తో కలిసి తను కాత్యాయనిని ఆమె ఇంట్లో కలుసుకున్న రోజు... ఆమెకి గుర్తొచ్చింది.

మద్యపాన వ్యతిరేక ఉద్యమంలో ప్రముఖ పాత్ర వహించి, ఎంతోమంది స్త్రీలకు ప్రేరణ అందించిన కాత్యాయని తనని 'సబల'గా నిరూపించుకున్న కాత్యాయని మామూలు అబలగా మారిపోయింది! కాత్యాయనే ఆ విషయాన్ని పరోక్షంగా వెల్లడిచేసింది. పురుష దురహంకారం, రాక్షసబలం వలువలతోబాటు తన రెండో చర్మంలా వున్న ధైర్యసాహసాలనూ, తెగింపునూ, సాహసాన్నీ వొలిచి పారేశాయందామె! తనని వివస్త్రగా చూసిన లోకం ముందుకు రావడానికీ, మళ్ళీ ఆ లోకం కళ్ళకి కనిపించడానికీ తనకి ధైర్యం చాలడంలేదంది. పెంకుటింటి చీకటి మూలలో కూచుని, కుమిలిపోతున్న కాత్యాయని 'తనని ఒకసారి నగ్నంగా చూసిన లోకం




ఎప్పుడూ అలాగే, అదేస్థితిలో చూసేప్రయత్నం చేస్తుంది! లోకం కళ్ళు తను ధరించిన దుస్తుల్ని తొలగించి, తనని అనాచ్ఛాదితంగా చూసే ప్రయత్నం చేస్తాయి!' అంది.

ఆమె మాటల్లో ఎంత నిజం ఉంది! ఆ మాటలో ఎన్ని మనస్తత్వశాస్త్రాల సంపుటాలున్నాయి! ఔను! తను చూసిన స్త్రీ నగ్నశరీరాన్ని మగవాడు అంత తొందరగా మరిచిపోడు! తరువాత ఎప్పుడైనా, ఎక్కడైనా ఆమె కనిపిస్తే తన అదృశ్యహస్తాలతో, కళ్ళతో ఆమె ధరించిన దుస్తుల్ని చాకచక్యంగా తొలగించి- ఒకనాడు తను గుడ్లు పెకలించుకుని చూసిన ఆమె సంపూర్ణ నగ్నత్వాన్ని మనోనేత్రంతో మళ్ళా చూస్తాడు! ఆ విధంగా ఆ స్త్రీని చిన్నచూపు చూస్తాడు!

'సిగ్గుపడాల్సింది నువ్వుకాదు, నీ నగ్నత్వాన్ని సిగ్గులేకుండా చూసిన లోకం!' అంది తను కాత్యాయనితో.

ఆమెకి జరిగిన అన్యాయాన్ని కళ్ళారాచూసిన ప్రత్యక్షసాక్షీ, ఆ రాక్షసుల్ని అడ్డుకోబోయి తల పగలగొట్టించుకున్న వ్యక్తీ- అయిన తను ఉందనీ, ఆమెని అవమానించిన వాళ్ళకి శిక్షపడేలా చూస్తుందనీ కాత్యాయనికి ఆరోజు తను ధైర్యం చెప్పింది. తన ఓదార్పుతో, కాత్యాయని సజలనేత్రాలలో వెలిగిన ఆశని తను మరిచిపోలేదు!

తను శపథం చేసిన విధంగా ప్రయత్నించింది. ఓడిపోయింది! కాత్యాయని రెండోసారి ఓడిపోయింది. ఆమెచేత తను ఇప్పించిన కంప్లెయింట్ అబద్ధాలపుట్ట అని రుజువుచేయబడింది. తను చూసిందీ, చేసిందీ కల్పితం అని రుజువు చేయబడింది!

ఫలితంగా 'కట్టుకథ' అయిపోయిన కాత్యాయని నగ్నప్రదర్శన కేసు భూస్థాపితం అయిపోయింది! తను ఓడిపోయింది! కాత్యాయని ఓడిపోయింది! ఈ ఓటమిని తను అంగీకరించాలా?

ఎందుకు? ఎందుకు అంగీకరించాలి?

ఆ ఓటమిని గెలుపుగా మార్చడానికి ఆనాడే తను కంకణం కట్టుకుంది!

ఆ ఓటమిని గెలుపుగా ఎట్లా మార్చాలో తనకి తెలుసు!

సహజ మంచంమీంచి లేచి, టేబుల్ దగ్గరకెళ్ళింది. సొరుగు ఇవతలికి లాగింది. అందులో వున్న కవర్ని తీసి హ్యాండ్‌బ్యాగ్‌లో పెట్టుకుంది.

అద్దం ముందు నిలబడి మొహానికి పౌడర్ అద్దుకుంది. ప్రతిబింబం ఆమెవైపు మామూలుగా చిరునవ్వు నవ్వుతోంది. సహజ అద్దం ముందునుంచి వెనక్కి తిరిగింది. తను వెళ్ళాలి. ఓటమిని గెలుపుగా మార్చే కార్యక్రమం ప్రారంభించాలి. ఓటమిని గెలుపుగా మార్చే సాధనం తనదగ్గరుంది!

సహజ గుమ్మంవైపు నడిచింది...

★ ★ ★

ఉమెన్స్ కాలేజీ ప్రిన్సిపాల్ తల పంకిస్తూ తన మేధావి చూపుల్ని సహజ మొహంమీదికి ఫోకస్ చేసింది. "అదంతే! ఒక్క 'నిజం' మాత్రమే నిన్ను విజయానికి దగ్గరగా చేర్చదు! దేర్ ఆర్ సో మెనీ ఫ్యాక్టర్స్! నా సంగతి తీసుకో! నేను పూర్తిగా నిజమే చెప్పాను! అయినా సీనియారిటీ విషయంలో నా కేసు గెలవలేదు! ఇది ఈనాటి వాస్తవం"

"కాని, మనం దాన్నలా నేటి వాస్తవంగా చలామణీ కానివ్వరాదు, మేడం!" సహజ నవ్వుతూ అంది.

ప్రిన్సిపాల్ 'మేధావి నవ్వు' నవ్వింది. "మైడియర్ చెయిల్డ్! ఈ ప్రపంచ గతిని నీవు మార్చలేవు. ఈ విషయం ఇహ మరచిపోవటం శ్రేయస్కరం దట్సాల్! ఒక ఆడదాన్ని నగ్నంగా వీధుల్లో తిప్పారు! ఇది మన పవిత్ర వేదభూమికే అవమానకరం. వందలాది మంది కళ్ళారా చూసి, తరవాత నోళ్ళు మూసుకుని, మూసిన తలుపులు వెనకదాక్కుంటే నువ్వు ధైర్యంగా ఎదురు తిరిగావు,

చూసిందాన్ని నోరుతెరిచి చెప్పావు! నీ బాధ్యత నువ్వు నెరవేర్చావు. ఇప్పుడిహ ఆ సంగతులన్నీ మరచిపోవడం మంచిది! ఆc! ఏం చేస్తున్నావ్? పెళ్ళెప్పుడు చేసుకుంటావ్?"

సమాధానం చెప్పే శ్రమ సహజకు తప్పిస్తూ హైహీల్స్ టకటక శబ్దంచేశాయి.

"గుడ్ మార్నింగ్ మేడమ్!"

"ఇందూ... రారా! ధిసీజ్ మిస్ సహజ! మై బ్రిలియంట్ ఓల్డ్‌స్టూడెంట్. నీకోసం వచ్చింది! సహజా నువ్వు కావాలన్న ఇందులేఖ!" ప్రిన్సిపాల్ పరిచయం చేసింది.

ఇందులేఖ సహజకి నమస్తే చెప్పింది. సహజ నమస్తే చెప్తూ లేచి నిలబడింది.

ఇందులేఖ సహజ మొహంలోకే రెప్పవేయకుండా చూస్తోంది. "మిమ్మల్ని... ఎక్కడో... చూశాను..." అంది.

"నన్ను కాదేమో! నా ఫోటో చూసి వుండొచ్చు పేపర్లో!" సహజ నవ్వింది.

"యస్! పేపర్లోనే చూశాను! మీ పేరు బాగుందని అప్పుడే అనుకున్నాం!"

"థాంక్స్! ఇందూ... నీతో కొంచెం పనుండి వచ్చాను..."

"చెప్పండి".

"ఇక్కడకాదు... అలా బైటికి వెళ్దాం" అంది సహజ.

ఇందులేఖ ప్రిన్సిపాల్‌వైపు చూసింది.

"నా ఓల్డ్ స్టూడెంట్స్ ఏది అడిగినా నేను కాదనను! యూ కెన్ కాల్ ఇట్ ఏ డే!" ప్రిన్సిపాల్ నవ్వుతూ ఇందులేఖతో అంది.

"థాంక్స్ మేడమ్! వెళ్ళొస్తాం!" అంది సహజ.

"వెల్‌కమ్!"

సహజ ఇందులేఖ చేతిని పట్టుకుంది. ఇద్దరూ అవతలికి నడిచారు.

★ ★ ★

"మీరు చెప్పిందంతా, దాదాపు నేను పేపర్లో చదివాను. అయితే, అది ఎవరో చెప్తూంటే విన్నట్టు సాదాగా అనిపించింది. మీరు చెవులకి చెప్తూనే జరిగిందాన్ని కళ్ళకు కట్టారు! ఆ నేకెడ్ ప్రొసెషన్ని నిరసిస్తూ మేం కూడా ఒకరోజు కాలేజీ నుండి వాకౌట్ చేశాం" ఇందులేఖ నవ్వుతూ అంది.

సహజ అలాగా అన్నట్టు చూసింది నవ్వుతూ. ఇందులేఖ కళ్ళలోకి ఏదో ప్రశ్నార్థకం కొత్తగా వచ్చి చేరింది.

"అన్నట్టు... ఇదంతా నాకెందుకు చెప్పారు?"

"ఒక నిస్సహాయురాలైన ఆడపిల్లని గూండాలు వివస్త్రను చేసి, బలిపశువులాగా వీధుల్లో తిప్పారు! ధనంతో నోట్లతో ఆ దారుణాన్ని పూడ్చిపెట్టేశారు! వాళ్ళు శిక్షించబడాలి. అవునా?"

"అఫ్‌కోర్స్! ఆ నేరమే జరగలేదని తేల్చేశారుగా!" ఇందులేఖ నవ్వుతూ అంది.

"ఇందూ, ఆరోజు నా స్థానంలో, ఆ ఊరేగింపు సీన్లో నువ్వు ఉన్నావనుకో. లోకమంతా ఆ దారుణం జరగనేలేదు అంది అనుకో! అయినప్పటికీ- ఆ నేరం జరిగిందనే నువ్వు అనుకుంటావా? లోకం చెప్తున్నట్టు 'లేదనే' అనుకుంటావా?"

"... జరిగిందనే అనుకుంటాను, అంటాను"

"నేనూ అదే అంటున్నాను! ఆ నేరం నిజంగా జరిగింది! మన సాటి ఆడపిల్ల వివస్త్రగా వీధుల్లో చచ్చిపోయిన కుక్కలాగా ఈడ్చబడింది! ఆ ఘోరం చేసిన కిరాతకులు శిక్షించబడాలి! ఒక ఆడదాన్ని అంత హీనంగా అవమానించే రాక్షసులు తప్పించుకుపోలేదు అని లోకానికి తెలియాలి! వాళ్ళు శిక్షించబడాలంటే... నీ సహాయం కావాలి..."

ఇందులేఖ ఆశ్చర్యంగా చూసింది. "నా సహాయమా? నేనేం చేయగలను? మీరు ఎంతగానో కృషి చేశారు. ఎన్నో మహిళా సంఘాలు కృషి చేశాయి! మీరంతా ఓడిపో

యినప్పుడు, నేనెలా గెలవగలను? ప్రత్యే కించి నన్నే ఎందుకు అడుగుతున్నారు? కావాలంటే మళ్లీ ఉద్యమం స్టార్ట్ చేయండి. మా కాలేజీ అమ్మాయిలందర్నీ తీసుకొస్తాను. ఊరేగింపులు, నిరసనలు, రిలే నిరాహార దీక్షలు..."

"అవన్నీ లాభంలేదు!" సహజ అడ్డు తగిలింది నువ్వొక్కదానివి చాలు!"

ఇందులేఖ ఇబ్బందిగా చూసింది. "నేను ఏం చేయగలను? అర్థమయ్యేలా చెప్పండి!"

సహజ హ్యాండ్‌బాగ్‌లోంచి కాగితాన్ని తీసింది. ఇందులేఖకి అందిస్తూ అంది, "నీ ప్రశ్నకి సమాధానం చెప్పేముందు నువ్వు ఈ కాగితాన్ని చదవాలి!"

ఇందులేఖ సందేహిస్తూ కాగితాన్ని అందుకుని, అయిష్టంగా చదవడం ప్రారంభించింది. రెండు క్షణాల్లో చదువుతున్న దానిలో లీనమైపోయిన ఇందులేఖని చూస్తూ పైకి లేచి ఆ ఏకాంత ప్రదేశంలో పూలమొక్కల మధ్య పచార్లు చేయసాగింది...

చదవడం ముగించిన ఇందులేఖ మెల్లగా తలపైకెత్తింది. సహజ ఆమె ముందు కూచుంది. ఇందులేఖ మొహం కొత్త నెత్తురుతో నిండినట్టు కొత్తగా అవుపిస్తోంది. ఆమె కాటుక కళ్లు వెల్తురుతో నిండినట్టున్నాయి.

"ఇంటరెస్టింగ్! ఇన్‌స్పైరింగ్! నెవర్ బిఫోర్ థాట్! ఇది..." ఉద్రేకంతో అంది ఇందులేఖ.

"అది నేను రాయాలనుకున్న నవలకి ఉపోద్ఘాతం!" సహజ నవ్వుతూ అంది. నవలలో నాయిక ఒక రచయిత్రి. ఫాంటసీ ఉపోద్ఘాతంలో నవల ప్రారంభించి, సాంఘిక వాతావరణంలోకి మళ్లించి..."

"చాలా బాగుంటుంది! రాస్తున్నారా?" ఇందులేఖ అడ్డు తగిలింది.

"లేదు. రాయకూడదనుకున్నాను, రాయను!"

ఇందులేఖ ప్రశ్నార్థకంగా చూసింది.

"సంభవామి గృహేగృహే అన్న ఆదిశక్తి డైలాగ్, రాసిన నన్నే ఇన్‌స్పైర్ చేసింది..." సహజ నెమ్మదిగా స్పష్టంగా చెప్పడం ప్రారంభించింది.

ఇందులేఖ రెప్పవేయడం మరిచిపోయి వింటోంది. సహజ ముగించి, చిరునవ్వు నవ్వింది.

"మీ నిర్ణయం, మీ నిజాయితీ నన్ను కుదిపేస్తున్నాయి!" ఇందులేఖ ఉద్రేకంతో అంది.

"ఇందూ, నిర్భయంగా నిజం చెప్పు! ఈ ఉపోద్ఘాతం నిన్ను అంతలా ఇన్‌స్పైర్ చేసిందా?" సహజ ఆమె కళ్లల్లోకే చూస్తూ అడిగింది.

"ఇన్‌స్పైర్ అయిపోయాను!"

"థాంక్స్! ప్రతీ ఆడపిల్లా ఒక ఆదిశక్తిగా రూపొందాలన్న నా ఆలోచనని నువ్వు నీ హృదయంతో అర్థం చేసుకున్నావ్! నువ్వో ఆదిశక్తిలా రూపొందగలవా?"

"రూపొందేశానేమో అనిపిస్తోంది!" ఇందులేఖ నవ్వుతూ అంది.

ఇందులేఖ చెంపని ప్రేమగా స్పృశిస్తూ చిరునవ్వుతో ఆమె విశాల నేత్రాల్లోకి చూసింది సహజ.

"ఇందూ... కాత్యాయనికి న్యాయం చేసే విషయంలో నీ సహాయం ఎందుకు కావాలో, నీ సహాయమే ఎందుకు కావాలో ఇప్పుడు చెప్తాను..."

"కాత్యాయనా? ఆమెవరు?" ఇందులేఖ కళ్లు చిట్లిస్తూ అంది. వెంటనే నవ్వి, నాలుక కరుచుకుంది. "ఓహ్! సారీ... చెప్పండి!"

"కాత్యాయనిని నగ్నంగా వీధుల్లో తిప్పిన గూండాలు, చట్టానికీ, సమాజానికీ దొరక్కుండా తప్పించుకుంటున్నారు! చట్టం వాళ్ల దగ్గరకు వెళ్లలేకపోతోంది. ఎందుకంటే వాళ్ల చుట్టూ ఒక అదృశ్య ప్రాకారం నిర్మించబడింది! దుర్మార్గుల్ని కాపాడుతున్న ఆ రక్షణ

వలయాన్ని నువ్వు ఛేదించాలి! ఎందుకంటే ఆ రక్షణ వలయాన్ని ఏర్పాటు చేసిన వ్యక్తి మీ నాన్నగారు..."

"ఐ కాంట్ బిలీవ్! నేన్నమ్మను!" ఇందులేఖ పోలీస్ ఇన్స్‌పెక్టర్ పీతాంబరం కూతురు. ఇందులేఖ దిగ్భ్రాంతితో అరిచింది.

"అయాంసారీ! నిజాన్ని నువ్వు నమ్మి తీరాలి!"

"మీరు రాసింది చదివాక మీ మాటలు విన్నాక మీరు ఏం చెప్పినా నమ్మాలని పిస్తోంది! అయితే.. అయితే.. నాన్న అలా ఎందుకు చేశాడు?" ఇందులేఖ కంఠం వణికింది.

"డబ్బుకోసం"

ఇందులేఖ కళ్లు ఇంకా విచ్చుకునే ప్రయత్నం చేశాయి. పెదవులు అదిరాయి.

"ఎగైన్ సారీ... డబ్బుకోసమే మీ నాన్నగారు ఆ పనిచేశారని నా నమ్మకం! మీ నాన్నగారు అబద్ధాలాడారని నాకు తెలుసు!"

"మీ నాన్నగారు అబద్ధం ఎందుకు ఆడాడు? నా సాక్ష్యాన్ని నరికిపారేయడానికి! ఎందుకు? నేరం జరగలేదనీ, నేను కట్టుకథలు చెప్తున్నాననీ లోకానికి చాటడానికి. అది ఎందుకు? నేరం చేసిన గూండాల్ని కాపాడ్డానికి. అది ఎందుకు? డబ్బుకోసం!"

"నాన్న.. నాన్న... లంచం తీసుకుంటాడని నాకు తెలీదు..." ఇందులేఖ కంఠం ఏదో పాతాళంలోంచి పలికింది.

"సాధారణంగా ఇలాంటివి తమ పిల్లలకి తెలీకుండా జాగ్రత్త పడతారు! ఆ మాటకొస్తే మూడో కంటికి తెలీకుండా జాగ్రత్త పడతారు. ఇందూ, మీ నాన్నగారి నెలసరి జీతం ఎంతో నీకు తెలుసు. అంతే జీతం తీసుకునే ఇతర తండ్రుల కూతుర్లు నీకు తెలిసేవుంటారు. నువ్వు రిచ్‌గా వుంటున్నావో, వాళ్లు రిచ్‌గా వుంటున్నారో ఆలోచించు..."




ఇందులేఖ ఆశ్చర్యంగా చూస్తూ నోరు తెరిచింది. "అవును... నా క్లాస్‌మేట్ రజని నాన్నగారికి మా నాన్న జీతం అంతే వస్తుంది. అయితే తండ్రి సంపాదన చాలదంటూ లేదంటూ వుంటుంది రజని. మా ఇద్దరివీ ఒకే సైజు కుటుంబాలు"

"అంటే మీ నాన్నగారికి జీతంకాని జీతం ఏదో వస్తూ వుండాలి! అది... అది"

"చెప్పకండి!" ఇందులేఖ అడ్డు తగిలింది. "ఊహించగలను!"

"కంగ్రాట్స్! పోలీసు ఫోర్స్‌ను పోలీస్ ఫార్స్‌గా రూపొందిస్తున్న స్వార్థపరులు మీ నాన్నగారిలాంటి వ్యక్తులవల్ల నేరాలు చేసి తప్పించుకుపోతున్నారు! అది అన్యాయం! ఆ అన్యాయాన్ని ఎదిరించాలి! ఆ అన్యాయానికి సపోర్ట్ అందిస్తున్న వ్యక్తుల్ని మార్చాలి!"

"ఔను"

"నా తండ్రిని మార్చే అవకాశం నాకే ఎక్కువ. మార్చాల్సిన బాధ్యత కూడా మొట్ట మొదట నాదే! నా భర్తని మార్చేశక్తీ బాధ్యతా నాకే ఎక్కువగా వుండాలి. నా కొడుకుని మార్చేశక్తీ బాధ్యతా నాకే ఉండాలి! ఇలా ప్రతీ స్త్రీ అనుకుంటే ఎలా వుంటుందో ఒకసారి ఆలోచించు ఇందూ!" సహజ ఉద్రేకంతో అంది.

"అవును..." ఇందులేఖ మంత్రముగ్ధలా అంది.

"మీ నాన్నగార్ని నువ్వు అప్రోచ్ అయినంత సులభంగా మార్చగలిగినంత సులభంగా నేను అప్రోచ్ అవలేను, మార్చలేను! అంచేత..."

"నేను నాన్నను నిలదీస్తాను! ఒక ఆడదాన్ని నిర్దాక్షిణ్యంగా వివస్త్రను చేసిన రౌడీల చేతులతో నాన్న చేతులు కలవడం నేను సహించను!" ఇందులేఖ ఆవేశంతో అంది.

"అయితే నాన్నకి ఆ పాడుపనితో సంబంధం వుంది అని నిరూపించాలి. నాన్న లంచం తీసుకుంటున్నట్టు నేను నిరూపించగలగాలి! లేకపోతే నాన్న ఒప్పుకోడు! ఆయన జగ

మొండి! నాకు పరిచయంవున్న నాన్న... లంచం తింటాడంటే... నమ్మడానికి... నాకు..."

సహజ ఆమెవైపు సానుభూతితో చూసింది. "మీనాన్నగారు అబద్ధం ఆడారు! మనిషి అబద్ధం ఎందుకు ఆడతాడు? నిజాన్ని కప్పిపుచ్చడానికి! నిజాన్ని మించిన లాభం ఏదో ఉంటేగానీ మనిషి నిజాన్ని నిప్పులపాలు చేయడు! మీ నాన్నగారిలో లాభం కోసం సత్యాన్ని సమాధి చేసే తత్వం వుందని నువ్వు సులభంగా నిరూపించుకోవచ్చు. ఆ ఉపాయం నేను చెప్తాను..."

సహజ తగ్గు స్వరంతో చెప్పసాగింది. ఇందులేఖ ఆశ్చర్యంతో వినసాగింది.

★ ★ ★

ఫోన్ పడేసి, ఆదరాబాదరా బైటికి వెళ్లిపోతున్న తండ్రికి అలవాటు ప్రకారం టాటా చెప్పకుండా తలుపు మూసి, గొళ్లెం బిగించి ఇందులేఖ హాల్లోంచి గదిలోకి వెళ్లింది. కుర్చీలో చలనాన్ని మరిచిపోయిన విగ్రహంలా కూచున్న తల్లివైపు జాలిగా చూసింది.

"మమ్మీ..." ఎదురుగా కూచుంటూ అంది ఇందులేఖ. అనసూయ తలెత్తి కూతురివైపు చూసింది.

"నేను చెప్పినప్పుడు నువ్వు ఎలా నమ్మలేకపోయావో, సహజ చెప్పినప్పుడు నేను కూడా నమ్మలేకపోయాను. నిర్ధారణ చేసుకోడం కోసం మనం ఆడిన నాటకం నాన్నలోని దొంగను పట్టిచ్చింది! అయాం సారీ ఫర్ డాడీ మమ్మీ! అయాం బిగినింగ్ టు హేట్ డాడీ!"

"ఇందూ..." అనసూయ బొంగురుగా అంది.

"బీరువాలోని పాతిక వేల కట్టలోంచి తీసిన పదివేలు నాన్నకి చూపించాను. విరూపాక్షం బోనస్‌గా పంపించాడనీ, నాన్న చేసిన సహాయానికి ధన్యవాదాలు చెప్పమన్నాడనీ నేను చెప్పినప్పుడు నాన్న ఆశ్చర్యపోతాడనీ, 'విరూపాక్షం ఎవడు? అతనికి నేనేం సహాయం చేశాను! ఎవడో పంపాడంటూ మరెవడో ఇస్తే నువ్వెందుకు తీసుకున్నావ్?' అని అంటాడని ఆశించాను! అయితే డాడీ అలా అనలేదు! ఒకక్షణం నావైపు ఇబ్బందిగా చూసి డబ్బు నీ చేతికిచ్చేయమన్నాడు! అంటే ఏమిటి అర్థం? డాడీకి లంచం తినే అలవాటు ఉందనేగా? ఆ విరూపాక్షం అనేవాడికి ఏదో సహాయం చేశాడనీ, వాడిచ్చిన లంచం తీసుకున్నాడనీ, తీసుకుంటాడనీ అనేగా!"

"ఇందూ..."

"డాడీకి లంచం తీసుకునే అలవాటు లేదుగా పాపం!" ఇందులేఖ వెటకారంగా అంది.

"ఇందూ... మీ నాన్న లంచగొండి అనే నిజాన్ని నువ్వు తట్టుకోలేవని అలా అన్నాను... మీ నాన్న... లంచం తీసుకుంటారు..." అనసూయ కంఠం పూడుకుపోయింది.

"అయాం సారీ ఫర్‌యూ మమ్మీ!" ఇందులేఖ జాలిగా అంది. "మమ్మీ.. నాన్న విరూపాక్షంగారితో చేతులు కలిపాడు అని నేను నమ్ముతున్నాను! ఒక ఆడదాని గుడ్డలు ఊడ బీకడంలో గూండాలకి నాన్న చేతులు సహాయం చేశాయి! దాన్ని నేను సహించను, క్షమించను!"

"ఇందూ..."

"నువ్వు క్షమిస్తావా మమ్మీ?"

అనసూయ కాంతిలేని వడగళ్లలాంటి కళ్లతో కూతుర్ని చూసింది. "ఇందూ... నేను నేను... సహజతో మాట్లాడాలి"

"ఆమె ఇల్లెక్కడో చెప్పింది... వెళ్లి తీసుకొస్తా!" ఇందులేఖ పైకిలేస్తూ అంది. దగ్గరగా వెళ్లి తల్లి మెడచుట్టూ చేతులువేసి బుగ్గని ఆమె చెంపకేసి అదిమింది. "నాన్న యూనిఫామ్‌ని మనం శుభ్రం చేద్దాం. బీ బ్రేవ్ మమ్మీ!" అంది.

★ ★ ★

"సహజా... అమ్మాయి ఇందు నీ గురించీ, నీ సంభవామి గృహేగృహే గురించీ, కాత్యాయనికి న్యాయం చేయడంలో నీ ప్రయత్నం గురించీ, ఓటమి గురించీ అంతా చెప్పింది. ఆ వివరాలన్నీ నన్ను ఆలోచింపజేశాయి. నా భర్త అందరిలాగే లంచం తీసుకోడాన్ని ఆచారంగా భావిస్తారని నాకు తెలుసు. భార్య తన భర్తని మార్చాలి. తల్లి తన కొడుకును మార్చాలి. కూతురు తన తండ్రిని మార్చాలి. ఇలా ప్రతి ఆడదీ తనకి సంబంధించిన మగవాణ్ణి మార్చాలి అన్న నీ సూత్రం నాకు నచ్చింది'' అనసూయ నెమ్మదిగా చెప్పి ఆగింది.

"థాంక్స్ మేడమ్!" సహజ కంఠంలో ఆనందం పలికింది.

"నా భర్తని నేను మార్చలేకపోయాను. అయితే ఇప్పుడు నా కూతురి తండ్రిని మార్చే ప్రయత్నం చేస్తాను''

"మమ్మీ!" ఇందులేఖ ఉత్సాహంగా అరిచింది.

"ఔను! నా భర్త ఖూనీకోర్లనుండీ, దగాకోర్ల నుండీ లంచాలు గతికి వుండొచ్చు. కానీ ఆడదాన్ని గుడ్డలులేకుండా బజార్లో తిప్పిన ఆబోతులని వెనకేసుకు వస్తూ, అందుకు ప్రతిఫలంగా లంచం తీసుకోడాన్ని నేను క్షమించను! ఆడదానికి ప్రాణంకన్నా మానం మిన్న! నగ్నంగా ఒక ఆడది తన సమక్షంలో మగాళ్లకి కనిపిస్తే తనే నగ్నంగా కనపిస్తోందన్నంత సిగ్గుతో, అవమానంతో ఆడది చచ్చిపోతుంది!

నేను అవసరమైతే శవంగా తయారై ఊరేగడానికి ఇష్టపడతాను! గుడ్డలు లేకుండా నగ్నంగా ఊరేగను! కాత్యాయనిని అలా వీధుల్లో తిప్పిన రాక్షసులు స్త్రీత్వాన్నే నగ్నంగా తిప్పారని నేను భావిస్తున్నాను!"



"మిమ్మల్ని చూసి గర్విస్తున్నా మేడమ్!" సహజ ఆర్ద్ర నయనాలతో చూస్తూ అంది.

మహాభారతంలో దుశ్శాసనుణ్ణి అతని భార్య క్షమించిందో, లేదో నాకుతెలీదు! కలియుగ దుశ్శాసనులతో చేతులు కలిపి, ఛాయా దుశ్శాసనుడుగా రూపొందిన నా భర్తను నేను క్షమించను! క్షమించాల్సివస్తే ఆయనకి నేను భార్యగా ఉండను!"

  

ఆరోజు రాత్రి పోలీసాఫీసర్ పీతాంబరం ఇంట్లో సహజ సప్లై చేసిన పథకం ప్రదర్శించబడింది. ప్రదర్శనలో పాల్గొన్న అనసూయా, ఇందులేఖా అదొక నాటకమనీ, తాము పాత్రధారులమనీ ప్రారంభంలోనే మరిచిపోయారు! ఆ ప్రదర్శనకి ఏకైక ప్రేక్షకుడైన పీతాంబరం ఉక్కిరిబిక్కిరైపోయాడు.

ఆ ఇద్దరూ అతనివైపు రువ్వుతున్న డైలాగులు లాఠీ దెబ్బల్లా అతని హృదయాన్ని తాకుతున్నాయి. వాళ్లు ఏకకంఠంతో చేసిన హెచ్చరికలు అతను యూనిఫామ్‌గా ధరించిన కవచాన్ని పగలగొట్టేశాయి. అతని అహంకార శిరస్త్రాణాన్ని ముక్కలుముక్కలు చేశాయి.

అనసూయ విడాకుల అస్త్రం అతని ఆయుపట్టులో తాకింది. అతని అవినీతి గురించి అధికారులకి ఆమె తెలియజేస్తానన్న వివరాలు అతని మొండిధైర్యాన్ని భయంగా తారుమారు చేశాయి.

"రేప్పొద్దున నన్ను కూడా ఎవరేనా నగ్నంగా ఊరేగించి ఇంత లంచం పాడేస్తే వదిలేస్తావు నాన్నా నువ్వు!" ఇందులేఖ వెటకారం అతని మేకపోతు గాంభీర్యాన్ని కైమా చేసేసింది.

ప్రదర్శనలో ప్రత్యక్షమవుతున్న సత్యం,

నగ్నసత్యం అతను కళ్లు పూర్తిగా తెరిచేలా చేసింది. ప్రేక్షకుడైన తను తగు విధంగా రెస్పాండ్ అవకపోతే రేపు తను ఎదుర్కోబో యే యదార్థం ప్రదర్శనలో ప్రత్యక్షమవు తూ అతనిలోని మనిషిని మేలుకొలుపు తోంది.

ప్రదర్శన పూర్తయింది.

నిర్దేశించిన వ్యవధిలో నిర్దేశించిన పని పూర్తిచేసి, నిజాయితీని నిరూపించుకోకపోతే జరగబోయేదేమిటో గ్యారెంటీగా తెలియజేసే కాగితాల్ని భర్తమీదికి విసిరికొట్టింది అన సూయ. అప్రూవర్‌గా మారిపోయి, ఆమె ప్రభుత్వానికి విన్నవించబోయే భర్త అక్ర మాల జాబితాలు ఆ కాగితాల్లో వున్నాయి. నిర్ణయించిన గడువులోగా కాత్యాయని మీద దుర్మార్గం జరిపిన గూండాల్ని అరెస్టు చేసి, కేసు పెట్టకపోతే అవినీతిపరుడైన భర్తతో విడాకులు ఇప్పించి తన ఆత్మ గౌరవాన్ని రక్షించమంటూ ఆమె కోర్టుకు సమర్పించబో యే విడాకుల అభ్యర్థన నకలు ఆకాగితాల్లో ఉంది.

**అవినీతిపరుడై, అక్రమసంపాదనతో తనని పోషిస్తూ, ఆ పాపిష్టి ధనంతో చదువు చెప్పిస్తున్న తండ్రినుండి దూరంగా వుండేందుకు అనుమతి ఇప్పించమంటూ ఇందులేఖ రాసిన అభ్యర్థన నకలువుంది.**

వచ్చే సోమవారంలోగా దోషుల్ని బంధించి కేసుపెట్టినట్టు అన్ని దినపత్రికలలో నూ వార్త అచ్చుకాకపోతే, వచ్చే మంగళ వారం ఆ పత్రాల్లో కొన్ని ప్రభుత్వానికీ, కొన్ని కోర్టుకూ అందజేయబడతాయన్న హెచ్చరి కతో తల్లీకూతుళ్లు నిష్క్రమించారు.

తల్లీ కూతుళ్లు ఇద్దరూ, తన అత్తవారింటి కి, అనసూయ పుట్టింటికి వెళ్లిపోయారని పీతాంబరానికి అర్థం కావడానికి కొంత సమయం పట్టింది.

  

"గుడ్ మార్నింగ్!"

"మార్నింగ్..." కాఫీ తాగుతూ కూచున్న సహజ తటాలున తలెత్తి చూసింది. ఉత్తమ్‌కు మార్ నవ్వుతూ గుమ్మంలో నిలబడ్డాడు. అతన్ని లోపలికి ఆహ్వానించింది.

"పేపరు చూశారా?" లోపలికి వస్తూ అడిగాడతను.

"మార్నింగ్ వాక్‌కి వెళ్లి నాన్నే కొనితెస్తా డు. ఇంకా రాలేదు..."

"వెరీగుడ్! గుడ్‌న్యూస్ అందజేసే ఛాన్స్ నాకే దక్కాలనుకున్నాను, దక్కింది! ఉత్తమ్ కుమార్ నవ్వుతూ మడతపెట్టిన పేపర్ని ఆమెకి అందించాడు. చేతిలోవున్న ఇతర దినపత్రికల్ని టేబుల్‌మీద పెట్టాడు.

"చదువుతూ ఉండండి! కిందికెళ్లి మీ అమ్మగార్ని అడిగి కాఫీ తెచ్చుకుంటాను'' ఉత్తమ్‌కుమార్ మాట సహజకి వినిపించలే దు.

"నగ్న ప్రదర్శన యధార్థం"

"దోషుల అరెస్టు!"

"ఇన్స్‌పెక్టర్ పీతాంబరం అడ్వెంచర్!"

మూడు సైజుల అక్షరాల్లోవున్న శీర్షికలు సహజ కళ్లకి విందు చేస్తున్నాయి. ఆత్రంగా చదవసాగిందామె.

"ఇటీవల నగరంలో సభ్యసమాజం సిగ్గుతో తలవంచుకునేరీతిలో కాత్యాయని అనే మహిళ నగ్నంగా ప్రదర్శించబడిన సంఘ టన యదార్థమే అని తేలిపోయింది. అనుకో కుండా లభించిన కొన్ని అమూల్య సాక్ష్యాల ఆధారంతో ఇన్స్‌పెక్టర్ పీతాంబరం రంగంలోకి దిగి, అపరాధుల్ని అరెస్టు చేయ డంతో నగ్న ప్రదర్శనకు సంబంధించిన నీలివార్త నిజమే అని తేలింది''

'త్వరలో కేసు ఫైల్ చేయడం జరుగు తుంది', 'దోషుల్ని శిక్షించకుండా వదిలిపె ట్టేది లేదు!, ఏ ఒత్తిడులకీ లొంగే ప్రసక్తిలే దు...! వగైరా స్టేట్‌మెంట్స్ అన్నీ ఇన్స్‌పెక్టర్ పీతాంబరం ప్రజలకోసం ఇచ్చినవి కావనీ, అతనికి అల్టిమేటం ఇచ్చి వెళ్లిపోయిన భార్యా





కూతుర్లకోసం ఇచ్చినవనీ సహజకు తెలుసు.

**అంతలో కాఫీ కప్పుతో లోపలికి వచ్చాడు ఉత్తమకుమార్**

"మిస్ సహజా! ఇది, ఈ అద్భుతం ఎలా జరిగిందో, ఎందుకు జరిగిందో అర్థం కావట్లేదు! ఊరేగింపే జరగలేదన్న పోలీస్ డిపార్ట్‌మెంట్ పూడ్చేసిన కేసుని ఎందుకు తవ్వి తీసిందో, ఇన్స్‌పెక్టర్ పీతాంబరానికి లభించిన సాక్ష్యాలేమిటో, విరూపాక్షంగారి డబ్బునీ, పలుకుబడినీ పూర్తిగా మరిచిపోయి ఇన్స్‌పెక్టర్ ఈ సాహసం ఎందుకు చేశాడో... అర్థం కావడంలేదు! రాత్రంతా మేలుకుని బుర్రబద్దలు కొట్టుకున్నాను! దిసీజ్ ది గ్రేటెస్ట్ మిస్టరీ ఆఫ్ మై లైఫ్! ఇండియాలో ఇలాంటివి జరుగుతాయా? మీరేమైనా ఊహించగలరా?"

సహజ అతనివైపు చిరునవ్వుతో చూసింది. కాత్యాయని విషయంలో తనకి తోడుగా నిలబడి సహాయం చేసిన ఉత్తమ్‌కుమార్‌కి తన ప్లాను గురించి ముందే చెప్పి ఉండాలి. అతను కాత్యాయని ఎవరో, ఎక్కడుంటుందో కనుక్కోవడమే కాకుండా తనతోబాటు ఆమెని కల్సుకున్నాడు. ఊరేగింపు గురించి పత్రికల్లో రాశాడు.

"ఊహించను!" సహజ అంది. అతను అర్థం కానట్టు చూశాడు.

"ఎందుకంటే గూండాల అరెస్ట్ జరిగి తీరుతుందని నాకు ముందే తెలుసు..."

"వాట్?! ఎట్లా తెలుసు?"

"దానికి ముహూర్తం పెట్టింది.. నేనే!"

ఉత్తమ్‌కుమార్ ఆశ్చర్యంగా చూశాడు. సహజ కాలేజీలో తను ఇందులేఖను కల్సుకోడంతో ప్రారంభించి చెప్పసాగింది.

"అమ్మాయ్, టిఫిన్ చల్లారి పోతోంది! అబ్బాయిని తీసుకురా!" అమృతమ్మ కంఠం కింది హాల్లోంచే పైగదిలోకి దూసుకొచ్చింది.

"వస్తున్నానమ్మా!" సహజ పైకిలేస్తూ "రండి!" అంది ఉత్తమ్‌కుమార్‌తో.

"సహజా చూశావా! ఊరేగింపు జరిపిన రౌడీల్నీ, నిన్ను కొట్టిన వాణ్ణీ పోలీసులు అరెస్ట్ చేశారు!"

మేడమెట్లు దిగిన కూతుర్ని చూస్తూ గుమ్మంలోంచి అరిచాడు శ్రీమంతరావు.

"గుడ్‌మార్నింగ్ సార్!" సహజ వెనకే మెట్లు దిగిన ఉత్తమ్‌కుమార్ అన్నాడు.

"మార్నింగ్ ఉత్తమ్!... న్యూస్..."

"అన్ని దినపత్రికల్లోని ఆ న్యూస్‌ని వేడివేడిగా మీ అమ్మాయిగారికి ఎప్పుడో సర్వ్ చేసేశాను సార్!" ఉత్తమ్‌కుమార్ నవ్వుతూ అన్నాడు.

శ్రీమంతరావు గుడ్లు పెద్దవిచేసి చూసి, నవ్వేశాడు.

"ఇదిగో! తింటూ ఆ న్యూసులేవో చెప్పండి! నేనూ వింటాను!" అమృతమ్మ టిఫిన్ ప్లేట్లు టేబుల్ మీద సర్దుతూ అంది...

"యూషుడ్ బీ ప్రౌడాఫ్ యువర్ డాటర్ సార్!" ఉత్తమ్‌కుమార్ ప్లేటుని దగ్గరగా లాక్కుంటూ అన్నాడు. శ్రీమంతరావు ఎందుకన్నట్టు చూశాడు.

"నేకెడ్ ప్రొసెషన్ జరిపించిన వెధవల్ని అరెస్ట్ చేయించిందెవరో తెలుసా?" ఉత్తమ్‌కుమార్ అడిగాడు.

"ఎవరో పేపర్లో రాయలేదు... చేసింది మాత్రం ఇన్స్‌పెక్టర్ పీతాంబరం"

"చేయించిన వ్యక్తి మిస్ సహజ, డాటరాఫ్ శ్రీమతి అండ్ శ్రీ శ్రీమంతరావ్!"

"వాట్!" శ్రీమంతరావు చేతిలోని ఇడ్లీముక్క అతని నోటికి అరడుగు దూరంలో ఆగిపోయింది. ఇన్స్‌పెక్టర్ పీతాంబరాన్ని అతని భార్యాకూతుర్ల ద్వారా సహజ ఎలా ఇరకాటంలో పెట్టిందీ ఉత్తమ్‌కుమార్ వివరించినంతసేపూ ఆ చెయ్యి అలాగే గాలిలో స్తంభించే వుండిపోయింది.

శ్రీమంతరావు చూపుల్ని మెల్లిగా కూతురివైపు తిప్పాడు "నేను నేను... నిన్ను చూసి గర్విస్తున్నానమ్మా సహజా!"

"నాన్నా..."

"తల్లిదండ్రులకి సహజంగా వుండే భయంతో నిన్ను నిరుత్సాహపరిచాం. అయినా ఎదిరించి, ఎదురొడ్డి నిలిచావు! సాధించావు!"

"ఎదురొడ్డి నిలిచి సాధించడంలో అమ్మాయిది నా పోలికేగా!" అమృతమ్మ సగర్వంగా అంది.

★ ★ ★

సహజ తలుపు తోసుకుని లోపలికి అడుగుపెట్టింది. ఎదురుగా టేబుల్‌కి అటువైపున కూచున్న ఆమె వంచిన తల ఎత్తకుండా, ఏకాగ్రతతో రాసుకుపోతోంది. ఆమెకి ఎడంవైపున టేబుల్ మీద ఫ్లాస్కూ, అరడజను కప్పులూ వున్నాయి. కుడివైపున గాజులోటాలో అరడజను పైగా బాల్‌పాయింట్ పెన్నులు, ఆమెకోసం కాచుకున్న దూసిన కత్తుల్లా సిద్ధంగా వున్నాయి. ఎడంవైపున క్రెడిల్‌మీంచి తీసి టేబుల్ మీద పెట్టబడిన టెలిఫోన్ రిసీవర్ ఆమెను ఎవ్వరూ డిస్టర్బ్ చేయకూడదు అని చెప్తున్నట్టు ఒత్తిగిలిపడుంది.

"నమస్తే!" సహజ ఆమెవైపే చూస్తూ అంది.

ఆమె తల చివాల్న పైకి లేచింది. అంతసేపూ ఆమె చెంపల్ని కప్పుతూ తెరల్లాగా కిందికి వాలివున్న బాబ్డ్‌హెయిర్ భుజాలమీదికి దూకింది. ముక్కుమీదికి జారిన కళ్లద్దాల్ని పైకి తోసుకోకుండా వాటిపైనుండి సీరియస్‌గా చూసిందామె.

"ఎవరు? అయాం బిజీ! డోంట్ డిస్టర్బ్!" ఆమె కంఠంలో అధికారం, హుందాతనం దర్పం కిందపడి కంచుపళ్లెం చేసే చప్పుళ్లలా ధ్వనించాయి.

"మిమ్మల్ని డిస్టర్బ్ చేయడానికి రాలేదు, ఇంటర్వ్యూ చేయడానికి వచ్చాను"

"ఇంటర్వ్యూ... మీ పత్రిక పేరేంటి?"

"నా పేరూ నా పత్రిక పేరూ ఒకటే... సహజ"

హారతి కళ్లు చిట్లిస్తూ కళ్లద్దాల్ని పైకి తోసుకుంది. "స...హ...జ... ఓహ్... నువ్వు... నువ్వు... యస్! మహతి పత్రికమీద మాకందరికీ చాడీలు రాశావ్! నువ్వు... నీ గురించి నాకంతా తెలుసు! ఎందుకొచ్చావిక్కడికి?"

"ఇంటర్వ్యూ..."

"నేను తీరిగ్గాలేను. రాసుకుంటున్నాను. ఇంటర్వ్యూ ఇవ్వను వెళ్లు!"

సహజ టేబుల్ ముందున్న కుర్చీని వెనక్కిలాగి కూచుంది. నవ్వుతూ హారతివైపు చూసింది. హారతి కళ్లు సహజకి నిప్పుల హారతి పడుతున్నట్టున్నాయి.

"మిమ్మల్ని రాయకుండా ఆపాలనే వచ్చాను!" సహజ ఆమె కళ్లల్లోకే చూస్తూ అంది.

కళ్లద్దాల్ని తీసి టేబుల్‌మీదపెట్టి హారతి సహజ కళ్లను తన కళ్లతో కొరికే ప్రయత్నం చేసింది. "ఓహో! అలాగా! రవిచంద్రని అడిగి నీ గురించి నేను కనుక్కున్నాను... నీకు..."

"నా గురించి న్యూస్‌పేపర్లూ చెప్పాయే! ఆ విషయాలు తెలుసుకోలేదా? ఒక స్త్రీని రాక్షసులు వలువలు ఊడ్చి, పూర్తినగ్నంగా మీలాంటి రచయిత్రులూ, రచయితలూ కథల్లో స్త్రీ పాత్రల్ని నగ్నంగా చేసినట్టు చేసి వీధుల్లో ఊడ్చారు! దాన్ని నేను ప్రతిఘటించాను! ఆ విషయం..."

"ఆ విషయం విన్నాను. ప్రతిఘటించావు! ఏం చేయమంటావ్? ఎగిరిగంతేసి నీకు సన్మానం చేయమంటావా?" హారతి ఎగతాళిగా నవ్వింది.

"నాకు సన్మానం చేయొద్దులెండి!" సహజ నవ్వుతూ అంది. "కాత్యాయనిలాంటి స్త్రీలు ఆవిధంగా వివస్త్రలుగా ఊరేగించబడే నపుంసక సంస్కారాన్ని కళల్లో ఒకటైన సాహిత్యం ద్వారా మనుషుల్లోకి సరఫరా చేస్తున్న మీలాంటివాళ్లు చేసే సన్మానాలు




అవమానాలే!"

"నాన్‌సెన్స్... నేను రవిచంద్రను కాను, నీచేత మాటలు పడ్డానికి!" హారతి హుంకరించింది.

"తెలుసు.. మీరు అతను కాదుకనకనే మీ దగ్గరికి వచ్చాను. హారతిగారూ మీరు స్త్రీ. మీరు విద్యావంతురాలైన స్త్రీ. మీరు రచయిత్రిగా ఎదిగిన స్త్రీ. అందుకే ఈ క్షణంలో మీ ముందున్నాను, మరో బూతు రచయిత ముందుకాకుండా! మగవాణ్ణి- 'బూతు రాసి ఆడదాన్ని అవమానించొద్దు' అని అడిగితే 'మీ ఆడవాళ్లే రాస్తున్నారుగా! ముందు వాళ్లని కంట్రోల్ చెయ్!' అంటారు.

"హారతిగారూ... మీలాంటి రచయిత్రులూ, త్రివిక్రమరావులాంటి రచయితలూ కీర్తి కోసం, డబ్బుకోసం అశ్లీలసాహిత్యం రాస్తూ, స్త్రీని వివస్త్రగా ఊరేగించే దైత్య సంస్కారాన్ని జనంలోకి సరఫరా చేస్తున్నారని ఇందాకే అన్నాను! ఎలాగా? అని అడగలేదుమీరు!" సహజ ఆమెను సూటిగా చూస్తూ అంది. "ఆ ఆరోపణని అంగీకరిస్తున్నారా? మొన్న ఒక ఆడది వస్త్రాపహరణ శిక్ష అనుభవించిన సంఘటనకు మీరు కూడా పరోక్షంగా కారకులే అన్న నా ఆరోపణని అంగీకరిస్తున్నారా?"

"అర్థంలేని ఆరోపణ! నేనెందుకు అంగీకరించాలి?"

"ప్రేమ, శృంగారం పేర్లతో సరసం అనే ముసుగులో మీరు చేస్తున్న రచనల్లో రెగ్యులర్ ఇంటర్వ్యూలో ఆడపాత్రని వివస్త్ర చేస్తున్నారు. నిజజీవితంలో అత్యధిక కాలం గోప్యంగావుండే అవయవాలను అతి తెలివిగా అక్షరాల్లోదాచి, వర్ణించి చిత్రించి పాఠకులకి చూపిస్తున్నారు! విస్కీకి అలవాటుపడ్డ వ్యక్తి పానకంతో తృప్తి చెందలేడు. అదేవిధంగా నగ్నత్వాన్ని వర్ణనల్లో చూసిన వ్యక్తి ఆచ్ఛాదనలో ఆడదాన్ని చూడలేడు. ఏడాపెడా జంతువుల్ని నరికిపారేసే వ్యక్తి ఆ రక్తాన్ని చూసి తట్టుకునే వ్యక్తి మనిషిని చంపడానికి అంతగా అనుమానించడు! అదేవిధంగా అశ్లీల రచనల్లో స్త్రీని నగ్నంగా చూడగలిగిన వ్యక్తి ఆ కుసంస్కారాన్ని క్రమంగా వంటబట్టించుకుని, నిజజీవితంలో స్త్రీని నగ్నంచేసి చూడ్డానికి వెనకాడడు! దీన్నే కల్చరల్ డీజెనరసీ అంటారు! మీ విచ్చలవిడి రచనలద్వారా ఈ కల్చరల్ డీజనరసీని మీరు సమాజంలోకి ఇంజెక్ట్ చేశారు... చేస్తున్నారు.

"మైగాడ్! హెవీస్టఫ్! విని జీర్ణించుకునే శక్తి నాకు లేదు! ఇంతకీ నువ్వెవరు ఏమిటో, ఎందుకు నా టైమ్ వేస్ట్ చేస్తున్నావో చెప్పేసి వెళ్లిపో!"

"హారతిగారూ మీకో విజ్ఞప్తి చేయడానికి వచ్చాను. మీలో కల్పనాశక్తి ఉంది. భాషా పరిజ్ఞానం వుంది. కళారూపమైన సాహిత్యాన్ని సృష్టించే శక్తివుంది! ఆ శక్తిని స్వార్థపరుల చేతికి ఆయుధంగా అందిస్తున్నారు! డబ్బు కోసం ఆడదాన్ని బజార్లో పెట్టే పురుషుల చేతికి ఆయుధంగా అందిస్తున్నారు! ఆ అపరాధం చేయకండి! రచయిత్రిగా మీకున్న శక్తిని మీజాతికి చెందిన స్త్రీల గౌరవాన్నీ, అభిమానాన్నీ, వ్యక్తిత్వాన్నీ సంరక్షించడానికి ఉపయోగించండి! స్త్రీ అభ్యున్నతికి దోహదం చేసే సాహిత్యాన్ని సృష్టించండి! అశ్లీల రచనలు రాయకండి! స్త్రీని ఆవిధంగా కించపరచకండి!"

"నేను రాస్తోంది అశ్లీలమని ఎవరన్నారు? సందర్భాన్ని అనుసరించి కథ డిమాండ్ చేసినప్పుడు ఏదోకొంత శృంగారం రాస్తున్నా! నీ ఆర్గ్యుమెంట్ వింటూంటే నువ్వు నా రచనల్ని చదవలేదనీ, కరెంట్ మెగా సీరియల్ 'నగ్న హృదయం' చదవడం లేదనీ తెలుస్తోంది. ఐ పిటీయూ.. గో, అండ్ రీడ్ దెమ్!" హారతి సలహా ఇచ్చింది.

"జాలిపడకండి. మిమ్మల్ని కలుసుకోవాలనుకున్నప్పుడే మీ రచనల్ని చదివాను. మీ నగ్నహృదయాన్ని కూడా దర్శించాను! మీ నగ్నహృదయం అనబడే మెగా సీరియల్ ఆఫ్ 1995లో ప్రతీ పేజీలోనూ నగ్న శరీరాలే

కనిపిస్తున్నాయిగానీ, నగ్న హృదయం ఎక్కడా కనపళ్లేదు!" సహజ నవ్వుతూ అంది.

"నాన్‌సెన్స్..."

"హారతిగారూ, మీరు రాస్తున్న బూతుని శృంగారంగా భావించి ఆత్మవంచన చేసుకోకండి! మగ రచయితలతో పోటీపడి కీర్తి డబ్బూ సంపాదించే కక్కుర్తితో మీరు బూతు రాస్తున్నారు! తరతరాలుగా మగవాడు స్త్రీ వ్యక్తిత్వంతో ఆడుకుంటున్నాడు. ఆవిధంగా ఆడుకునే మగాడు ఆడదానికి శత్రువు. అంచేత శత్రువు సహజంగా మనల్ని కించపరచడానికీ, నాశనం చేయడానికే ప్రయత్నిస్తాడు! అది శతృత్వానికి వుండే సహజ లక్షణం! కానీ స్త్రీ అయిన మీరు స్త్రీకి శత్రువు కావడం అక్రమం! నిజజీవితంలో ఒక ఆడదాన్ని గుడ్డలు ఒలిచి ఊరేగించారన్న వార్త తెలిసిన మరుక్షణం స్త్రీ అయిన మీరు, రచయిత్రి అయిన మీరు మీ కలంతో స్త్రీ గుడ్డలు ఒలిచే కార్యక్రమానికి స్వస్తి చెప్పి వుండాలి!"

"నీకు తెలీదేమో, స్త్రీ శరీరాన్నే కాదు, పురుష శరీరాన్ని కూడా వివస్త్రంగా చేస్తారు, శృంగారం రాసే సందర్భాల్లో! 'నీ' స్త్రీజాతినే బజార్లో పెట్టడంలేదు, సౌందర్యాన్ని వర్ణించడం బజార్లో పెట్టడమని నువ్వు అనుకుంటే!" అప్రయత్నంగా తనని డిఫెండ్ చేసుకునే ప్రయత్నం చేసింది హారతి.

"నీ మొత్తం రచనల్లో పురుషుడి నగ్న శరీరాన్ని నువ్వు వర్ణించిన ఘట్టం ఒక్కటి చెప్పుచూద్దాం!" సహజ ఛాలెంజ్ చేసింది. "అతను నగ్నంగా ఉన్నాడు అని చెప్పడం తప్పా నువ్వు ఏం రాశావ్? అదే నీ జాతికి చెందిన స్త్రీ శరీరంలోని అంగాంగాలనూ అక్షరాల్లో చూపించావు! ఆమె బాహువుల్ని వర్ణించావు. ఆమె వక్షోజాలని చూపించావు ఒక్క సెంటీమీటరు కూడా వదలకుండా. ఆమె నాభినీ, జఘనాన్నీ, పొత్తికడుపునీ, తొడల్నీ, చివరికి, చివరికి- ఆమె జననాంగాల్నీ రకరకాల వస్తువులతో పోలుస్తూ చూపించావు, పోల్చకుండా చూపించావు. దీనివల్ల ఏంజరుగుతోంది? పోలికలుగా నువ్వు చూపించిన వస్తువుల్ని చూసిన వెంటనే పాఠకులకి, ముఖ్యంగా మగాళ్ళకి స్త్రీ జననాంగాల్ని గుర్తుచేస్తాయి!"

"ఐ కాంట్ హెల్ప్!" హారతి నిర్లక్ష్యంగా అంది''

"యూకాంట్ హెల్ప్... అవును. నోబడీ కెన్ హెల్ప్! కొంతకాలం క్రిందట ఒక తమిళ సినిమాలో మేధావులైన రచయితా దర్శకులు ఒక మహత్తరమైన సన్నివేశం సృష్టించారు. ముసలి భర్తతో దాంపత్య సుఖం పొందలేని పడుచు పెళ్ళాం ఎవరి సలహానో విని, తన భర్తలో కామోద్రేకాన్ని పుట్టించడానికి ప్రతిపూటా అతనికి మునక్కాయలతో చేసిన వంటకాలే పెడ్తుంది. దాని మూలంగా మునక్కాయలు మగాడిమీద మహత్తరమైన స్టిములెంట్‌గా పనిచేస్తాయని ఆ 'కళాకారులు' పచ్చిగా జనానికి చెప్పారు! ఫలితంగా, నిజజీవితంలో ఆడవాళ్ళు మార్కెట్లో మునక్కాయలు కొనడానికే భయపడిపోయారు! ఏమ్మా... అయ్యగారికా?' అంటూ కూరగాయలమ్మేవాళ్ళు జోక్సు వేయడం ప్రారంభించారు ఇది కథకాదు, యదార్థం!

"ఈ మునక్కాయలూ, కాకరకాయలూ నాకెందుకు? వెళ్ళి కూరవండుకో!" హారతి ఎగతాళిగా అంది.

"అశ్లీల సంబంధమైన, బూతు సంబంధమైన కళారూపాలు నిజజీవితంలో పీడించి అవమానించేది ఆడదాన్నే అని చెప్పడానికి ఈ ఉదాహరణ చెప్పాను! స్త్రీ పురుషుల శృంగార జీవితానికి సంబంధించినదంతా రహస్యంగా ఉండాలి! తల్లిదండ్రుల శృంగార జీవితం పిల్లలకి తెలియాల్సిన పనిలేదు! కూతురూ అల్లుళ్ళ శృంగార జీవితం తల్లిదండ్రులకీ, కొడుకూ కోడళ్ళ ఏకాంతం అత్తమామలకీ, చెల్లెలి శృంగార జీవితం అన్నకీ, అన్న శృంగార జీవితం చెల్లికీ తెలియాల్సిన అవసరంలేదు. తెలియకూడదు! అందరి





శృంగార జీవితాల్నీ అందరికీ తెలిసేలా చేయ డానికి కళల్ని ఉపయోగించుకోవడం నేరం!" అంది.

హారతి నవ్వు సహజకి అద్భుతగిలింది, "శృంగార జీవితం అన్నది అందరిదీ! అది అందరికీ తెలుసు! ఈ నగ్నసత్యం నీకు తెలీదు!"

"అలాగా! అయితే నీ శృంగార జీవితం నాకు తెలుసు, నలుగురికీ తెలుసు! నలుగుర్నీ నీ బెడ్‌రూమ్‌లోకి తీసుకొస్తాను. మా సమక్షంలో నీ పాత్రల్ని వివస్త్రలు చేసినట్టు నువ్వు వివస్త్ర కాగలవా? నీ పాత్రలు, నీ స్త్రీ పాత్రలు జరిపే విధంగా నీ భర్తతో లైంగిక కార్యం నెరపగలవా? నీ భర్తచేత చేయించగలవా? నీ పాత్రలచేత నువ్వు జరిపించే నిషిద్ధ శృంగార ప్రక్రియల్ని ప్రదర్శించగలవా? పోనీ, కనీసం నీ కూతురిముందు నీ భర్తని కౌగిలించుకుని, ముద్దెట్టుకోగలవా?"

"దిసీజ్ టూమచ్! దిసీజ్...!" హారతి ఆగ్రహంతో అరిచింది.

"హారతీ, నీ మెగా సీరియల్ నగ్నహృదయంద్వారా నువ్వేం చేస్తున్నావో, నీకు నువ్వే ఏం చేసుకుంటున్నావో తెలుసా?" సహజ ప్రశ్నించింది. "నిన్ను నువ్వు వివస్త్రగా చేసుకుంటున్నావు. నీ లైంగికానుభవాన్ని నువ్వు సృష్టించే స్త్రీ పాత్రద్వారా వ్యక్తంచేస్తున్నావు! ఏకాంతంలో, పడగ్గదిలో నీ భర్త నీతో ప్రవర్తించే విధానాన్ని అనుకోకుండా, అసంకల్పితంగా అందరికీ చెప్తున్నావు..."

"నో! దిసీజ్ మ్యాడ్‌నెస్!" హారతి అరిచింది.

"యస్! అది మ్యాడ్‌నెస్ కాదు!" గుమ్మందగ్గర్నుంచి వినిపించిన పురుషకంఠం ఇద్దర్నీ ఉలిక్కిపడేలా చేసింది.

ఇద్దరూ తలలు తిప్పి చూశారు.

"మీరా..." హారతి అంది.

అపరిచిత వ్యకిని సహజ ఆశ్చర్యంగా చూస్తోంది. పొడుగ్గా, లావుగా ఉన్నాడతను. వెడల్పాటి మీసాలు, పైజమా జుబ్బా. నడుస్తూ కొద్దిగా తూలుతున్నాడతను.

"మైడియర్ ఇంటలెక్చువల్ వైఫ్! షి ఈజ్ రైట్!" అతను తూలుతూ వాళ్ళని సమీపించాడు. అతని చూపులు సహజమీద నిలిచాయి.

"అయామ్ శ్రీనాధ్! అన్‌ఫార్చునేట్ హస్బెండాఫ్ ఫేమస్ నావలిస్ట్ హా-రతి! వాటీజ్ యువర్ నేమ్ సిస్టర్?"

"సహజ"

"బ్యూటిఫుల్ నేమ్! అందుకే... చాలా సహజంగా మాట్లాడుతున్నావు సిస్టర్! గ్లాడ్ టూ నోయూ!"

"గ్లాడ్ టూ మీట్‌యు సర్"

"యస్! యూషుడ్‌బీ! ఫర్ దట్ మేటర్ ఎనీబడీ షుడ్‌బీ!" అతను నవ్వుతూ వెళ్ళి భార్య పక్కనే కూచున్నాడు.

హారతి అతనివైపు రౌద్రంగా, అయిష్టంగా చూస్తోంది. శ్రీనాధ్ ఆమెని నిర్లక్ష్యంచేస్తూ సహజవైపు చూశాడు.

"మిస్ సహజా... చాలా సేపట్నుంచి తలుపవతల నిలబడి, నా బెటర్ హాఫ్‌కి-అయామ్ సారీ... నా వర్స్-హాఫ్‌కి గడ్డిపెడుతూ నువ్వు చెప్పిందంతా విన్నాను. నీ మాటల్తో సంపూర్ణంగా ఏకీభవిస్తున్నాను!" అన్నాడతను.

"మీరెళ్ళి పడుకోండి! తాగి, ముక్కూమొహం తెలియనిదాని సమక్షంలో నన్ను అవమానిస్తే ఊరుకోను!" హారతి భర్తను గద్దించింది.

శ్రీనాధ్ క్షణకాలం ఆమెవైపే తీక్షణంగా చూశాడు. మెల్లిగా నవ్వాడు. "తాగానా? యస్! తాగాను! ఎందుకు తాగాను? ఎవరి మూలంగా తాగుడు నేర్చుకున్నాను? నీ మూలంగా!"

"మీరు చేసే వెధవపనికి నన్నెందుకంటారు?"

"నేను తాగడానికి కారణం నువ్వే!"

శ్రీనాధ్ గది అదిరిపోయేలా అరిచాడు. "రచయిత్రిగా ఆకాశంలోకి ఎగిరిపోవాలన్న తీటతో నువ్వు నా ప్రైవేట్ లైఫ్‌ని కాగితాలమీదికి ఎక్కించి అమ్మేస్తున్నావ్! ఇందాకా... ఎవరు? ఆ... సహజ, సహజ చెప్పినట్టు ఏకాంతంలో నీతో నేను... ప్రవర్తించే విధానాన్ని... దండోరా వేస్తున్నావ్! మనిద్దరి ఎక్స్‌పీరియన్స్‌ని నీ రచన అనే చెత్తబుట్టలోకి దింపేస్తున్నావ్! నీ స్వానుభవాన్ని నీ ఫిక్షనల్ పాత్రలకి అందిస్తూ, నువ్వు బూతురాస్తున్నావ్!"

"మీకు మతిపోయింది... మీకు...?"

"షటప్! రచయితలూ, రచయిత్రులూ అనుభవాన్ని ఆధారంగా చేసుకునే రాస్తారు! నీ పంచేంద్రియాల అనుభవానికి వచ్చినదాన్నే నువ్వు కల్పనలో వ్యక్తం చేయగలవ్! ఫిక్షన్‌కి ఆధారం ఫ్యాక్టే! బజార్లో నన్ను చూసి జనం ఏమంటున్నారో తెలుసా?

"వీడే... బూతురాసే హారతి మొగుడు వెధవ! వీడు చేస్తాడు, అది రాస్తుంది! ఎలా వుంది?" శ్రీనాధ్ వెటకారంగా అడిగాడు.

"ఇది అన్యాయం! అబద్ధం! వేలకొద్దీ పాఠకులు నా రచనల్ని మెచ్చుకుంటూ ఉత్తరాలు, విడవకుండా రాస్తున్నారు! తెలుసా?"

శ్రీనాధ్ గొల్లున నవ్వాడు. "ఉత్తరాల శీర్షిక! నీ బూతుపురాణం ప్రింట్ చేస్తూ ప్రూఫులుదిద్దే మేధావులే ఉత్తరాల శీర్షికల్ని కల్పిత నామధేయాలతో నింపుతూ వుంటారని నాకు తెలీదనుకున్నావా? నీకు ఇంకో సత్యం తెలుసా? నీ అశ్లీల సాహిత్యాన్ని చదివిన వాళ్ళే- ఆ తరువాత నిన్నూ, నీ పర్సనల్ జీవితాన్నీ తిడుతూ, బూతులు మాట్లాడతారు!"

"డోంట్ టాక్ రబ్బిష్!" హారతి హూంకరించింది.

అంతసేపూ శ్రీనాధ్‌నే ఆశ్చర్యంగా చూస్తూ వుండిపోయిన సహజ హారతివైపు తిరిగింది. "ఆత్మవంచన చేసుకోకు! అర్థంచేసుకో! అసభ్యసాహిత్యం మూలంగా సమాజంలో విపరీత పరిణామాలు ఏర్పడతాయి. ఏర్పడుతున్నాయి! లైంగిక నేరాలు ఎక్కువైపోతున్నాయి! బలహీనులు అశ్లీల సాహిత్య ప్రభావానికి బలైపోయి, వావివరసలు విస్మరిస్తున్నారు! అక్షరాల చిత్రాలలో తను దర్శించిన కల్పిత పాత్ర శరీరాన్ని తల్చుకుంటూ, భార్యలతో దాంపత్యం నెరపి, మానసిక వ్యభిచారం చేస్తున్నారు! వీటన్నింటి ఫలితంగా నష్టపోయేది మరెవరో, మరెవరో కాదు, స్త్రీ! విలువని కోల్పోయేది స్త్రీ! గౌరవాన్ని కోల్పోయేది స్త్రీ! తట్టుకోలేక ప్రాణాలు కోల్పోయేదీ స్త్రీయే!

"స్త్రీ అయిన నువ్వు నీ సంప్రదాయాన్ని ఈ తరంలో రికార్డుచేసి, ముందుతరాలకి అందించు! సంస్కృతిని ప్రతిబింబించు! సాహిత్యం ద్వారా నువ్వు అందించాల్సింది, ఇతర కళలద్వారా అందించాల్సింది శృంగారం కాదు, బూతుకాదు, విశృంఖల ప్రవర్తన కాదు! పరంపరగా వస్తున్న, రావాల్సిన సంప్రదాయాల్ని, సంస్కృతిని! నువ్వు శృంగారం రాయకపోతే మనిషికి అది తెలీకుండా పోదు! నీ రాతలు చదవని నిరక్షరాస్యులు కూడా దాంపత్యం నెరపి పిల్లల్ని కంటారు! ఆహార నిద్రామైధునాలు మనిషికి పుట్టుకతో వస్తాయి! అదే నువ్వు చెప్పకపోతే, రాయకపోతే పండుగరోజు తలంటుపోసుకోవాలనీ, ఇంటిని అలంకరించాలనీ, నీ పిల్లలకి, వచ్చే తరానికి తెలీదు! రచయిత్రిగా ఈ బాధ్యతని గుర్తించు!"

"వెల్‌సెడ్!" శ్రీనాధ్ కల్పించుకుని అన్నాడు. "ఎంత బాగా చెప్పినా రచయిత్రి హారతి గారికి అలాంటివి అర్థంకావు! అర్థం అయితే, ఆవిడ వ్యక్తిగత దాంపత్య జీవితాన్ని బజారుపాలు చేయదు! నన్ను సాటి మగవాళ్ళలో అవమానాల పాలు చేయదు? అందుకేగా మనం ఇవాళ చారిత్రాత్మకమైన నిర్ణయం తీసుకున్నాం!"

హారతి అతనివైపు అనుమానంగా చూసింది, "మీరేం మాట్లాడుతున్నారో మీకు





తెలీదు... నేను... మీతో నా అనుభవాన్ని బట్టబయలు చేయలేదు!"

"నోర్మూయ్! నా బెడ్‌రూమ్ లైఫ్‌ని నువ్వు బట్టబయలు చేయలేదా? అయితే మరెవరితో పొందిన అనుభవాన్ని ఆధారం చేసుకుని రాస్తున్నావ్! పెళ్ళి కాకముందు రాసిన కథల్లో శృంగారం రాశావా? కేవలం ప్రేమ గురించే రాశావ్! కేవలం 'లాంగ్వేజ్ ఆఫ్ హార్ట్'తో రాశావు! పెళ్ళయ్యాక 'హార్ట్'ని మరిచిపోయి, 'బాడీ'ని మాత్రం గుర్తుంచుకుని 'బాడీ లాంగ్వేజ్'తో రాస్తున్నావ్! ఎందుకు? ఎందుకో చెప్పు!" శ్రీనాధ్ హుూంకరించాడు.

హారతి గుడ్లు మిటకరించింది. సహజ ఆమెవైపు చిరునవ్వుతో చూస్తోంది.

"నేను చెప్తాను, మైడియర్ అర్ధాంగీ!" శ్రీనాధ్ వెటకారంగా అన్నాడు. "పెళ్ళికి పూర్వం నీకు- కాశీరాజు భార్యలతో అనుభూతి పొందకపూర్వం ఆదిశంకరాచార్యులకి మల్లే శృంగారానుభవంలేదు! పెళ్ళయ్యాక ప్రాక్టికల్ అనుభవం సంపాదించే అవకాశం నీకు లభించింది! ఆ అనుభవాన్ని నీభర్తగా నీలో సగం అయిన నేను అందించాను! స్త్రీ, పురుష శరీరాంగాలు పరస్పరం ఏమేమి ఇస్తాయో, ఏమేమి పుచ్చుకుంటాయో నీకు అవగాహన అయ్యింది. తన అనుభవాన్ని నీ శరీరం నీ మేధస్సుకు సప్లై చేసింది. దాన్ని నువ్వు సిగ్గూ, బిడియం, బాధ్యతా, పరువూ ఏమీలేకుండా కాగితాలమీద రాస్తూ, రాసులు పోస్తున్నావ్! ఆవిధంగా నా రహస్య దాంపత్య జీవితాన్ని అందరికీ చూపిస్తున్నావ్! ఆ దారుణాన్ని ఇంక నేను అనుమతించను!

"సీరియల్స్‌లో, నవలల్లో బరితెగించి రాసే ఆబిచ్ లేదూ... దాని మొగుడు వీడే అంటూ అందరిచేతా అనిపించుకోను! సహజ మాటలు నిన్ను ఎడ్యుకేట్ చేశాయో లేదో నాకు తెలీదు, నన్ను ఎంతగానో ఎడ్యుకేట్ చేశాయి! అందుకే హిస్టారికల్ డెసిషన్ తీసుకున్నాను! నా భార్య స్థానం నుండీ, నా 'బెడ్‌రూమ్'నుండీ నిన్ను తొలగిస్తాను, శాశ్వతంగా!"

"నో!" హారతి కంగారుగా అరిచింది.

సహజ విస్తుపోతూ శ్రీనాధ్‌వైపు చూసింది.

"యూ నో మైడియర్ హా-రతీ! 'బూతు రచనల ద్వారా నా ప్రైవేట్ లైఫ్‌ని బహిర్గతం చేస్తూ, నా మోడస్టీని మంటకలుపుతున్న నా భార్యనుండి నాకు విడాకులు ఇప్పించండి' అని కోర్టుని ఆశ్రయిస్తాను!"

"ఈ... ఈ... దీని మాటలు విని నాకు ద్రోహం చేస్తారా?" హారతి వణికే కంఠస్వరంతో ప్రశ్నించింది.

"ద్రోహం!" శ్రీనాధ్ వికటంగా నవ్వాడు. "అశ్లీల సాహిత్యం రాస్తూ సమాజానికీ, సంస్కృతికీ నువ్వు చేస్తున్న ద్రోహం ముందు, సహజ చెప్తున్నట్టు స్త్రీ జాతికి నువ్వు చేస్తున్న ద్రోహం ముందు నేను చేసేది ద్రోహం కాదు! రచయిత్రి కాకుండా, బూతు రచయిత్రి కాకుండా నిన్ను ఆపలేకపోయాను! ఇప్పుడూ ఆపను! నేను ఎలాగూ మరో నిజమైన ఆడదాన్ని పెళ్ళిచేసుకుంటాను! నువ్వూ నీకు తగిన వాణ్ణి చేసుకో! నీలాగే బూతురాస్తున్న రచయిత త్రివిక్రమరావులాంటి వాణ్ణి కట్టుకో! కొత్త అనుభవాలతో కొత్త రచనలు పుట్టించొచ్చు, ఇద్దరూ!"

"నో! నన్ను... అన్యాయం చేయకండి'' హారతి అతని దగ్గరగా వెళ్తూ అంది. ఆందోళనతో, భయంతో కంపిస్తూ, భర్తనే ప్రాధేయపూర్వకంగా చూస్తున్న హారతిని చూస్తూ సహజ చిరునవ్వు నవ్వుకుంది.

"శ్రీనాధ్‌గారూ... ఇంతకాలం మీ భార్యను విచ్చలవిడిగా వదిలేసి మీరు పొరపాటుచేశారు. ఇప్పుడు దిద్దుకుంటున్నారు! అలాగే చేసిన పొరపాటుని దిద్దుకునే అవకాశం ఆమెకీ ఇవ్వొచ్చుగా?" సహజ ప్రశ్నించింది.

శ్రీనాధ్ ఆమెవైపు తీక్షణంగా చూశాడు, "అది నువ్వు అడగాల్సిన ప్రశ్నకాదు, సహజా!"



తనవైపు ఆశ్చర్యంతో చూస్తున్న హారతి మొహంలోకి సహజ చిరునవ్వుతో చూసింది. "చూశావా! బరితెగించి భర్తల్ని తోసిపారేసే బరితెగించిన స్త్రీ పాత్రల్ని సెక్సు రచనల పేరుతో సృష్టించావు! సందర్భం వచ్చేసరికి, నీముందే సమస్య నిలిచేసరికి బరితెగించలేకుండా వున్నావ్! రచన వేరు, జీవితం వేరు, కళ వేరు, జీవితం వేరు అనుకోడంవల్లే నువ్వు ఇలా ప్రవర్తిస్తున్నావు! వేడెక్కిన శరీరాన్ని మరిచిపోయి, 'బాడీలాంగ్వేజి'ని మరిచిపోయి హృదయభాషతో నీ భర్తతో మాట్లాడు!"

హారతి కళ్ళు దించుకుంది. ఆమె తల మెల్లిగా భర్తవైపు తిరిగింది. వణికే కంఠంతో ఆమె తన 'హృదయభాష'తో మాట్లాడ్డం ప్రారంభించింది. సహజ కుర్చీలో కూచుని హారతి ప్రార్థనల్నీ, శపథాల్నీ వినసాగింది. మాట్లాడ్డం ముగించిన హారతి, వణుకుతున్న చేత్తో భర్త చేతిని పట్టుకుంది.

శ్రీనాధ్ భార్య మొహంలోకి అనుమానంగా, దేనికోసమో వెతుకుతూ చూశాడు

"నమ్మమంటావా?"

"ప్లీజ్! నన్ను నమ్మండి! ఈ క్షణంనుండీ అలాంటి రచనలు చేయను"

"విడాకుల భయంతోనా?"

"కాదు, కానేకాదు!" హారతి ఉద్వేగంతో అంది. "అనాలోచితంగా రచనలు చేస్తూ స్త్రీజాతికి ఎంత అన్యాయం చేస్తున్నానో, నాకు నేనే ఎంత అన్యాయం చేసుకున్నానో అర్థంచేసుకున్నాను. ఇకనుంచీ అశ్లీలరచనలు చేయను! నన్ను నమ్మండి!"

"ఆ విషయం చెప్పాల్సింది నాకు కాదు!" శ్రీనాధ్ గంభీరంగా అన్నాడు. టేబుల్‌మీద వున్న రిసీవర్ అందుకున్నాడు. డయల్ చేశాడు.

"నేను...! నగ్నహృదయం హారతి మొగుణ్ణి! మా ఆవిడ మాట్లాడుతుంది!" అంటూ అరచేత్తో మౌత్‌పీస్‌ని మూశాడు.

"మహతి పత్రిక ఎడిటర్ రవిచంద్ర. ఏవో రచనలు చేయనన్నావుగా! ఆ విషయం అతనికి చెప్పు! మాట్లాడు!" అంటూ రిసీవర్ అందించాడు.

హారతి మాట్లాడ్డం ప్రారంభించింది...

"నథింగ్ డూయింగ్! సీరియల్ కాదు. నా పేరు కూడా మీ పత్రికలో అచ్చువడాన్ని నేను అనుమతించను. ప్రింటయిపోయుంటే మరేం ఫర్వాలేదు. నాలుగు పేజీలే. కాల్చిపారేయ్. నాలుగు పేజీలు తక్కువైతే నీ పాఠకులు సమ్మె చేయరు"

"........."

"నిరభ్యంతరంగా వెళ్లు. కోర్టంటే నాకేం భయంలేదు. నా సీరియల్ పూర్తిగా రాసిస్తానని నీకు అగ్రిమెంట్ రాసివ్వలేదు. రాసిఇచ్చివున్నా నేను కేర్ చేయను. బూతు రాయడం ఇష్టంలేదని కోర్టులో చెప్తాను. ఆడదాని మోడీస్టీనీ ఆడదాని చేతే రేప్ చేయించే ప్రయత్నంలో నువ్వు నాచేత రాయిస్తున్న సీరియల్‌ని ఈ వారంనుంచీ ఆపకపోతే నేనే నీమీదా, నీ పత్రికమీదా కోర్టుకెళ్తాను" రిసీవర్ని ఫోన్‌మీద కుక్కి హారతి భర్తవైపు చూసింది.

"థాంక్యూ వెరీమచ్ మిసెస్ హారతీ!" సహజ లేచి నిలబడి అంది.

"థాంక్యూ సహజా! ఇవాళా రేపూ పత్రికల్లో రాజ్యంచేస్తున్న ట్రెండ్‌ని చూస్తూ, నా స్త్రీత్వాన్నీ, నా బాధ్యతనూ విస్మరించి నా కలంతో స్త్రీత్వాన్ని గాయపరిచాను. నీ విశ్లేషణ నన్ను మత్తు నిద్రనుండి లేపి, ఇన్‌స్పైర్ చేసింది. మాట ఇస్తున్నాను. నేనూ నీలాగా కృషిచేస్తాను. విశృంఖల శృంగారం రాస్తున్న ఒక రచయితని. కనీసం ఒక రచయితనేనా దారి మళ్ళిస్తాను. నా టాలెంట్‌ని స్త్రీ జాతి అభ్యున్నతికోసం ఉపయోగిస్తాననీ, అసభ్యరచనలు చేయననీ రేపే పత్రికాముఖంగా స్త్రీ జాతికి తెలియజేస్తాను" అంటూ సహజను దగ్గరగా లాక్కొని కౌగిలించుకుంది హారతి.




"వెళ్ళొస్తానండీ'' సహజ ఇద్దరికీ చెప్పి గుమ్మంవైపు నడవసాగింది.

"సహజా..."

శ్రీనాథ్ పిలుపు సహజని ఆపి, వెనక్కితిప్పింది. ఆమె అతనివైపు ప్రశ్నార్థకంగా చూసింది.

"థాంక్యూ క్రూసేడర్' శ్రీనాథ్ నవ్వుతూ అన్నాడు.



హారతి ఇంట్లోంచి ఇవతలకి వచ్చిన సహజ హాయిగా ఊపిరి పీల్చుకుంది. ఏదో యుద్ధరంగంలోంచి ప్రశాంత వాతావరణంలోకి వచ్చినట్టనిపిస్తోందామెకి. ఇరవై అడుగుల దూరంలో రోడ్డుపక్కనే వున్న చెట్టుకింద, ఆపిన స్కూటర్ పక్కన నిలబడ్డ ఉత్తమ్‌కుమార్ని చూసి ఆశ్చర్యపోయింది సహజ.

"హలో!" అన్నాడు ఉత్తమ్‌కుమార్.

"ఎవరికోసం ఇక్కడ మాటువేశారు?" సహజ నవ్వుతూ అడిగింది.

"మీ కోసమే''

సహజ అతన్ని ఆశ్చర్యంగా చూసింది. "అబద్ధాలాడకండి. నేను ఇక్కడికి వస్తానని మీకెలా తెలుసు?"

"మీరు ఎక్కడికెళ్ళారో తెలుసు కాబట్టి''

"నేను ఎక్కడికెళ్ళానో ఎవ్వరికీ తెలీదు. నేను చెప్పలేదు'' సహజ నవ్వుతూ అంది.

"ఎవరో చెప్తే నేను వినలేదు. చూశాను. మీకోసం మీ ఇంటికెళ్లాను. నిమిషం కిందటే బైటికెళ్ళినట్టు కనుక్కున్నాను. రోడ్డుమలుపు దగ్గరకొచ్చాను. మీరు లాంగ్‌షాట్‌లో ఆటో ఎక్కుతూంటే చూశాను. ఫాలో చేశాను. ఇన్వెస్టిగేటింగ్ జర్నలిజం! ట్రాఫిక్ సిగ్నల్ మీ ఆటోనుండి నా స్కూటర్ని దూరం చేసింది. ఇక్కడికి వచ్చేసరికి మీరు ఆ ఇంట్లోకెళ్తూ కనిపించారు''

"ఆ ఇల్లు ఎవరిదో తెలుసా?"

"ఇక్కడ ఆగినప్పుడు తెలీదు. ఇప్పుడు తెలుసు. తెలుసుకున్నాను. ఇన్వెస్టిగేషన్! మెగా సీరియల్ ఆఫ్ 'నైన్‌టీఫైవ్ నగ్నహృదయం' రచయిత్రి హారతిగారు దొరికారా?" ఉత్తమ్‌కుమార్ నవ్వుతూ అడిగాడు. "ఆమె మీ ఫ్రెండా?"

"డియరెస్ట్..." సహజ నవ్వింది.

"ఓహ్... అలిసిపోయినట్టున్నారు. మీ కోసం వెయిట్‌చేసి, చేసి నేనూ అలిసిపోయాను. హోటల్‌లో కాఫీ?"

"కాఫీ తాగాలి... ఇంటికెళ్ళి..."

"కాఫీతాగి, ఇంటికెళ్దాం. నా స్కూటర్లో దిగబెడతాను. రండి'' అంటూ ఉత్తమ్‌కుమార్ స్కూటర్ స్టార్ట్ చేశాడు.

హోటల్‌లోని కేబిన్‌లో కూర్చున్నాక ఉత్తమ్‌కుమార్ రసగుల్లా ఆర్డరిచ్చాడు.

"థాంక్స్..." అంది సహజ.

"రసగుల్లాకా?"

"కాదు. అనుకుంటూండగానే ప్రత్యక్షమైనందుకు''

ఉత్తమ్‌కుమార్ ఆశ్చర్యంగా చూశాడు. సహజ తనని తలచుకుందా? అలా అడపాదడపా తలచుకుంటూ ఉంటుందా? "నిజం? నిజంగా నన్ను తలచుకున్నారా?"

"నిజమే! అబద్ధాలెందుకాడతాను?"

"థాంక్యూ! అయామ్ హ్యాపీ!" ఉత్తమ్‌కుమార్ ఆనందంగా అన్నాడు. "చెప్పండి. ఏదీకానివేళ, ఏదీకానిచోట నేనెందుకు గుర్తొచ్చాను?"

"రచయిత్రి హారతి రేపు మీకు 'ముఖాముఖి' ఇస్తోంది'' సహజ నవ్వుతూ అంది. "మిమ్మల్ని పంపిస్తానని నేనే సజెస్ట్ చేశాను. మిమ్మల్ని ఎలా పట్టాలా అని ఆలోచిస్తూ మీ గురించి అనుకున్నాను''

"ముఖాముఖా? హారితితోనా? ఎందుకటా?"

"ఆమె ఒక చారిత్రాత్మకమైన నిర్ణయం తీసుకుంది. ఇంటర్వ్యూలో ఆ నిర్ణయం అనౌన్స్‌మెంట్ ప్రధానాంశంగా..."

"ఏమిటా నిర్ణయం?"

"రచయిత్రి హారతి మెగాసీరియల్ ఆఫ్ నైన్‌టీన్ నైన్‌టీఫైవ్ రాయడం మానేస్తోంది''

"వాట్!?" ఉత్తమ్‌కుమార్ అరిచాడు.

"సెక్స్ రచనలు చేయ్యనంటూ ఒట్టేసుకుంది కూడా. స్త్రీజాతి అభ్యున్నతికి తన కలాన్ని అంకితం చేస్తూ శపథం..."

"సహజా..." ఉత్తమ్‌కుమార్ ఉద్రేకంతో పిలిచాడు.

సహజ అతన్ని నవ్వుతూ చూసింది.

"అనదర్ అచీవ్‌మెంట్ ఇన్ యువర్ కల్చరల్ క్రూసేడ్?"

"మీరు అలా అనుకుంటే నాకు అభ్యంతరం లేదు''

"థౌజండ్ కంగ్రాట్స్'' ఉత్తమ్‌కుమార్ అన్నాడు. "ఎట్లా? ఎట్లా సాధించారు? నంబర్ వన్ రచయిత్రిగా ఆమెని ఆకాశానికెత్తేస్తున్న సీరియల్‌ని మధ్యలో ఆపించడం. ఐ కాంట్ బిలీవ్''

"నేను బాగా కొలిమిలో పెట్టి, కాల్చి వేడిచేశాను. ఆమె భర్త శ్రీనాథ్ గజబలంతో నాలుగు సమ్మెటదెబ్బలు తగిలించాడు. ముడిలోహం నగలా మారిపోయింది''

రసగుల్లాలు వచ్చాయి. సహజ చెప్పసాగింది. ఉత్తమ్‌కుమార్ రసగుల్లాని పూర్తిగా మరిచిపోయి వినసాగేడు. తన కథనం పూర్తిచేసి, సహజ కాఫీ కప్పు అందుకుంది.

"ఆరోజు- మహిళా యూనివర్సిటీలో 'మహతి' పత్రిక దహనం జరిగినరోజు మహతి లాంటి పత్రికల్లో వచ్చే అశ్లీల సాహిత్యాన్ని అరికట్టడానికి కొమ్మలు నరికేది కాకుండా మరో ఫార్ములా ఏదో మీ దగ్గర ఉండివుండాలని నేను అన్నాను. గుర్తుందా?" ఉత్తమ్‌కుమార్ అడిగాడు.

"ఎందుకు గుర్తులేదు?"

"రాసేవాళ్లే లేకపోతే, వేసేవాళ్లూ, చూసేవాళ్లూ ఉండరన్న మౌలిక సూత్రమే మీ ఆలోచన. అంతేగా? అదేగా మీ ఫార్ములా?"

"కరెక్ట్''

"మిస్ సహజా... మీ ఆలోచనా సరళిలోని సిన్సియారిటీకి జోహార్లు. పదండి. మిమ్మల్ని ఇంటి దగ్గర దింపి, ఇంటికెళ్లి హారతితో ఇంటర్వ్యూకి ప్రిపేర్ అవుతాను'' అంటూ ఉత్తమ్‌కుమార్ పైకి లేచాడు.

★ ★ ★

ఓ ప్రముఖ దినపత్రికలో ప్రత్యక్షమైన ఆ ఆర్టికల్ చాలామందిని ఆశ్చర్యంలో ముంచేసింది.

'కల్చరల్ క్రూసేడర్' అనే శీర్షికతో అచ్చయిన ఆ ఆర్టికల్ సహజని పాఠకులకి సగర్వంగా పరిచయం చేసింది. కాత్యాయని అనే అబల నగ్నప్రదర్శనను ఒంటరిగా ప్రతిఘటించిన యువతిగా, మితిమీరిన శృంగారాన్ని ప్రచురించే పత్రికల్లో సాహిత్య అకాడెమీ అవార్డు పొందిన రచయిత్రి తన రచనలు నిలిపివేస్తూ ఆ రకం రచనలను బహిష్కరించడంలోని అజ్ఞాత ప్రేరణశక్తిగా సహజను ఆ వ్యాసం అభివర్ణించింది.

సాహితీ కళారంగాల్లో స్త్రీ సముచిత స్థానం





పొందితేగానీ, సమాజంలో ఆమెకి గౌరవం, సమానత్వం లభించవన్న మౌలిక సత్యాన్ని గుర్తించిన 'థింకర్'గా ఆమెని కొనియాడింది వ్యాసం. 1995 మెగాసీరియల్ అర్థాంతరంగా ఆగిపోవడానికీ, ఆ సీరియల్ రచయిత్రి శ్రీమతి హారతి అశ్లీలసాహిత్యం రచనకి మంగళహారతి పట్టేలా కృషిచేసి, సాధించిన సహజని ఆ వ్యాసం మిస్ టెంపెస్ట్‌గా అభివర్ణించింది.

'స్త్రీ సమస్యలకి సహజమైన పరిష్కారాల కోసం ఆలోచిస్తున్న మిస్ సహజ', 'అనుకున్నదాన్ని సాధించిన సహజ', 'తల్లిదండ్రులతో కల్చరల్ క్రూసేడర్' వగైరా క్యాప్షన్స్‌తో సహజ ఫోటోలు అచ్చయ్యాయి.

సహజ అభిప్రాయాలతో 'ఏకీభవిస్తున్న శ్రీమతి సమతాదేవి', క్యాప్షన్‌తో రచయిత్రి సమతాదేవి ఫోటో, 'అశ్లీల రచనలకి స్వస్తిపలకడంలోని ఘనత సహజదే అంటున్న రచయిత్రి హారతి' ఫోటో వ్యాసంలో అక్కడక్కడా వున్నాయి.

తమ స్నేహితురాలు సహజ ఇచ్చిన ఇన్స్పిరేషన్‌తో వరకట్నాన్ని నిరసిస్తున్నామనీ, కట్నం ఇవ్వాల్సివస్తే కన్యలుగానే వుండిపోతామనీ అంటున్న పరిమళ, భానుమతి ఫోటోలు. 'మిస్ టెంపెస్ట్ దారిలో ఉద్యమించడానికి నిశ్చయించుకున్న' విద్యార్థిని ఇందులేఖ ఫోటో. 'సహజవల్ల నా గౌరవం రక్షించబడింది' అంటున్న కాత్యాయని ఫోటో...

...వ్యాసాన్ని చదువుతున్న సహజలో ఏదో ఉత్సాహం, ఆనందం పందెం వేసుకుని పరుగులు తీస్తున్నాయి. ఆమెకి ఉత్తమ్‌కుమార్ గుర్తొస్తున్నాడు. ఆరోజు ఏదో పనిమీద ఎక్కడికో వెళ్తున్నవాడిలా వచ్చి, కెమేరాలో అయిదారు శ్నాప్స్ ఉన్నాయనీ, లాగేసి డెవలప్ చేయాలనీ యధాలాపంగా తమకి చెప్పి తననూ, తన తల్లిదండ్రుల్నీ ఫోటోలు తీసిన అతని ఉద్దేశం ఇప్పుడర్థమవుతోంది సహజకి. అప్రయత్నంగా ఆర్టికల్ కిందిభాగంలో చూసింది సహజ. వ్యాసం, ఇంటర్‌వ్యూని చదవసాగింది...

మహిళా యూనివర్సిటీ క్యాంపస్‌లో తనకి పరిచయం అయినరోజునుండీ ఉత్తమ్‌కుమార్ తనని అడిగి తెలుసుకున్న విషయాలూ, అభిప్రాయాలూ, 'ఇంటర్‌వ్యూ'లో ప్రశ్నోత్తరాలుగా మారి కనిపిస్తున్నాయి. హోటల్లో సాహిత్యం గురించీ, కళల గురించీ, స్త్రీ వ్యక్తిత్వాన్ని ఉన్నతంగా చిత్రించాల్సిన వాటి బాధ్యతల గురించీ తను చెప్పిన అంశాలు శక్తివంతమైన భాషలో జవాబులుగా ప్రత్యక్షమయ్యాయి ఆ కాలమ్స్‌లో. 'విజ్ఞులు ఆచరిస్తే సగటు మనుషులు అనుసరిస్తారు' అన్న తన తర్కం 'ముఖాముఖి'లో హైలైట్ చేయబడింది.

కొత్తపుంతలు తొక్కుతున్న ఆలోచనల్ని బలవంతంగా నిగ్రహించుకుంటూ సహజ తన గురించిన వ్యాసాన్నీ ముఖాముఖీనీ ఫోటోల్నీ చూపులతో పరామర్శించింది. ఆమె చూపులు అసంకల్పితంగా ఉత్తమ్ పేరుమీద నిలిచాయి.

ఉత్తమ్‌కుమార్‌కి ధన్యవాదాలు చెప్పాలనిపిస్తోందామెకి. ఆమెలో పుట్టిన ఆ సంకల్పం, పరావాక్కు, పశ్యంతివాక్కుగా మారి, మధ్యవాక్కుగా ఎదిగి అప్రయత్నంగా వైఖరీవాక్కుగా బైటపడింది.

అప్రయత్నంగా కదిలిన ఆమె పెదవులు "థాంక్యూ ఉత్తమ్!" అన్నాయి.

"ఫర్‌గెట్ ఇట్ సహజా!"

సహజ ఉలిక్కిపడింది. పైకెత్తి పట్టుకున్న పత్రికను తటాలున కిందికి దించింది. ఆమె గుండె ఎందుకో దడదడకొట్టుకుంది.

ఆమెవైపు నవ్వుతూ చూస్తూ ఎదురుగా నిలబడ్డాడు ఉత్తమ్‌కుమార్.

అప్రయత్నంగా సిగ్గుపడింది సహజ, ఏకాంతంలో వున్న తను అతని పేరు బిగ్గరగా పలికినందుకు "మీరా! ఎప్పుడొచ్చారు?"

"థాంక్యూ ఉత్తమ్! అనేసరికి సరిగ్గా ఇక్కడున్నాను"

"కూర్చోండి..."

ఉత్తమ్‌కుమార్ కూచున్నాడు. "ఎలా వుంది రైటప్, మిస్ టెంపెస్ట్?" నవ్వుతూ అడిగాడు.

సహజ సమాధానం చెప్పబోయేంతలో మెట్లమీద నవ్వులు కలగాపులగంగా ప్రతిధ్వనించాయి. పరిమళ, భానుమతి, ఇందులేఖ నవ్వుతూ గుమ్మందాటి లోపలికి వస్తున్నారు.

★ ★ ★

కాలం చాలా శక్తివంతమైంది. అది సముద్రాన్ని ఎడారిగా మారుస్తుంది. ఎడారిని సముద్రంగా మారుస్తుంది. అది మోడును చిగురింపజేస్తుంది. ఫలవృక్షాన్ని ఎండిస్తుంది.

కాలం తన తిరుగులేని ప్రభావాన్ని తన మీద చూపించింది. కాలం గురించి ఆలోచిస్తున్న సహజ లోపల్లోపలే నవ్వుకుంది. కాలం ఉత్తమ్‌కుమార్‌మీద కూడా తన తిరుగులేని ప్రభావాన్ని చూపించింది. పరిచితులై దూర దూరంగా వున్న తమని కాలం దగ్గరచేసింది.

"సహజా! ఏ లోకంలో వున్నావ్? ఇది మూడో పిలుపు!" ఐస్‌క్రీమ్ చేతుల్లో పట్టుకుని నిలుచున్న ఉత్తమ్‌కుమార్ నవ్వుతూ అన్నాడు.

సహజ కూచుని కిందపెట్టిన ఐస్‌క్రీమ్‌ని అందుకుంది.

"ఉత్తమ్, ఇవాళ మళ్లా నాలుగు ఉత్తరాలొచ్చాయి... కథలు, నవలలు, కవితలు, వ్యాసాలు ఏవైనా సరే రాసి పంపమంటూ..."

"రాకుండా వుంటాయా? మిస్ టెంపెస్ట్‌గా, కల్చరల్ క్రూసేడర్‌గా పత్రికల్లో దూరదర్శన్‌లో అందర్నీ అదరగొట్టేస్తున్నావుగా! అన్నట్టు తెలుసా? ఫెమినిస్ట్ పత్రికలో నెక్స్‌ట్ వీక్ నీ గురించి ఆర్టికల్ వస్తోంది. బ్యూటీవీ వాళ్లు వీడియో మ్యాగజిన్ కోసం నీతో ఇంటర్వ్యూ అరేంజ్ చేయగలరా అని అడిగారు!"

"ఈ రభసంతా నీ మూలాన్నే!" సహజ నవ్వుతూ అంది. "వాళ్లకి ఏం రాశావ్?"

"ఇప్పట్లో వీలుకాదు, నేను అనుమతించను అని రాసి పారేశాను!"

సహజ ఆశ్చర్యాన్నీ, ప్రశ్ననూ చూపులతో వ్యక్తం చేసింది. "ఏం?"

"అన్నిచోట్లా కీర్తిని నువ్వొక్కర్తివే కొట్టేయడం నాకు జెలసీ పుట్టించింది!"

"అలాగా!"

"యస్! ఇకనుంచీ నీ కీర్తిలో నాకూ సగం వాటా సంక్రమించాలి చట్టపరంగా!"

సహజ అతన్ని ఆశ్చర్యంగా చూసింది. ఉత్తమ్ పరోక్షంగా ప్రపోస్ చేస్తున్నాడా? ఇంత వరకూ తనని పెళ్లాడమని అతను నోరుతెరిచి అడగలేదు. "బిట్వీన్‌ది లైన్స్ చదవాలా నేను?" నవ్వుతూ అడిగింది.

"ఎందుకూ? నాకేం భయమా, అసలు మెసేజ్ రాయకుండా వదిలేయడానికి? బ్లాక్ అండ్ వైట్‌లో రాసేయాలని రాత్రే అనుకున్నా!" ఉత్తమ్ నవ్వుతూ అన్నాడు. తటాలున నవ్వు ఆపి ఉత్తమ్‌కుమార్ ఆమె కాటుక కళ్లల్లోకి లోతుగా చూశాడు. "సహజా... నీకష్టంలో, సుఖంలో కీర్తిలో నీ జీవితంలో నాకు సగభాగం కావాలి! రాత్రే మా అమ్మతో, నాన్నతో మాట్లాడేశాను. మాట్లాడేశాను అనడం కన్నా చెప్పేశాను అనడం కరెక్ట్! మీ అమ్మా నాన్నా..."

"ఉత్తమ్..." సహజ పిలుపు అతన్ని ఆపింది. "విద్యార్థినిగా వున్నప్పుడు ఒక ధ్యేయం పెట్టుకున్నాను, చదవాలని. చదువయ్యాక రచయిత్రి కావాలని కలలుకన్నాను. సంభవామి గృహేగృహే, ఉపక్రమణిక రాసి, ఆ ప్రేరణతో రచయిత్రిగా లిమిట్ అయిపోకూడదనీ, ప్రాక్టికల్‌గా ఏదో,ఎంతో సాధించాలనీ నిశ్చయించుకున్నాను... ఇంకా నా ప్రయత్నం పూర్తికాలేదు... పెళ్లి చేసుకుని, సంసారంలో సెటిల్ అయిపోతే..."

"నీ ధ్యేయాలూ సెటిల్ అయిపోతున్నా





యని భయపడుతున్నావ్ కదూ?" ఉత్తమ్ నవ్వుతూ అడిగాడు.

సహజ మాట్లాడకుండా చూసింది.

"సహజా, నీ ఆశయాల్ని సాధించడానికి పెళ్లి అడ్డుకాదు! ఒకవేళ ఎవరో ముక్కూ మొహం తెలీని వ్యక్తిని కట్టుకుంటే, నీ ధ్యేయాన్ని అర్థం చేసుకుని జీర్ణం చేసుకోలేక అతను నిన్ను సంసారంలో ఒదిగి, ఇమిడి పొమ్మనవచ్చు! కానీ కానీ' సహజా... నీకు తెలుసు. నీ ఆశయాలు నన్ను నీకు దగ్గర చేశాయి. నీ ఆశయసాధనలో నేను నా లిమిట్స్‌లో సపోర్ట్ అందిస్తూనే వున్నా, అందిస్తూనే వుంటా! నా కళ్లల్లోకి చూసి చెప్పు, నాతో పెళ్లి నీ ఆశయాలకి ఆనకట్ట వేస్తుందని నువ్వు అనుకుంటున్నావా?" ఉత్తమ్‌కుమార్ ఆమెవైపే రెప్పవేయకుండా చూస్తూ అడిగాడు.

అప్రయత్నంగా చిరునవ్వు నవ్వింది సహజ.

"చెప్పు సహజా!" ఉత్తమ్‌కుమార్ కంఠంలో ఆతృతా, ఆవేశం జంటస్వరాల్లా పలికాయి.

"ఏమిటి?" అర్థంకానట్టు ప్రశ్నించింది సహజ.

"అదే.. ఆనకట్ట... నాతో పెళ్లి..."

"జీవన ప్రవాహంలో హాయిగా మనల్ని తీసుకెళ్లడం తప్ప, ఆనకట్టలు వేయడం మన పెళ్లికి తెలీదనిపిస్తోంది, ఉత్తమ్..."

ఉత్తమ్‌కుమార్ ఆవేశంతో దగ్గరగా జరిగి, పచ్చికమీద బోర్లించిన సహజ చేతిమీద తన అరచేతిని బోర్లించాడు. అతని నరాల్లో ప్రవహిస్తున్న ప్రేమావేశాన్ని ఆమె చేతికి అతని చెయ్యి ధ్వని, లిపి లేని భాషలో నివేదిస్తోంది.

"అయితే... అయితే... మీ నాన్న అమ్మ..."

"మాట్లాడతాను... అయితే.. నాకు కొంత సమయం.. వ్యవధి ఇవ్వాలి నువ్వు..."

"ఎంత?" ఉత్తమ్‌కుమార్ ఉద్రేకంతో అడిగాడు. "రోజులా, వారాలా, నెలలా? లేక... లేక... సంవత్సరాలా?"

"ఉత్తమ్.. నేను చెప్పలేను. నాకే తెలీదు... కాలం మనల్ని కలిపింది. మన మధ్య దూరాన్ని దూరం చేసింది. ఇద్దర్నీ ఒక్కరిగా ఎప్పుడు చేస్తుందో ఆ కాలానికే తెలియాలి!"

సహజ పైకి లేచింది...

★ ★ ★

"సహజా!"

"ఏమిటి నాన్నా?" వంటగదిలో తల్లితో ఆడుతున్న కబుర్లకి ఫుల్‌స్టాప్ పెట్టి హాల్లోకి వస్తూ అడిగింది సహజ.

"ఇలా కూర్చో... నీతో మాట్లాడాలి" కళ్లద్దాలు తీసి టీపాయ్ మీద పెడ్తూ అన్నాడు శ్రీమంతరావు. సహజ కూచుని, ప్రశ్నార్థకంగా చూసింది.

"పత్రికల్లో పేపర్లలో పబ్లిసిటీ, టీవీల్లో రేడియోల్లో పరిచయాలూ పొగడ్తలూ ఇలాంటివి ఎన్నివున్నా జీవితానికి పరిపూర్ణత రాదమ్మా"

"వేదాంతమా నాన్నా?" తండ్రి ఉపోద్ఘాతం అర్థంకాని సహజ హాస్యం టచ్ ఇస్తూ అడిగింది.

శ్రీమంతరావు చిన్నగా నవ్వాడు. "వేదాంతం కాదు, జీవితం! లైఫ్ ఈజే హార్డ్ ఫ్యాక్ట్! మనిషి జీవితంలో స్థిరపడితేగానీ, సంఘం పట్టే గొడుగులకి విలువవుండదు! జీవితంలో స్థిరపడ్డాక పబ్లిసిటీ వస్తే ఫేమస్ అవుతాం, స్థిరపడకపోతే ఆ పబ్లిసిటీవల్లే నొటోరియస్ అవుతాం"

సహజ కొద్దిగా ఆశ్చర్యపోతూ, తండ్రిమొహంలోకి వెతుకుతూ చూసింది.

"అదంతా ఎందుకమ్మాయ్!" భర్తకు మాట్లాడే ఇబ్బంది తప్పిస్తూ అంది అమృతమ్మ. "ఇవాళ కాకపోతే రేపేనా పెళ్లి చేసుకోవాలిగా! ఇంటిపట్టున ఉండి, వంటావార్పూ నేర్చుకో. రేపొద్దున అత్తారింట్లో వంటనేర్పలేదని నన్ను ఆడిపోసుకుంటారు!"



తనకి చెప్పలేకా, చెప్పి బాధపెట్టలేకా, దాచుకోలేకా అవస్థపడుతున్న తల్లిదండ్రుల్ని చూస్తూంటే సహజకి నవ్వొచ్చింది.

"ఇంతకీ నువ్వు పెళ్లి చేసుకుంటావాలేదా? నేను చెప్పేదాకా సంబంధం చూడవద్దంటూ ఆంక్షపెట్టావుగా! చెప్పు! ఇప్పుడేనా చూడమంటావా?" కూతుర్ని గద్దించిందామె.

"ఎవరికండీ పెళ్లి? నాతో చెప్పకుండా!" అప్పుడే లోపలికొస్తున్న ఉత్తమ్‌కుమార్ నవ్వుతూ అడిగాడు.

సరిగ్గా సమయానికి ఊడిపడిన ఉత్తమ్‌కుమార్‌ని ఓరగా చూసింది సహజ. తన తల్లీ, అతనూ కూడబలుక్కున్నారా, తన పెళ్లి గురించి?

"ఎవరికో ఏం చేయగలం నాయనా! మా ఆయనకే. షష్టిపూర్తి పెళ్లి చేద్దామా అని ఆలోచిస్తున్నాం!" అమృతమ్మ తన ఉక్రోషాన్ని సహజ మీద సానబట్టింది.

"అలాగా! కంగ్రాచ్యులేషన్సండీ! అరవైలో ఎప్పుడు అడుగుపెడ్తున్నారు?" సహజ ఎదురుగా కూచుంటూ శ్రీమంతరావుని ప్రశ్నించాడు ఉత్తమ్‌కుమార్

"పోయిన వారమే అడుగు పెట్టేశానోయ్! కూతురి పెళ్లి చేయలేదని ఆవిడగారి అక్కసు!",

"ఉండదాండీ మరి!" ఓరగా సహజను చూస్తూ అన్నాడు ఉత్తమ్‌కుమార్.

"అలా చెప్పు నాయనా! పెళ్లి అనేసరికి ఇద్దరూ కూడబలుక్కున్నట్టు అందీఅందకుండా మాట్లాడతారు! ఈవిడగారేమో తను అనుకున్నవెన్నో ఇంకా సాధించాలట! ఆయనగారేమో అమ్మాయి ఎప్పుడంటే అప్పుడే అంటూ దానికి తాళం వేస్తూ, నానోటికి తాళం వేస్తారు!"

"తను కంకణం కట్టుకున్న విధంగా ఆడవా




ళ్ల అభ్యున్నతికోసం కొత్తదారిలో ఎంతో సాధించింది. చాలామంది సహజ ఇచ్చిన ఇన్స్పిరేషన్‌తో కృషి చేస్తున్నారు! ఇరుగుపొరుగు రాష్ట్రాలైన కర్నాటక, తమిళనాడులోని స్త్రీ విమోచనా సంస్థలు సహజ మార్గాన్నే అడాప్ట్ చేసుకున్నాయి! ఉత్తరాదిలో కూడా మిస్ టెంపెస్ట్‌వేవ్ స్టార్ట్ అయ్యింది! ఇంకా ఏంచేయాలి?" సహజవైపు ఓరగా చూస్తూ, అమృతమ్మను రెచ్చగొడుతూ అన్నాడు ఉత్తమ్‌కుమార్.

తనని లొంగదీయడానికి తన తల్లిని ఆయుధంగా వాడుకోజూస్తున్న ఉత్తమ్‌కుమార్ ఆత్రుత సహజకి నవ్వు తెప్పించింది.

"ఎక్స్‌క్యూజ్‌మీ.."

అందరూ గుమ్మం వైపు చూశారు. ఇందులేఖా, మరో ఇద్దరమ్మాయిలూ గుమ్మంలో నిలబడ్డారు.

"హలో ఇందూ! కమిన్!" సహజ పైకి లేస్తూ ఆహ్వానించింది.

ఇందులేఖ తన ఫ్రెండుని పరిచయం చేసింది, హాల్లోకివచ్చి.

"మా ప్రిన్సిపాల్ మిమ్మల్ని ఉన్నపళాన వెంటబెట్టుకు రమ్మన్నారు. మీరూ, ఆవిడా కలిసి మహిళా యూనివర్సిటీ వి.సిగార్ని అర్జెంటుగా కల్సుకోవాలట!" ఇందులేఖ అంది. "మహిళా యూనివర్సిటీ జీప్‌లోవచ్చాం! తొందరగా బయల్దేరండి!"

"ఎందుకో చెప్పారా?" సహజ అడిగింది.

"చెప్పలేదు. వివిధరంగాల్లో ప్రఖ్యాతి సంపాదించి, విశిష్టసేవలు అందించిన మహిళలకు యూనివర్సిటీ ఈ ఏడాదినుండే మహాశ్వేత అవార్డు ఇస్తోంది. మీకు తెలుసుగా! టాప్ హీరోయిన్ కాంతిశ్రీకీ, ప్లేబాక్ సింగర్ శివరంజనికీ, ఇంకా ఎవరో ఇద్దరికీ ఈసారి అవార్డులు అనౌన్స్ చేశారు..."

"తెలుసు"

"అవార్డు ఫంక్షన్ వచ్చేవారం. ఆ ఫంక్ష న్‌లో పార్టిసిపేట్ చేయడానికి అనుకుంటా ను" ఇందులేఖ వివరించింది.

"అమ్మా... ఇందూ వాళ్లకీ, ఉత్తమ్‌కీ కాఫీ ఇవ్వు. ఈలోగా నేను రెడీ అవుతాను!" అంటూ తన మేడగదివైపు వెళ్లింది సహజ...

★ ★ ★

మహిళా యూనివర్సిటీ ఆడిటోరియం పెళ్లిమండపంలా కళకళాలాడుతోంది. వేదిక మీద స్టార్ అట్రాక్షన్ అయిన ఆంధ్రుల అభిమాన హీరోయిన్ కాంతిశ్రీ కూచుంది. చిరునవ్వులు కురిపిస్తూ ఆమె పక్కనే అవార్డు అందుకోబోతున్న నంబర్‌వన్ ప్లేబాక్ సింగర్ శివరంజని వుంది. ఇద్దరికీ ఇరువైపులా మహిళా యూనివర్సిటీ వి.సి. రిటైర్డ్ వి.సి. మహా శ్వేతాదేవి, ఉమెన్స్ కాలేజీ ప్రిన్సిపాల్, స్థానిక ఎం.పీ. సతీమణి మరో ఇద్దరు అవార్డు తీసుకోబోయే మహిళలూ, చివరి కుర్చీలో ఆనాటి కార్యక్రమానికి ముఖ్య అతిథిగా వచ్చిన డి.జి.పి...

ఆడిటోరియంలో వేలాదిమంది మహిళా ప్రేక్షకులూ, విద్యార్థినిలూ క్రిక్కిరిసివున్నారు. కార్యక్రమాలు ప్రారంభమయ్యాయి. మహా శ్వేతాదేవి తన పేరుతో అవార్డు స్థాపించడానికి కారణాలు వివరించింది. ఒక్కో వక్తా ఒక్కో అవార్డు గ్రహీత గురించి ఉపన్యసించారు. అభినేత్రి కాంతిశ్రీ చిత్రరంగానికి అందిస్తున్న సేవలగురించి ప్రముఖంగా అందరూ తమ ప్రసంగాల్లో ప్రస్తావించారు.

చివరగా, కళా, సాహిత్య, సాంస్కృతిక రంగాల్లో స్త్రీ వ్యక్తిత్వాన్ని కించపరుస్తూ ప్రబలిన విపరీత ధోరణుల్ని అరికట్టడంలో స్వచ్ఛందంగా ప్రయత్నిస్తూ, కృషి చేస్తూ విజయం సాధిస్తున్న మిస్ టెంపెస్ట్ సహజ ఉపన్యసిస్తుందంటూ అధ్యక్షురాలు అనౌన్స్ చేసింది.

'కళా సాహిత్య సాంస్కృతిక రంగాల్లో స్త్రీ' అనే విషయం మీద సహజ ఉపన్యాసం ప్రారంభించింది. ఆయారంగాల్లో స్త్రీ దేశవ్యాప్తంగా, ప్రపంచవ్యాప్తంగా చేసిన సేవల్ని, సాధించిన విజయాల్ని సహజ వివరించింది. వెండితెరమీదా, వెండితెరవెనుకా యువరాణీల్లా వెలిగిపోతున్న కాంతిశ్రీ గురించీ, శివరంజని గురించీ హర్షధ్వానాల మధ్య ఉపన్యసించింది...

"... ఎన్నిరంగాలలో స్త్రీ పురుషుడితో సమానంగా పురోభివృద్ధి సాధించినా కూడా ఆత్మాభిమానం, ఆత్మగౌరవం అనేవి ఆమెకి దూరంలోనే వుంటున్నాయి... ఉంచబడుతున్నాయి. స్త్రీ సాధించిన విజయాలకన్నా అపజయాలే ఎక్కువగా ఉన్నాయి. ఆమె సాధించుకున్న గౌరవంకన్నా నిజజీవితంలో ఎక్కువ అగౌరవాన్నే స్త్రీ పొందుతోంది. మద్యపానంతో మమ్మల్ని నాశనం చేయొద్దు అంటున్న స్త్రీ నగ్నంగా బజార్లో ఊరేగించబడుతోంది! ప్రతిరోజూ, ప్రతి గంటలోనూ ఏదో ఒక చోట స్త్రీ మానభంగానికి గురవుతోంది! గర్భస్థ దశలోనే చంపబడుతోంది! కట్నం ఆమెని చంపుతోంది!

ఇందుకు కారణం స్త్రీ వ్యక్తిత్వం చిన్నచూపు చూడబడటమే! సాహిత్యంలో, కళల్లో స్త్రీ విలాసవస్తువుగా చిత్రీకరించబడటమే! ఈనాడు మనిషి ఎక్కువగా సాహిత్యాన్ని చదివి ప్రభావితుడవుతున్నాడు! సినిమాలు చూసి ప్రభావితుడవుతున్నాడు! ఇవాళా, రేపు ఈ రెండూ కూడా స్త్రీనీ, ఆమె శరీరాన్నీ, ఆత్మనూ వ్యాపార వస్తువుగా వాడుకుంటున్నాయి. సాహిత్యం, సినిమా రెండూ వ్యాపారాలే అయిపోయాయి.

రెండింటిలోనూ అశ్లీలం పెరిగిపోయింది. 'పెళ్ళాం పిల్లలతో కలిసి సినిమా చూడలేకపోతున్నాం' అనే మాటల్నీ, 'ఫలానాఫలానా పత్రికలూ, నవలలూ ఇంటికి తేవాలంటే భయంగా వుంది' అనే మాటల్నీ తరచూ వింటూనేవున్నాం. అయినా స్త్రీని అసభ్యంగా చిత్రించే సాహిత్యాన్ని చదువుతూనే వున్నాం,




చూస్తూనేవున్నాం!

"బూతుపుస్తకాల్నీ, సినిమాల్లోని రెండర్థాల బూతు డైలాగుల్నీ, బూతు పాటల్నీ స్త్రీలే ఎక్కువగా ఎంజాయ్ చేస్తున్నారు అనే కామెంట్‌ని వింటూ 'మౌనంతో' నిజమే అని చెప్తున్నాం! ఎక్కడ అశ్లీలం వుందో అక్కడ స్త్రీ వుంది. అక్కడ స్త్రీ వ్యక్తిత్వం వుంది. అక్కడ స్త్రీ ఆత్మగౌరవం వుంది. అక్కడ- ఆ స్త్రీ, వ్యక్తిత్వం, ఆత్మగౌరవం ఎట్లావున్నాయి? సర్వనాశనం చేయబడిన స్థితిలో, నీచంగా అవమానించబడిన స్థితిలో వున్నాయి!

"సాహిత్యరంగంలో, కళారంగంలో, నిజజీవిత రంగంలో స్త్రీ తనమీద సాగుతున్న 'అశ్లీలం' దాడిని భరిస్తూనేవుంది. తన వ్యక్తిత్వంమీద జరుగుతున్న ఈ నిరంతర హత్యను ఈ కారెక్టర్ అశాసినేషన్ని స్త్రీ ఖండించడంలేదు! ఫలితంగా స్త్రీ మానభంగానికి గురౌతోంది! వివస్త్రగా ఊరేగించబడుతోంది. కట్నం చావులు చస్తోంది! గర్భస్థ శిశువుగానే చస్తోంది!"

హర్షధ్వానాలు సహజ ప్రసంగాన్ని అడ్డుకున్నాయి.

"ఈ పర్మనెంట్ క్యారెక్టర్ అశాసినేషన్ని ఆపి, తన వ్యక్తిత్వాన్ని ఉన్నతంగా చూపించే ప్రయత్నం చేయడంలేదు! పైపెచ్చు- అజ్ఞానంతో, అమాయకంగా తనని కించపరిచే స్వార్థశక్తులతో చేయి కలుపుతోంది!

"కట్నం కావాలన్న పురుషుడికి తోడుగా ఒక స్త్రీ సహాయపడుతోంది! తన అందాన్ని అంగడి- వస్తువుగా చేస్తున్న వ్యాపారస్థుడితో సహకరిస్తోంది! వివరంగా చెప్పాలంటే తన శరీరాన్నీ, తన అభ్యంతర శృంగారాన్నీ బజార్నపెట్టే కళారూపాల్ని గుడ్డిగా ఆదరిస్తోంది. మితిమీరిన శృంగారం వున్న సాహిత్యాన్ని చదువుతోంది. అసభ్యదృశ్యాలున్న సినిమాల్ని వందరోజులు ఆడిస్తోంది.

"అంతటితో ఆగకుండా, పోటీ మనస్తత్వంతో కళాకారిణిగా, రచయిత్రిగా తనూ తనవంతు కృషి చేస్తూ తనజాతిని తాను, తనని తాను కించపరుచుకుంటోంది!"

హర్షధ్వానాలు మళ్ళా సహజ ప్రసంగానికి ఆనకట్టవేశాయి.

"అంచేత స్త్రీ శరీరంతో, ఆత్మతో, ఆత్మగౌరవంతో, మోడెస్టీతో సాగుతున్న విశృంఖలత్వాన్ని ఆపాలి. ఖండించాలి! ఎలా? తనని ఆవిధంగా రచ్చకీడ్చి, కించపరచి, పబ్బంగడుపుకుంటున్న పురుషజాతిని ఎదిరించాలి! నిలదీయాలి!

"నా శరీరాంగాల్ని నగ్నంగా చూపుతూ రచనలు చేయొద్దు అనాలి!

"నా శరీరంతో సాగే శృంగారాన్ని బట్టబయలు చేయొద్దు అనాలి!

"నా శరీరాన్ని అర్ధనగ్నంగా చూపొద్దు- తెరమీద- అనాలి!"

హర్షధ్వానాలు.

"పురుషుణ్ణి అలా అడుగుదాం! నిలదీద్దాం! శాసించుదాం! అయితే- దానికంటే ముందు- వేరుజాతి వాడైన పురుషుణ్ణి ఎదిరించి, నిలదీసి, శాసించేముందు స్త్రీ తనను తను శాసించుకోవాలి! తనను రక్షించాల్సిన కంచె తనను మేసేస్తోందని చేను ఫిర్యాదు చేసేముందు- తనని తానే మేయడం మానాలి! తనని తాను అవమానించుకోవడం ఆపాలి! తననితాను కించపరచుకోవడం మానాలి! తననితాను అమ్ముకోవడం మానాలి! 'నన్ను గౌరవించు!' అని పురుషుణ్ణి దబాయించే ముందు స్త్రీ తననుతాను గౌరవించుకోవాలి! అప్పుడు మాత్రమే పురుషుణ్ణి నిలదీసే అధికారం మనకి వస్తుంది!

"నన్ను బజార్నపడేసే అశ్లీలం రాయొద్దు అనే ముందు స్త్రీ తను ఆ రాతల్ని చదవడం మానాలి. తాను రాయడం మానాలి! అసభ్య దృశ్యాల్లో నన్ను చూపించవద్దు అనేముందు తాను ఆ దృశ్యాల్లో కనిపించడం మానాలి! బూతు మాటలూ, పాటలూ రాయొద్దు- అనే

ముందు ఆ మాటల్ని పలకడం, ఆ పాటల్ని పాడటం మానాలి!" సహజ ఆగింది. ఈ ధోరణి టాప్‌హీరోయిన్ కాంతిశ్రీకీ, టాప్ సింగర్ శివరంజనికీ ఇబ్బందికరంగా వుంటుందని తనకి తెలుసు. సభానిర్వాహకులకి ఇబ్బందికరంగా ఉంటుందనీ తెలుసు!

ఆమె ఆలోచనల్ని తెంచేస్తూ- ఉన్నట్టుండి, వేదికమీదున్న డి.జి. ఆఫ్ పోలీస్ కొట్టిన చప్పట్లు ఆమెలో ధైర్యాన్ని పుట్టించాయి. క్షణంసేపట్లో చాలాచేతులు డి.జి.ఆఫ్ పోలీస్ చేతుల్ని అనుసరించాయి.

"అంచేత తనని లోకం గౌరవించేలా చేసే శక్తి స్త్రీకి ఉంది. ఆ శక్తికి జోలపాట పాడడం ఆపి స్త్రీ మేల్కొలుపు పాడాలి! తన వ్యక్తిత్వాన్ని కించపరిచే ఏ కళతోనూ తాను చేయి కలపనని స్త్రీ తెగేసి చెప్పాలి! చలన చిత్రరంగానికి సంబంధించినంతవరకూ అలాంటి విప్లవాత్మకమైన నిర్ణయం ఈ వేదికమీద- మహిళలకు ఒక మహిళ ఏర్పాటుచేసిన 'మహాశ్వేత అవార్డు ప్రారంభప్రదానం జరుగుతున్న ఈ వేదికమీద ప్రారంభం కావాలి!

"చలనచిత్రరంగానికి అంకితమైపోయి, తన కళానైపుణ్యంతో అశేష ప్రజానీకానికి అభిమాన నటిగా ఎదిగిన అభినేత్రి కాంతిశ్రీ గారు ఈనాటినుండే అసభ్యదృశ్యాలలో, అర్ధనగ్నదృశ్యాల్లో, వానపాటల దృశ్యాల్లో నటించబోననీ, రెండర్థాల పాటల దృశ్యాల్లో నటించననీ, రెండర్థాల బూతు మాటల్ని పలకననీ- ఈ వేదికనుండి ప్రకటించి సరికొత్త విప్లవానికి నాందిపలకాలని అభ్యర్థిస్తున్నాను''

హర్షధ్వానాలు మిన్ను ముట్టేశాయి. "ఔను! కాంతిశ్రీ ప్రకటన చేయాలి!' ప్రకటన చేయాలి!' అంటూ వేలాది స్త్రీకంఠాలు అరవసాగేయి. నిశ్శబ్దం ఏర్పడ్డాక సహజ చెప్పాసాగింది.

"అదేవిధంగా ద్వంద్వార్థాలతో కూడిన పాటలను పాడబోనని ఈ వేదికమీద ప్రకటించి స్త్రీ వ్యక్తిత్వ రక్షణకి తమవంతు కృషిచేయాలని ప్రసిద్ధ నేపథ్యగాయని శ్రీమతి శివరంజనిగారికి విజ్ఞప్తి చేస్తున్నాను!"

"శివరంజని ప్రకటన చేయాలి! ప్రకటన చేయాలి!" కేకలు ప్రతిధ్వనించాయి.

సహజ నమస్కారంచేసి వేదిక పక్కకి వెళ్ళిపోయింది. ప్రెస్ ఎన్‌క్లోజర్‌లో కూచున్న ఉత్తమ్‌కుమార్ తనని ఆశ్చర్యంగా చూస్తూండడం ఆమె గమనించింది.

చిరునవ్వులు చిందిస్తూ అభినేత్రి కాంతిశ్రీ మైకు ముందుకు వచ్చింది. నటి అయ్యాక ప్రవాహవేగంతో లాక్కుపోతున్న ట్రెండ్ తనని ఆలోచించనివ్వలేదనీ, స్త్రీగా తను వేస్తున్న తప్పటడుగుల్ని ఎవరూ తన దృష్టికి తేలేదనీ మహాశ్వేత అవార్డు అందుకుంటున్న శుభతరుణంలో, మిస్ టెంపెస్ట్, ఇతర మహిళామణులూ, పెద్దలూ కోరిన విధంగా ఇకమీదట అభ్యంతరకర సన్నివేశాల్లో నటించననీ ఉద్రేకంతో ప్రకటించింది.

శివరంజని ఇకమీదట రెండర్థాల పాటల్ని పాడనంటూ శపథం చేసింది.

మహాశ్వేత అవార్డుల ప్రదానం ప్రారంభమైంది.

... దూరంలో స్కూటర్ పక్కనే నిలబడ్డ ఉత్తమ్‌కుమార్ సహజకోసం ఎదురుచూస్తున్నాడు.

సహజఅక్కడివాళ్ళకి గుడ్‌నైట్ చెప్పి... వస్తోంది. ఎవరో నలభైయేళ్ళ స్త్రీ సహజని ఆపింది. చేయిపట్టి ఆమెని కొంచెం దూరంగా లాక్కెళ్ళింది. తగ్గుస్వరంతో ఏదో చెప్తోంది. ఏదో కాగితం ముక్క సహజకి అందించింది. సహజ అలాగే అన్నట్టు తలాడిస్తూ, పేపర్ని పర్స్‌లో పెట్టుకుంటోంది. ఆ స్త్రీ మళ్ళా ఏదో చెప్పి వెళ్ళిపోయింది.

దగ్గరగా వచ్చిన సహజను అతను నవ్వుతూ చూశాడు. అప్రయత్నంగా ఆమె చెయ్యి పట్టుకుని కరచాలనం చేశాడు. "కంగ్రాట్స్! కాంతిశ్రీనీ, శివరంజనినీ తెలివిగా ఇరికించే





శావ్!"

"ఇరికించి, చేయించే నిర్ణయాలు చిర కాలం వుండవు!" సహజ నవ్వుతూ అంది. సినిమా రంగంలో స్త్రీ స్థానం అనే అంశంమీద కాంతిశ్రీతో ఇంటర్వ్యూ జరపాలని చాలారోజులుగా అనుకుంటున్నా. వెళ్ళి ఆమెతో చెడుగుడు ఆడి, అలిసిపోయే యాతన తప్పుతుందనీ, ఆర్గ్యుమెంట్‌కన్నా, బహిరంగ వేదికమీద మెసేజ్ శక్తివంతంగా వుంటుందనీ అనుకుని, ప్రిన్సిపాల్ నన్ను పిలిపించిన రోజే ప్లాన్ చేశాను!"

"నా జర్నలిస్ట్ మిత్రులు నీ పద్ధతినీ, కమిట్‌మెంట్‌నీ యెంతో మెచ్చుకున్నారు! నిన్ను ఇంటర్వ్యూ చేసే అవకాశం వాళ్ళకే ఇప్పించమన్నారు! వీల్లేదని చెప్పేశాం!" ఉత్తమ్‌కుమార్ నవ్వుతూ అన్నాడు. "ఆ... ఇందాకా ఎవరో ఆవిడ నీతో గుసగుసగా ఏదో మాట్లాడింది... ఎవరావిడ?"

"ఆవిడ... నా ఉపన్యాసం మెచ్చిన మహిళ! రేపు వాళ్ళింటికి భోజనానికి రమ్మంది!" సహజ నవ్వింది.

"ఫర్వాలేదే! కష్టం ఫలించింది! వెళ్తున్నావా?"

"వెళ్తున్నాం! నువ్వు కూడా వస్తున్నావ్ నాతో!" సహజ నవ్వుతూ అంది.

ఉత్తమ్‌కుమార్ స్కూటర్ని స్టార్ట్ చేశాడు. సహజ ఎక్కి కూచుంది. ఆమె చెయ్యి అతని భుజంమీద ఆనింది. ఉత్తమ్‌కుమార్ నూతనోత్సాహంతో స్కూటర్ని పోనిచ్చాడు. సహజ తనకి దూరంగా పోలేదు, తను అందుకోగలిగిన దూరంలోనే ఉంది!

★ ★ ★

గదిలోకి వస్తున్న ఇద్దర్నీ తన ఎక్స్‌రే కళ్ళతో విప్పదీసి చూస్తూ తన శ్కానింగ్ బ్రెయిన్‌తో శ్కానింగ్ చేస్తూ, వాళ్ళ అమాయకత్వాన్నీ, కంగారునీ మామూలుగా తను అంచనావేసే పద్ధతిలో, అంచనావేస్తూ "సిడౌన్" అన్నాడు ప్రఖ్యాత సెక్స్ నిపుణుడు కామేశం.

పక్కపక్కనే కూచున్న ఇద్దర్నీ జాయింటుగా చూస్తూ డా. కామేశం తన రొటేటింగ్ కుర్చీలో వెనక్కివాలాడు. "భార్యాభర్తల్ని కూడా విడివిడిగా ఎగ్జామిన్ చేయడం నా పద్ధతి. అప్పుడే పేషెంట్స్ నిర్భయంగా తమ గురించి చెప్పగలరు. మీరు..." అంటూ ఆగాడు ఆ ఇద్దర్నీ భార్యాభర్తలుగా, సెక్స్ పేషెంట్స్‌గా అపార్థం చేసుకుంటూ...

"మాకు అలాంటి ఇన్హిబిషన్స్ లేవు! పైగా మా సమస్య మాలో ఏ ఒక్కరిదో మాత్రమే కాదు డాక్టర్!" అంది సహజ. ఉత్తమ్‌కుమార్ ఔనన్నట్టు తలాడిస్తూ చిరునవ్వు నవ్వాడు.

"మీఇష్టం!" భుజాలెగరేస్తూ నవ్వాడు డా. కామేశం. ఆడా, మగా ఇద్దర్నీ కలిపి, ప్రశ్నలు అడుగుతూంటే థ్రిల్లింగ్‌గా వుంటుంది!

"ఏమిటి మీ సమస్య?"

"మా సమస్య సమాజ సమస్య డాక్టర్!" సహజ నవ్వుతూ అంది.

డా. కామేశం గొంగళిపురుగు కనుబొమలు పైకి లేచాయి. "ఎయిడ్సా?"

"దానికంటే ప్రమాదకరమైందే!" ఉత్తమ్‌కుమార్ నవ్వుతూ అన్నాడు. డా. కామేశం ప్రశ్నార్థకంగా చూస్తూ కళ్ళద్దాలు తీసి, తుడిచి, తగిలించుకున్నాడు.

"ఐదు తెలుగు పత్రికల్లో మీరు రాస్తున్న పాఠకుల ప్రశ్నలూ- మీ సమాధానాలు- ఇదే మా సమస్య, లేదా సమాజ సమస్య డాక్టర్!" సహజ నవ్వుతూ అంది.

డాక్టర్ కామేశం అయోమయంగా చూశాడు. "యువర్ స్టేట్‌మెంట్ ఈజ్ రాంగ్! నేను రాస్తున్నవి పాఠకుల ప్రశ్నలు కాదు, పాఠకులు రాస్తున్న పాఠకుల ప్రశ్నలు! సమాధానాలు మాత్రం నావి!"

"అనే చాలామంది అనుకుంటారు పాపం! అయితే, పాఠకులు సోమరితనంతో ప్రశ్నలు అడక్కపోతే, మీరే ఆ ప్రశ్నలకోటా సప్లై

చేస్తారని మేం అనుకుంటున్నాం. ముఖ్యంగా సహజ అలా అంటుంది!" ఉత్తమ్‌కుమార్ నవ్వుతూ అన్నాడు.

"సహజ... ఓహ్! కల్చరల్ క్రూసేడర్! నువ్వెందుకు వచ్చావో నాకు తెలుసు! నా రెగ్యులర్ ఫీచర్ని రాయకుండా ఆపించాలని వచ్చావ్! ఆ పప్పులు ఇక్కడ ఉడకవ్! అంచేత యూకెన్ గో!" మహతి రవిచంద్ర ద్వారా సహజ గురించి తెలుసుకున్న డాక్టర్ కామేశం ఎగతాళిగా అన్నాడు.

"ఆవేశపడకండి! తొందరపడి జడ్జిమెంట్ చెప్పేయకండి! 'సెక్సు సమస్యలకు సక్సెస్ ఫుల్ పరిష్కారాలు', 'లైంగిక ఆనందం', వగైరా శీర్షికల్లో పత్రికల్లో మీరు నింపుతున్న అసభ్య సాహిత్యాన్ని ఆపమని కోరడానికే వచ్చాను! 'డాక్టర్' అంటే మీరు ఏ డాక్టరీ చదివారో నాకు తెలీదు. వయసుమళ్ళినవారని తెలుస్తోంది. సెక్స్ సమస్యలకి పరిష్కారాల పేరుతో మీరు బూతు అందిస్తున్నారు! పాఠకులకి సమస్యాపరంగా అది ఎంత ఉపయోగపడుతోందో నాకు తెలీదు. పత్రికలకి సెక్స్ అప్పీల్ పులమడానికి మాత్రం ఉపయోగపడుతోందని ఖచ్చితంగా తెలుసు. మామూలు ప్రక్రియల్లో రాయడానికి వీల్లేని బూతుని వైద్య సలహాల ముసుగులో మీరు అందిస్తూ, యువతరాన్ని తప్పుదారి పట్టిస్తున్నారు! యువతరం..."

"ఇగ్నోరెన్స్!" డా. కామేశం సహజకు అడ్డుతగుల్తూ అన్నాడు. "బేస్ ఇగ్నోరెన్స్! మన వేదభూమిలో సెక్స్ ఎడ్యుకేషన్ లేక ఎంతమంది స్త్రీలూ, పురుషులూ నరకం అనుభవిస్తున్నారో, సెక్స్ గురించిన దురభిప్రాయాలతో ఎంతమంది యువతీయువకులు తమ జీవితాల్ని పాడుచేసుకుంటున్నారో నీకు తెలీదు! నేను అందిస్తోంది బూతు కాదు, సెక్స్ ఎడ్యుకేషన్!"

"నాకు తెలీక అడుగుతాను. సెక్స్ ఎడ్యుకేషన్ మీరు అందిస్తున్న పద్ధతిలో - అవసరమా? మీ తల్లిదండ్రులకి మీ సెక్స్‌విద్య లేకుండానే మీరు పుట్టలేదా? చదివేవాళ్ళని వికృతంగా ఉద్రేకపరిచే విధంగా స్త్రీ పురుషుల లైంగిక కార్యాన్ని అనవసరంగా విడమరచి, సాగదీసి చెప్పడం లైంగిక విద్యాబోధనా?" సహజ ప్రశ్నిస్తూ అతన్ని తీక్షణంగా చూసింది.

"దాంపత్యజీవిత విజ్ఞానం లేని ఎంతమంది యువతీ యువకుల్ని, నూతన దంపతుల్ని నా శీర్షికద్వారా నేను ఎంత ఎడ్యుకేట్ చేశానో నీకేం తెలుసు?"

"డోంట్‌టాక్ రబ్బిష్ డాక్టర్!" సహజ ఉద్వేగంతో అరిచింది. "ఆహార నిద్రాభయ మైధునాలు జన్మసిద్ధాలు! నువ్వూ నేనూ నేర్పనక్కర్లేదు. తిండితినడం, నిద్రపోవడం, భయపడ్డం, దాంపత్యం నెరపడం మనిషికి స్వతసిద్ధంగా వస్తాయి. అవి మనిషికి ఊపిరి పీల్చుకోవడమంత సహజమైనవి! ఇంకా చెప్పాలంటే పరిసరాల్లో కుక్కలు స్త్రీ పురుష శరీరాల ఐక్యత గురించి మనిషికి ముందుగా నే నేర్పుతాయి! అవి నీలాగా, నీ పత్రికాధిపతుల్లాగా డబ్బు అడగవు!"

"నాన్సెన్స్..."

"మనిషికి లైంగికానుభవం గురించి బోధించేంత మేధావివా నువ్వు? అంత గొప్ప మేధావివైతే 'స్ఖలనసుఖం' అంటే ఏమిటో, ఆ అనుభవం ఎలా వుంటుందో చెప్పు, చూద్దాం!" సహజ ఛాలెంజ్ చేసింది.

డా. కామేశం క్షణంసేపు బిత్తరపోయి, తేరుకుని, చిన్నగా నవ్వాడు. "అది భాషకూ, మాటలకూ అందదు, వేదాంతంలో చెప్పే బ్రహ్మానందంలాగా! అది కేవలం ప్రాక్టికల్ అనుభవంతో తెల్సుకోవాల్సిందే!"

"కరెక్ట్! స్వానుభవంతో మనిషి తెలుసుకోవాల్సిన లైంగిక జీవితానుభవాన్ని ఎందుకు బహిరంగం చేస్తున్నావ్? మనిషినే తెలుసుకోనీ! జబ్బులు వస్తే చూసుకోడానికి క్వాలిఫైడ్ డాక్టర్స్ ఉన్నారుగా!"

"నీ సలహాకి ధన్యవాదాలు! నీ సలహాని నేను పాటించను! అసలు పిలవని పేరంటాని





కి వచ్చి సలహా ఇవ్వడానికి నువ్వెవరు?"

"నేను ఎవరో, ఎవరో కానక్ఖరలేదు! స్త్రీని! అది చాలు. అశ్లీల సాహిత్యంలో స్త్రీ మోడెస్టీ ఎలా అటాక్ చేయబడుతుందో, నీ సమాధానా ల్లో కూడా అటాక్ చేయబడుతోంది. అది వాంఛనీయం కాదు.

జన్మతో మనిషికి సంక్రమించే విద్యను నేర్పా ల్సిన అవసరంలేదు! ఆ అంశంలో సమస్య లు ఉత్పన్నమైనప్పుడు బహిరంగంగా సల హాలు గుప్పించే అవసరం లేదు!

డాక్టర్ అంటూ నిన్ను నువ్వే పిల్చు కుంటున్న కామేశం! దయచేసి నా అభ్యర్ధన విను! నీ సెక్సు శీర్షికలతో యువతరం తప్పుదారి పడుతోంది! వాళ్ళ మేధస్సుల్ని కలుషితం చేస్తోంది! ప్రమాదకరమైన ఆవేశా న్నీ, ఉద్రేకాన్నీ పుట్టించి అక్రమ కామ సంబంధాలకీ, వ్యభిచారాలకీ, రోగాలకీ వాళ్ళ ని గురిచేస్తోంది! రోడ్లమీద నిలబడి, కని పించిన స్త్రీతో చూపులతో, మనసుతో వ్యభి చారం చేయిస్తోంది! స్త్రీని స్త్రీగా ప్రేమించే, గౌరవించే సంప్రదాయంనుండి దూరంచే స్తోంది! కళ్ళు తెరిచి చూడు! ఈ కాలుష్య వ్యాపారం ఆపేయ్!"

డాక్టర్ కామేశం మెల్లిగా లేచి నిలబడ్డాడు. వెటకారంగా నవ్వుతూ సహజవైపు చూశాడు.

"అసహజమైన ఆలోచనలతో, ఇన్హిబిష న్స్‌తో నా ఎక్స్‌పర్ట్ సర్వీసుని, సమాజానికి నేను చేస్తున్న మేలుని పొల్యూషన్‌గా, వ్యాపా రంగా చిత్రించి నన్ను అవమానించావు! నీ వాదన వింటూంటే కామపరంగా నీకు కొన్ని అజ్ఞాతభయాలూ, దురభిప్రాయాలూ, మూఢ నమ్మకాలూ ఉన్నాయి. అందుకే సాహిత్యంలో శృంగారం ఉండకూడదంటూ నీ తిక్క ఉద్యమాన్ని ప్రారంభించావు! టేక్ మై అడ్వైజ్! తీరిగ్గా వరసగా కొన్నిరోజులు రా! నీలో వున్నవన్నీ తప్పుడు అభిప్రాయా లని తెలియజేసే ఎక్స్‌పర్ట్ వెర్బల్ ట్రీట్ మెంట్ ఇస్తాను! నౌ గెటౌట్!"

అంతవరకూ మౌనంగావున్న ఉత్తమ్‌కు మార్ ఆవేశంతో లేచాడు. "యూ క్వాక్! అబ్సీన్ బిజినెస్ చేసే నువ్వు సహజని ఎడ్యుకేట్ చేస్తావా? యూ..."

"గెటౌట్ ఆఫ్ హియర్!" కామేశం హూంకరించాడు. నా శీర్షికల్ని మాని పించడం మీతరం కాదు! నేను రాస్తాను... రాస్తాను! రాస్తాను! కావాలంటే కోర్టుకె క్కండి! మానిపించండి! చూద్దాం!"

"నీ కేసు కోర్టుదాకా ఎందుకు? నేనే తీర్పు చెప్తాను!"

స్త్రీ కంఠం వినిపించి, ఉత్తమ్‌కుమార్ చివా ల్న తలతిప్పి చూశాడు. గతరాత్రి అవార్డ్ ఫంక్షన్ అయిపోయాక సహజతో ఒంటరిగా మాట్లాడిన స్త్రీ గదిలోకి వస్తోంది.

"సీతా! ఏమిటా మాటలు!" డా. కామేశం హూంకరించాడు.

"హుఁ! సీత! సీతలాగా పతివ్రత అయిపో వాలన్న పైత్యంలో ఇంతకాలం ఊరుకున్నా ను. పత్రికల్లో రాస్తూ నువ్వు చేస్తున్న బూతు వ్యాపారాన్ని ఆపించలేక, భరిస్తూ వచ్చాను! సహజ మాటలు నన్ను నిద్రలేపాయి! ఇంతకా లంగా నీ స్వార్ధవ్యాపారాన్ని ఆపించనందుకు సిగ్గుపడుతున్నాను! నీ బూతుపురాణం ఎట్లా ఆపించాలో నాకు తెలుసు!"

"సీతా! నోరు మూసుకుని ఫో!"

"నోరు మూసుకోవాలా? ఇన్నేళ్ళూ మూ సుకుని పాతకుల్ని మోసంచేస్తున్న నీ దుర్మా ర్గంలో పాలుపంచుకున్నాను! ఇప్పుడు నేను నోరు తెరుస్తాను, నీ ఆట కట్టిస్తాను!"

"సీ...తా...!"

"మేడమ్..." సహజ సీత దగ్గరగా వెళ్తూ అంది. సీత మొహంలోని ఏదో నిర్ణయం ఆమెని ఆందోళనపరుస్తోంది. రచయిత్రి హారతి భర్తలాగా ఈమె భర్తతో విడాకులు తీసుకునే నిర్ణయం చేసుకుందా? విడాకుల బెదిరింపుకి ఆడది లొంగినట్టు మగాడు లొంగుతాడా? ఆవేశంతో సీత తన జీవితాన్ని

కష్టాలపాలు చేసుకుంటుందేమో! ఆలోచనల్ని ఆపుకుని సహజ సీత చేతిని పట్టుకుంది.

"మేడమ్... మీరు తొందరపడకండి! మెల్లగా ఆయన్ని ఒప్పించి..."

"ఆడది ఆడదాన్ని ఒప్పించగలదు. ప్రయత్నిస్తే, నిర్ణయించుకుంటే మగవాణ్ణి ఒప్పించగలదు, మార్చగలదు! ఆ రెండు జాతులకూ చెందనివ్యక్తిని మార్చలేదు!"

"సీ...తా..." డా.కామేశం బొంగురుగా అన్నాడు.

సీత పకపక నవ్వింది. "భార్యని ఏలుకోలేని నువ్వు, మగతనం అనేది మాటవరసకైనా లేని నువ్వు పాఠకుల సెక్స్ సందేహాలకి సమాధానాలిస్తావా? ఎడ్యుకేట్ చేస్తావా?"

"సీ... సీ...తా"

సీత భర్తని నిర్లక్ష్యం చేస్తూ సహజవైపు చూసింది. "సహజా... నీ మాట విని, తన వ్యాపారం మాని, తన బతుకుని బజారుపాలు కాకుండా కాపాడుకుంటాడేమో అన్న ఆశతో నా భర్త అనబడే ఈ మూడోజాతి మనిషికి ఆఖరి అవకాశం ఇచ్చాను"

"మేడమ్..." సహజ ఆశ్చర్యంగా అంది.

"ఔను సహజా! రెండు దశాబ్దాలపైగా ఈ మనిషితో కాపురం చేస్తూ కన్యగానే వుండిపోయాను! నపుంసకుడైన నా భర్త పత్రికల్లో పాఠకుల సెక్స్ సమస్యల్ని తీర్చే సమాధానాలు రాస్తుంటే నవ్వాలో, ఏడవాలో తెలీక చచ్చిపోతున్నాను! అశ్లీల సాహిత్యం ద్వారా స్త్రీకి జరుగుతున్న అన్యాయం ఏమిటో నిన్న నీ ప్రసంగం విని తెలుసుకున్నాను! అందుకే నిన్ను రమ్మన్నాను"

"మేడమ్... మీరు... మీరు..." దిగ్భ్రాంతినుండే ఇంకా పూర్తిగా కోలుకోలేని సహజ ఏదో చెప్పే ప్రయత్నం చేసింది.

"నన్ను చెప్పనీ, సహజా!" సీత ఉద్రేకంతో అంది. "నపుంసకుడైన నా భర్త వేలాది మంది పాఠకుల లైంగిక సమస్యల్ని తీర్చి పారేస్తూ సమాధానాలూ, సలహాలూ ఇస్తున్నాడు! పత్రికలు డబ్బిచ్చి రాయించుకుంటున్నాయి! పాఠకులు డబ్బిచ్చి చదివి, బాగుపడిపోతున్నారు! ఎంత దారుణం! లోకాన్ని మోసం చేసి, ఆడదాన్ని బజార్నపెట్టే ఈ బూతు వ్యాపారం అన్యాయం! ఈ అన్యాయం నా ఇంటిలోంచే సాగుతోంది. ఈ క్షణంనుంచీ సాగదు! సాగనివ్వను!"

"సీతా... సీ...తా.." కామేశం బలహీనంగా అరిచాడు.

"సహజా, నీ గురించి నాకు తెలుసు. స్త్రీ సముద్ధరణకోసం నువ్వు చేస్తున్న కృషిని నేను మెచ్చుకున్నాను

"అశ్లీల రచనలవల్ల జన్మించే అసహజమైన కామ పరమైన ఆలోచనల్ని తృప్తి పరచుకోడానికి పాఠకులు సెక్స్‌సమస్యలు రాస్తున్నారు! నా భర్త ఆ సమస్యలకి బరితెగించి సమాధానాలు రాస్తూ, వికృత సంతృప్తిని పొందుతున్నాడు. యువతీయువకులకీ, నూతన దంపతులకీ మానసిక, శారీరక నపుంసకత్వాన్ని తొలగించి పరిపూర్ణ పురుషత్వాన్ని పొందే టెక్నిక్‌ని ఒక శాశ్వతనపుంసకుడు సప్లై చేస్తున్నాడు! ఎంత ఘోరం! నా భర్త అయిన డాక్టర్ కామేశం, అతను ఎందులో డాక్టరో నాకు తెలీదు, నపుంసకుడు అని నేనే స్వయంగా రాసి సంతకం చేసిన స్టేట్‌మెంట్‌ని ఇస్తాను! అమాయకులైన పాఠకులకీ, అమ్మి సొమ్ము చేసుకుంటున్న పత్రికలవాళ్లకీ తెలియజేసి కళ్లు తెరిపించు!"

సీత సహజ చేతినిపట్టుకుని గుమ్మంవైపు కదిలింది. ఇంకా దిగ్భ్రమనుంచి కోలుకోని ఉత్తమ్‌కుమార్, అసంకల్పితంగా వాళ్లని వెంబడించాడు. గుమ్మం దాటుతూ సహజ తలతిప్పి చూసింది.

నిలబడే శక్తినీ, మాట్లాడేశక్తినీ కోల్పోయిన సెక్స్‌స్పెషలిస్ట్ డాక్టర్ కామేశం తన కుర్చీలో కూచున్నాడు. అతని తల టేబుల్ మీదికి వాలిపోయి వుంది.

★ ★ ★





"సెక్స్ స్పెషలిస్ట్ డా.కామేశం నపుంసకుడు!"

"భార్య శ్రీమతి సీత వెల్లడి చేసిన చేదు నిజం!" శీర్షికలకింద ప్రముఖ దినపత్రికలో ప్రత్యక్షమైన వార్త ఆంధ్రప్రజానీకాన్ని ఆశ్చర్యంలో ముంచేసింది. డా.కామేశం స్థిరశీర్షికని ప్రముఖంగా ప్రచురిస్తున్న వివిధ పత్రికల సంపాదకులూ, ఆ శీర్షికల పర్మనెంట్ పాఠకులూ నాలుక కరచుకున్నారు.

ధనదాహంతో తన భర్తా పత్రికలూ సాగిస్తున్న ఆ అశ్లీలవ్యాపారం యువతరాన్ని నాశనం చేస్తూ స్త్రీ జాతిని కించపరుస్తోందన్న అభిప్రాయాన్ని శ్రీమతి సీత వ్యక్తం చేసింది. అది క్షమించరాని నేరమనీ, ఇంతకాలం మౌనంగా భరించిన తనకి సహజ దృక్పథం ధైర్యాన్నిచ్చిందనీ, ఆంధ్రపాఠకులు ఇంకా మోసగించబడటం ఇష్టంలేక తను తెగించి, తనని కాలుస్తున్న నిప్పులాంటి నిజాన్ని బైటపెట్టిందనీ సీత ప్రశ్నలకు సమాధానాలుగా చెప్పింది.

డాక్టర్ కామేశంకు సంబంధించిన ఈ విషయాలు తమకి తెలీదనీ, పాఠకుల్ని మోసం చేసే ఉద్దేశం తమకి లేదనీ, డా.కామేశం శీర్షికల్ని తక్షణం ఆపేస్తున్నామనీ పత్రికల సంపాదకులు ఆ మరుసటి వారం తమ ప్రకటనల్లో తెలియజేశారు.

★ ★ ★

కాలం చాలా చిత్రమైంది.

అది నీళ్లని రాళ్లుగ చేస్తుంది. రాళ్లను నీళ్లుగా మారుస్తుంది.

అది సంభవాన్ని అసంభవం చేస్తుంది, అసంభవాన్ని సంభవం చేస్తుంది.

అది మనుషుల్లో దూరి, మనసుల్ని శాసిస్తుంది.

అది బంధానికి స్వాతంత్ర్యం ఇస్తుంది. స్వాతంత్ర్యాన్ని బంధిస్తుంది.

కాలం ఉత్తమ్‌కుమార్ రూపంలో సహజని తొందరపెట్టింది. తల్లిదండ్రుల రూపంలో సహజని తొందరపెట్టింది.

సంపూర్ణ మద్యనిషేధ ఉద్యమం ఊపందుకుంటోంది. ఆ ఉద్యమంలో క్రియాశీలకమైన పాత్ర నిర్వహించాలన్న తన ఉద్దేశాన్ని ఉత్తమ్‌కుమార్‌కి తెలియజేసింది సహజ. చాలామంచి ఆలోచన అనీ, ఇద్దరం కలిసి కృషి చేద్దామనీ అన్నాడతను.

సహజ అతన్ని తన ఇంటికి ప్రత్యేకంగా తీసుకెళ్లింది. "నేను ప్రేమిస్తున్న యువకుడు ఎవరో, ఎక్కడున్నాడో తెలీదనీ, వరకట్న దురాచారాన్ని ఖండించే వ్యక్తిత్వం, పురుషత్వం వున్న యువకుడు ఎక్కడో వుంటాడు! అని ఆ రోజు మీతో అన్నాను. గుర్తుందా నాన్నా?" అని తండ్రిని అడిగింది సహజ.

"లేకేం?" అన్నారు శ్రీమంతరావు.

"ఆయువకుడు దొరికాడు నాన్నా!"

"హమ్మయ్య! ఎక్కడున్నాడు? ఎవరతను?" అమృతమ్మ ఆత్రంగా అడిగింది.

"ఇదిగో ఇక్కడే ఉన్నాడు!" అంటూ ఉత్తమ్‌కుమార్ని చూపించింది.

ఆ విధంగా సహజా, ఉత్తమ్‌కుమార్ భార్యాభర్తలయ్యారు.

సహజ తనకొక స్వాతంత్ర్యాన్నీ, స్వయం నిర్ణయాధికారాన్నీ ఇచ్చిన ఇంటిని వదిలి, తనకి ఏమిస్తుందో తెలీని అత్తారింటికెళ్లింది.

అత్త రామలక్ష్మి, మామ గోవిందరావూ ఆమెకి స్వాగతం చెప్పారు.

★ ★ ★

సహజ టాక్సీని ఆపమంది.

"ఇక్కడెందుకోయ్?" పక్కనేకూచున్న ఉత్తమ్‌కుమార్ అడిగాడు.

"టాక్సీలో ఇరుకుగావుంది. బైట వాతావరణం హాయిగావుంది. బెంగుళూరుగా! హెూటల్‌దాకా చేతిలో చెయ్యివేసుకుని, అడుగులో అడుగులేసుకుంటూ నడుద్దాం!" అంటూ సహజ డోర్ తెరిచి కిందికి దిగింది.

ఫుట్‌పాత్‌మీద నిలబడి, రోడ్డుకి అటువైపు

న్న పార్కుకేసి చూస్తున్న సహజ దగ్గరగా వచ్చాడు ఉత్తమ్‌కుమార్.

పెళ్లికాక పూర్వం దూదిపింజమేఘాల్లా తేలిగ్గా కనిపించిన జీవితం తేలికతనాన్ని పోగొట్టుకుని ఘనీభవించినట్టు కనిపిస్తోంది. అప్పుడు సహజని తనదాన్నిగా చేసుకోవాల న్న తపనా, నిరీక్షణా తన రక్తంలో ఆవేశంగా పరుగులుపెట్టేవి. ఇప్పుడు ఆమెని సొంతం చేసుకున్న తృప్తి తన నరాల్లో నిండిపో యింది.

కానీ సహజ అప్పుడు ఎట్లావుందో, ఇప్పు డూ అట్లాగేవుంది. తనకి తెలుసు! ఆమెలో పెళ్లి ఇంతవరకూ ఏ మార్పూ తీసుకురాలేదు! అదే ఆవేశం. అదే హుషారు. అదే... అదే.. నిజాయితీ.

"నడుస్తూ తపస్సా స్వామీ!" సహజ ప్రశ్న అతన్ని బెంగుళూరు నగరంలోని హెూటల్ హర్ష ముందుకు లాక్కొచ్చింది.

ఉత్తమ్‌కుమార్ హెూటల్ రిసెప్షన్ దగ్గర ఆగాడు. సహజ మనిషిని అంటిపెట్టుకుని వుండే కీర్తిలా అతని దగ్గరగా నిలబడింది.

"ఎక్స్‌క్యూజ్‌మీ..."

సహజ వెనక్కి తిరిగి చూసింది. పొట్టిగా, కొంచెం లావుగావున్న యువకుడు రిమ్‌లెస్ అద్దాలగుండా ఆమెవైపే చిరునవ్వుతో చూస్తు న్నాడు.

"యూ ఆర్ కల్చరల్ క్రూసేడర్ ఫ్రమ్ ఆంధ్రా మిస్ సహజ..." ప్రశ్న, స్టేట్‌మెంట్ రెండూ కలిసి అన్నాడతను.

"నాట్ మిస్ సహజ. మిసెస్ సహజ!" సహజ నవ్వుతూ అంది. "హియీజ్‌మై హస్బెండ్ మిస్టర్ ఉత్తమ్‌కుమార్!" తమవైపు తిరిగిన ఉత్తమ్‌ని పరిచయం చేసింది.

"అయామ్ అరవింద్! జర్నలిస్ట్. అయామ్ విత్ టైమ్స్ అండ్ టైడ్స్'' అన్నాడ తను ఇద్దరకీ పరిచయం చేసుకుంటూ, ఉత్త మ్‌తో కరచాలనం చేస్తూ.

ఉత్తమ్‌కుమార్ 'హలో' అన్నాడు.

"ఉత్తమ్‌కుమార్.. ఉత్తమ్... యస్! నౌ ఐ రిమెంబర్! యూ ఆర్‌ది గై హూ ఇంట్రడ్యూస్డ్ మిస్ టెంపెస్ట్ టుది పీపుల్! నౌ యుఆర్ హర్ హస్బెండ్! నో వండర్ అండ్ వెరీనైస్'' అరవింద్ గడగడా మాట్లాడేస్తూ సహజవైపు చూశాడు.

"యూనో మిసెస్ సహజా, నేను తెలుగువా ణ్ణి మీ గురించీ, మీ అడ్వెంచర్స్ గురించీ అచీవ్‌మెంట్స్ గురించీ చదివాను. మోస్ట్ ఇంట్రెసింగ్! ఇలా హఠాత్తుగా కల్సుకుంటా మని ఊహించలేదు. ప్లెసెంట్ సర్‌ప్రైజ్!"

"థాంక్యూ''

"మీ పెళ్లి గురించి తెలీదు. యూ ఆరే పాపులర్ ఫిగర్! నాకు ఐ మీన్ జర్నలిస్ట్‌కి తెలీకుండా ఎలా జరిగింది?"

"పెళ్లి పర్సనల్ థింగ్! పర్సనల్ విషయా లకి పబ్లిసిటీ ఉండకూడదు!" సహజ నవ్వు తూ అంది.

"సహజా, వెళ్దామా? సీయూ మిస్టర్ అర వింద్..." ఉత్తమ్‌కుమార్ అన్నాడు.

"జస్టేమోమెంట్! ఒక్కక్షణం!" అరవింద్ తొందరగా అన్నాడు. "కల్చరల్ క్రూసేడర్ అనుకోకుండా దొరికారు! అంత తొందరగా వదుల్తామా? అన్నట్టు మీరెప్పుడొచ్చారు?"

"ఈ హెూటల్లో దిగి మూడు రోజులైంది'' సహజ జవాబిచ్చింది.

"అరెరె! వాటే బ్యాడ్‌లక్! మూడు రోజులు గా మేం ఇక్కడే ఉన్నాం! మేమంటే... జర్నలిస్ట్స్. నేషనల్ లెవెల్ జర్నలిస్ట్ మీట్ జరుగుతోంది. ఇక్కడే ఈ హెూటల్లోనే! ముందే తగిలివుంటే మూడు రోజులూ మీరు పార్టిసిపేట్ చేసి వుండొచ్చు! ఓకే లెట్స్ ఫర్గెట్ ది పాస్ట్ అండ థింక్ ఎబౌట్ ప్రెజెంట్! సహజగారూ, ఉమెన్స్‌లిబ్‌లో మీరు ఒక రాడికల్ ఫార్ములా కనిపెట్టారు! మీ ఆలోచన ల్ని మా జర్నలిస్ట్స్‌కి వినిపించండి. ఒక గంట మీకు కేటాయిస్తా'' అరవింద్ గుక్కతిప్పు కుంటూ ఆగాడు.




"మిస్టర్ అరవింద్, ఐ థింక్ యూ హేవ్ యువర్ షెడ్యూల్ ఆఫ్ ప్రోగ్రామ్స్! వై డిస్టర్బింగ్ దెమ్?" ఉత్తమ్‌కుమార్ కల్పించుకుంటూ అన్నాడు.

"నోనోనో! అలాంటిదేంలేదు! అన్ని రాష్ట్రాలకీ, అన్ని భాషలకీ చెందిన జర్నలిస్టులున్నారు! ఆడవాళ్లు కూడా! సహజగారు రావడం రెండువిధాలా మంచిది! ఆమె థాట్స్ అన్ని భాషల ప్రజలకీ అందుతాయి. ఆమె నేషనల్ లెవెల్లో అందరికీ తెలుస్తుంది'' అంటూ అరవింద్ సహజవైపు తిరిగాడు. "మిసెస్ సహజా, ప్లీస్‌డూ కమ్! మావాళ్లకి మా తెలుగు క్రూసేడర్‌ని పరిచయం చేసి గర్వించే అవకాశం నాకు ఇవ్వండి!"

"భలేవారే! అవకాశం నాది కూడా! వస్తాం..." సహజ నవ్వుతూ అంది.

"థాంక్యూ థాంక్యూ! ఇవాళ ప్రోగ్రాం ఫైవ్‌టు నైన్ ఉంటుంది. ఎనిమిది నుండి తొమ్మిదిదాకా మీది! ఓకే!" అరవింద్ ఉత్సాహంగా అన్నాడు.

'సూట్స్ అజ్‌వెల్!" సహజ నవ్వింది.

"కాన్ఫరెన్స్ హాల్... ఫోర్త్‌ఫ్లోర్.. మీ గది?"

"థర్డ్‌ఫ్లోర్ త్రీఫోర్ ఫైవ్.." సహజ అంది.

"ఓకే నేనొచ్చి మిమ్మల్ని తీసుకెళ్తాను. ఏడూ యాభై అయిదుకి మీ గదిముందుంటాను ఓకే?"

"మిస్టర్ అరవింద్, మీరు డీవియేట్ అవకండి. ఏడూ యాభై అయిదుకి సహజ కాన్ఫరెన్స్ హాల్లో వుంటుంది!" ఉత్తమ్‌కుమార్ అన్నాడు.

"ఓకే! థాంక్యూ! బిజీగా వుంటాను కూడా! వస్తారుగా!" అంటూ అరవింద్ వాచీ చూసుకుని లిఫ్ట్‌వైపు పరుగెట్టాడు.

సహజ ఉత్తమ్‌కుమార్‌వైపు చిరునవ్వుతో చూసింది.

"అబ్బ! మన తెలుగువాళ్లు అధికంగా మాట్లాడేస్తారు!" ఉత్తమ్‌కుమార్ కణతల్ని నొక్కుకుంటూ అన్నాడు.

"అతను అతిగా మాట్లాడలేదే! అతను మాట్లాడిందంతా నీట్‌లీ ఎడిటెడ్ వెర్షన్! ఓహ్! తలనొప్పిగా ఉందా? గదికెళ్దాం!" అంటూ భర్త చేతిని పట్టుకుంది సహజ.

లిఫ్ట్ వాళ్లిద్దర్నీ పైకి తీసుకెళ్తోంది. వెనక్కి వాలి నీరసంగా నిలబడ్డ ఉత్తమ్‌కుమార్ కళ్లు లిఫ్ట్ అవతలున్న ఏదో శూన్యంలోకి చూస్తున్నాయి. సహజ అతన్ని ప్రశ్నార్థకంగా చూసింది.

"వేడివేడి నీళ్లతో స్నానంచేసి కాసేపు రెస్ట్ తీసుకో! తలనొప్పి తగ్గిపోతుంది. ఈలోగా నేనూ ఓ కునుకు తీస్తా. కాన్ఫరెన్స్‌కెళ్లేసరికి మనం ఫ్రెష్‌గా ఉండాలి!" అంది నవ్వుతూ. చిరునవ్వు అనుమానిస్తూ అనుమానిస్తూ ఉత్తమ్‌కుమార్ మొహంమీద ప్రత్యక్షమైంది...

"సహజా! సహజా!" పిలుపు మెత్తగా, లీలగా నిద్రలోకి కూరుకుపోయిన సహజకి వినిపిస్తోంది. ఆమె కనురెప్పలు నిద్రని పైకి తోసేస్తూ కదిలాయి. ఉత్తమ్‌కుమార్ మొహం ఆమె మొహంలోకి తొంగిచూస్తోంది. అతను చూపుడువేలు విల్లు సగభాగంలావున్న ఆమె కనుబొమమీద అక్షరాన్నిదిద్దే కుర్రాడి చేతిలోని బలపంలా కదుల్తోంది.

"కమాన్! గెటప్! ఎనిమిదీ ఇరవై!" ఉత్తమ్‌కుమార్ నవ్వుతూ అన్నాడు.

సహజ తటాలున లేచి కూచుంది "ఎనిమిది దాటిందా? అరెరె! కాన్ఫరెన్స్‌కి ఎనిమిదింటికే వెళ్లాలిగా! అప్పుడే లేపకపోయావా? ఎట్లా?"

ఉత్తమ్‌కుమార్ ధైర్యం చెప్తున్నట్టు చిరునవ్వు నవ్వాడు. "కంగారుపడొద్దులే! ఏడుంపావుకి అరవింద్ ఫోన్ చేశాడు. చివరిరోజు సమావేశానికి అనుకోకుండా ఎవరో మినిస్టర్ వచ్చేస్తానన్నాట్ట. మనకి ఇచ్చినటైమే మినిస్టర్‌వాళ్లకి ఇచ్చార్ట! చాలా అజెండా వుండిపోయింది కాబట్టి ముందుగా మనల్ని ఇరికించడానికీ వీల్లేకపోయిందట! బాధపడిపోయాడు.

నీకు కోటి సారీలు చెప్పమన్నాడు. ఆంధ్రాకి వచ్చినప్పుడు కల్సుకుంటానని చెప్పమన్నాడు!"

"అలాగా!" సహజ నిరుత్సాహంగా అంది.

"కపాలీ థియేటర్‌లో క్లియోపాత్రా సెకెండ్ షోకి వెళ్తున్నాం. గెటప్ అండ్ గెట్‌రెడీ!"

"వెళ్లాలనిపించడంలేదు..."

"వెళ్లి తీరాలి... ఎందుకంటే ఒక ప్రోగ్రాం ఫిక్సై, మిస్ అయితే డల్‌నెస్ వచ్చేస్తుంది. మరో కొత్త ప్రోగ్రాం పెట్టుకున్నామనుకో ఉషారొచ్చేస్తుంది. మెజెస్టిక్‌లో భోంచేసి, కపాలీకెళ్లిపోగాం! లేలేలేలే!" ఉత్తమ్‌కుమార్ తొందరపెట్టాడు.

సినిమానుంచి గదికి వచ్చాక "స్నానం చేసొస్తా పది నిముషాలు... రిలాక్స్'' అంటూ బాతురూమ్‌లో దూరాడు ఉత్తమ్

సినిమాలో లిజ్‌టేలర్‌నీ, క్లియోపాత్రానీ మరిచిపోవడానికి ప్రయత్నిస్తూ, సోఫాలో వాలింది సహజ.

తలుపు చప్పుడు.

ఇంత రాత్రివేళ ఎవరొచ్చారు? సహజ క్షణంసేపు తటపటాయించి తలుపు దగ్గరకెళ్లింది. "హు ఈజిట్?"

"రూమ్ సర్వీస్''

సహజ తలుపు తెరిచింది. హొటల్ బాయ్‌గుమ్మంలో నిలబడ్డాడు. అతని చేతుల్లో ట్రేవుంది. ట్రేలో తెల్లటి చిన్న కవరుంది. సహజ ఆ కవర్‌మీద తన పేరూ, రూమ్‌నంబరూ ఉన్నట్టు గుర్తించింది. కవరు అందుకుని థాంక్స్ చెప్పి, తలుపుమూసి గొళ్లెంపెట్టింది. కవర్ ఎడంవైపు క్రింది భాగంలో అరవింద్ అని రాసి వుంది.

సహజ కవర్ని చింపి, కాగితంలాగి సోఫాలో కూచుంది. తెలుగూ, ఇంగ్లీషూ కలగలిపి రాసిన అరవింద్ ఉత్తరాన్ని చదవసాగింది.

"మిసెస్ సహజా!

కాన్ఫరెన్స్‌కి మీరు రావట్లేదని తెలిశాక మేమంతా చాలా డిజపాయింటెడ్ అయ్యాం. ఎజెండాలో లాస్టవర్‌లో మీ లెక్చర్ కమ్ క్వశ్చన్స్ అండ్ ఆన్సర్స్ ఫిక్స్‌చేశాం. ఐ ఫెల్ట్ సిల్లీ! సడన్‌గా మీ హెల్త్ అప్‌సెట్ అయిందని మీ హస్బెండ్ ఫోన్ చేశాక, నేనూ అప్‌సెట్ అయ్యాను!"

సహజ చదవడం ఆపేసి, కనుబొమలు ముడివేసి, ఎదురుగా వున్న గోడని చూస్తూ వుండిపోయింది. అప్రయత్నంగా ఆమె కళ్లు ఉత్తరం మీద వాలాయి.

"ప్రిలిమినరీ స్టేజ్‌లో సిక్‌నెస్ మామూలే! విష్‌యూ ఏ డాటర్! మీలాంటి స్త్రీకి మీలాంటి కూతురే పుట్టాలి! కాన్ఫరెన్స్ అయిపోయాక మీకెలావుందో తెలుసుకుందామని మీ గదికి వచ్చాను. లాక్ చేయబడింది. రిసెప్షన్‌లో వాకబుచేసి ఐ ఫౌండ్‌ఔట్ యూహేవ్ గాన్ ఔట్. డాక్టర్ని చూడ్డానికి వెళ్లుంటారు. కాన్ఫరెన్స్‌లో మీరు పార్టిసిపేట్ చేసివుంటే గ్రాండ్‌గా వుండేది! లెట్స్‌ఫర్గెటిట్! టుమారో మార్నింగ్ ఫోన్ చేస్తాను. గెట్ వెల్‌సూన్!

అరవింద్''

రెండోసారి ఉత్తరాన్ని చదివి, మడిచి కవర్లోపెట్టి లేచివెళ్లి తలగడకింద పెట్టేసి, మంచంమీద వాలింది సహజ. ఉన్నట్టుండి ఎయిర్ కండిషన్‌డ్ రూమ్‌లో ఉక్కపోస్తున్నట్టనిపించిందామెకి.

"ప్రిలిమినరీ స్టేజ్‌లో సిక్‌నెస్ మామూలే'

"విష్‌యూ ఏ డాటర్!"

"మీ హస్బెండ్ ఫోన్ చేసి..."

అరవింద్ రాసిన పంక్తులు ఆమె కళ్ల ముందు ప్రత్యక్షమయ్యాయి. "ఏడుంబావుకి అరవింద్ ఫోన్ చేశాడు..." ఉత్తమ్‌కుమార్ కంఠం మూడున్నర గంటల గతంలోంచి ఆమెకి వినిపించింది. ఉత్తమ్, తన భర్త తనతో అబద్ధమాడాడని ఆమెకి ఎవరూ చెప్పకుండానే అర్థమైపోతోంది! ఉత్తమ్ చెప్పిందే




నిజమైతే, తన కార్యక్రమం రద్దయినందుకు క్షమాపణలు చెప్తూ రాసివుండేవాడు అరవింద్!

ఉత్తమ్‌కి అబద్ధాలాడే అలవాటుందా? పరిచయమైన ఏడాదిగా అతను ఎప్పుడూ తనతో అబద్ధాలాడినట్టు అనుమానం కూడా కలగలేదు! అయితే ఇవాళ అరవింద్ తనకి ఫోన్ చేసి ప్రోగ్రాంకాన్సిల్ అయిందని చెప్పినట్టు తనకెందుకు చెప్పాడు? ఎందుకు? తను కాన్ఫరెన్స్‌కి వెళ్లడం ఇష్టంలేకా? ఎందుకు ఇష్టంలేదు? తన హృదయాన్ని తీసుకుని, తనకి హృదయాన్ని ఇచ్చిన ఉత్తమ్ తనతో నిజం చెప్పలేదన్న నిజం, తనతో అబద్ధాలాడాడన్న నిజం సహజ హృదయాన్ని ముల్లులా గుచ్చుతోంది. ఆ ముల్లు ఎన్నో ఏవో అనుమానాల ముళ్లుగా మల్టిప్లై అవుతోంది! ఉత్తమ్ తన స్నేహితుడు, తన ప్రియుడు, తన భర్త తన సర్వస్వం తనతో అబద్ధం ఎందుకు ఆడాడు?

ఆమెలో ఆమె చిన్న హృదయంలో జెయింట్ వీల్‌లా తిరుగుతున్న ఆ ప్రశ్నకి సమాధానం చెప్పడానికా అన్నట్టు ఉత్తమ్‌కుమార్ బాత్‌రూమ్‌లోంచి ఇవతలికి వచ్చాడు.

"నిద్రొస్తోందా?" మంచంమీద పడుకున్న సహజను చూస్తూ అడిగాడు.

సహజ మాట్లాడకుండా అతన్నే చూస్తోంది. అతను టర్కిష్ టవల్‌తో తల తుడుచుకుంటూ మంచం దగ్గరగా వచ్చాడు.

"నిన్నే! నిద్రొస్తోందా అని అడిగాను''

"ఉత్తమ్... నేనొకటి అడుగుతాను. నిజం చెప్తావా?" సమాధానం చెప్పకుండా అడిగింది సహజ.

"నీతో ఎప్పుడూ నిజమే చెప్తానుగా'' నవ్వుతూ అన్నాడు.

"అయితే అరవింద్ ఫోన్ చేశాడనీ, నా ప్రోగ్రాం కాన్సిలయ్యిందనీ చెప్పినట్టు ఎందుకు అబద్ధమాడావ్?"

సహజ ప్రశ్న అతన్ని చెంపపెట్టులా తాకింది. టర్కిష్ టవల్ తటాలున జారి కిందపడింది. చూపుల్ని ఆమె మొహంమీంచి తప్పించకుండా, వొంగి టవల్ని అందుకున్నాడు. "అబద్ధమా? నీతోనా? నెవర్'

"అయామ సారీ ఉత్తమ్. నీనుండి రెండో అబద్ధం వింటున్నా''

"సహజా..."

"ఎంత కర్కశంగా వున్నా- నేను నిజాన్ని తట్టుకుంటాను. అబద్ధాన్ని సహించలేను. చెప్పు... ఉత్తమ్ అబద్ధమెందుకాడావ్?"

"కలగన్నావా? నీకెందుకీ అనుమానం వచ్చింది? వైషుడ్ ఐ లైటూ యూ?"

సహజ తటాలున పైకి లేచింది. తలగడ కిందున్న కవర్ని తీసి అతని దగ్గరగా మంచం మీదికి విసిరింది. "అబద్ధాలాడ్డంలో నీకు లభించిన 'మెరిట్ సర్టిఫికెట్' అందులో వుంది''

ఉత్తమ్ కవర్ని అందుకుని, లోపలున్న కాగితాన్ని ఇవతలకి లాగాడు. రెండు చేతుల్తో పట్టుకుని ఆత్రంగా చదువుతూ ఉండిపోయాడు. ఉత్తరం అతని చేతుల్లోంచి కిందికి జారింది. అతని తల మెల్లిగా పైకి లేచింది. కళ్లు సహజ కళ్ళల్లోకి చూశాయి. ఆ కళ్లల్లో మెరుపులా మెరిసి మాయమైపోయిన ఆగ్రహం సహజ చూపుల్నించి తప్పించుకోలేకపోయింది.

"సహజా... అయాం సారీ..."

"అబద్ధం ఎందుకు ఆడావో చెప్తే అదే నేను స్వీకరించే సారీ అవుతుంది, ఉత్తమ్''

"...నువ్వు ఎక్కడికీ ఐమీన్... మనం ఎక్కడికీ వెళ్ళడం నాకు ఇష్టంలేదు. మనిద్దరం ఒంటరిగా ఉండాలనిపించింది. అందుకని..."

"నువ్వు నిజం చెప్పడం లేదని నీకళ్లు నాకు చెప్తున్నాయి. ఉత్తమ్! నీనుండి నా భర్తనుండి నేను అబద్ధాలు వినను. నువ్వు ఏదో చెప్పిన ప్రతీసారీ నా భర్త నాతో

అబద్ధమాడాడేమో' అన్న అనుమానంతో నరకయాతనపడే శిక్ష నాకు విధించొద్దు. నిజం చెప్పు. ఇంకెప్పుడూ అబద్ధం చెప్పనని చెప్పు''

ఉత్తమ్ ఉక్కిరి బిక్కిరవుతూ చూశాడు. "నువ్వు కాన్ఫరెన్స్‌కి వెళ్ళడం నాకు ఇష్టంలేదు..."

"అది నాకు తెలుసు. ఎందుకు?"

"అన్ని రాష్ట్రాలనుండీ వచ్చిన జర్నలిస్టుల సమావేశంలో నువ్వు మాట్లాడ్డం, నీ గురించి వాళ్లు పేపర్లలో రాయడం, పేపర్లలో నీ ఫోటోలు అచ్చవడం... నాకు ఇష్టంలేదు. అయాం సారీ... సహజా..."

"ఎందుకు?"

ఉత్తమ్ అతిప్రయత్నంమీద తలపైకెత్తాడు. "అలాంటి పబ్లిసిటీ ఇకమీదట ఉండదని ఇష్టం లేకపోయినా అమ్మకి మాటిచ్చాను...''

సహజ నివ్వెరపోతూ చూసింది. "ఎందుకు?"

ఉత్తమ్ నీళ్లునమిలాడు. "తన కోడలు... ఇంటిపట్టున సంసారపక్షంగా ఉండాలనీ, పేపర్లలోకీ, పత్రికల్లోకీ ఎక్కుతూ పదిమంది దృష్టిలో పడకూడదనీ అమ్మ అభిప్రాయం..."

సహజ కళ్లు పెద్దవి చేసింది.

"అయాం సారీ, సహజా... నీ అడ్వెంచర్స్ ద్వారా బాగా పాపులర్ అయిపోయావు... మొదట్లో అమ్మ మన పెళ్లికి వొప్పుకోలేదు. చివరికి, పెళ్ళయ్యాక... అలాంటివేమీ ఉండకూడదన్న షరతుమీద... ఒప్పుకుంది. నువ్వు బాధపడతావని నీకు చెప్పలేదు. నిన్ను చేజార్చుకోడం ఇష్టంలేక అమ్మ కండిషన్‌కి తలవంచాను. ఐ లవ్ యూ సహజా..."

సహజ అతన్ని తదేకంగా చూసింది. "కాన్ఫరెన్స్‌కి వెళ్ళడం ఇష్టంలేదనీ, రాలేమనీ నువ్వు అరవింద్‌కి అప్పుడు చెప్పిఉండాల్సింది. చెప్పివుంటే అప్పుడునాతో అబద్ధాలాడే దురవస్థ పట్టేదికాదు''

"అయాంసారీ సహజా... చెప్పలేకపోయాను''

"ఉత్తమ్, నాకు ఇప్పుడు ఎన్నో నెల?" సహజ ప్రశ్న అతన్ని ఆశ్చర్యంలో పడేసింది.

"సహజా... ఐమీన్... నేనలా చెప్పలేదు''

"అబద్ధం అనేది ఒక కష్టం. అది ఒంటరిగా రాదు. పోదు'' సహజ గంభీరంగా అంది. "నెవర్ లై టు మీ హియరాఫ్టర్. నెవర్ లై టూ ఎనీవన్... అన్నట్టు మీ అమ్మగారు ఇంకా ఏమేం షరతులు పెట్టారు?"

ఉత్తమ్ దెబ్బతిన్నవాడిలా చూశాడు. "ఏమీలేదు. అమ్మ పాపం..."

"నన్ను పేపర్లలోకీ, పత్రికల్లోకీ ఎక్కించింది నువ్వే అనీ, గతంలో నేను పేపర్లలోకి ఎక్కినా, భవిష్యత్తులో ఎక్కినా, అదంతా ఆమె జాతి అయిన స్త్రీ జాతికోసమే అని మీ అమ్మగారికి చెప్పివుండాల్సింది ఉత్తమ్''

"సహజా..."

"అయాం సారీ ఫర్ యూ ఉత్తమ్ గుడ్ నైట్''

ఒత్తిగిలి పడుకున్న సహజని అయోమయంగా చూస్తూ ఉత్తమ్ మంచంమీద పడుకుని లైటు తీసేశాడు. ఎర్రరంగు జీరోవాట్ బల్బు కాంతి గదిని పలచగా కప్పింది. ఉత్తమ్ నరాల్లో ఏదో నీరసం, దిగులూ రక్తంగా మారి ప్రవహిస్తున్నాయి. తండ్రి జేబులోంచి చిల్లర దొంగిలిస్తూ దొరికిపోయిన కుర్రాడిలా ఫీలవుతున్నాడతను. వెనకా, ముందూ ఆలోచించకుండా తను బైటపడిపోయాడు. సహజని బాధపెట్టి, తనూ బాధపడిపోతున్నాడు. తన బాధ ఎందుకు? దొరికిపోయినందుకా? సహజను బాధపెట్టినందుకా? నిమిషాలు నడుస్తున్నాయి. నిద్రపట్టని ఉత్తమ్ ఇబ్బందిగా కదిలాడు. సహజ చెప్పిన 'గుడ్‌నైట్'




అసహజంగా అనిపిస్తోంతదనికి.



రామలక్ష్మి అర్థం కానట్టు సహజవైపు చూసింది. అయిష్టత ఆమె మొహంమీద అలలాగా కదుల్తోంది.

"ఇన్నాళ్ళూ హనీమూనంటూ, ఇంటిపట్టున లేకుండాపోయావు. తిరిగొచ్చాకయినా ఇంటిపట్టున వుండు. ఇప్పుడా మీటింగుకి మనం వెళ్ళకపోతే ఏం?"

"రావాలనుకుంటే మీరు కూడా రావొచ్చు అత్తయ్యా! స్త్రీల గురించే ఆ మీటింగ్. వివిధ పత్రికల ఎడిటర్స్ వస్తున్నారు. స్త్రీని కించపరచే అసభ్యరచనల్ని ప్రచురించవద్దని వాళ్ళని అడగబోతున్నాం. మీలాంటి పెద్దవారు అభిప్రాయాలు చెప్తే చాలా బాగుంటుంది. వస్తారా, అత్తయ్యా?" సహజ ఉత్సాహంగా అడిగింది.

"బాగుంది" రామలక్ష్మి వెటకారంగా అంది. "దిగవద్దే... మునిగిపోతావ్. అంటే నువ్వూ దిగు. లోతు చూద్దాం అందిట వెనకటికి ఎవత్తో. అలావుంది నీ ఆహ్వానం! పేపర్లకీ, పత్రికలకీ ఎక్కడం నాకిష్టంలేదని అబ్బాయి నీకు చెప్పలేదా?"

"మొన్న బెంగుళూర్లో చెప్పాడు..."

"పెళ్ళికిముందే నా షరుతులన్నీ చెప్పమన్నానే. అంత్య నిష్ఠూరంకన్నా ఆది నిష్ఠూరం మంచిదని నాకు తెలుసు" రామలక్ష్మి నవ్వుతూ అంది. అది నవ్వు కాదని సహజకి తెలుసు. అది ఆగ్రహానికి తగిలిస్తున్న మాస్క్.

హాల్లో గోడవారగా టేబుల్మీదున్న టెలిఫోన్ మోగుతోంది. సహజ రిసీవర్ అందుకుంది. అటువైపున విప్లవ వనితావేదిక కాదంబరి. సహజ 'హలో' అంది.

"సహజేనా? సహజా! మీకోసమే ఎదురు చూస్తున్నాం. అందరూ వచ్చారు. రవిచంద్ర తప్ప! ఏమిటి ఆలస్యం?" కాదంబరి అడిగింది.

"మా అత్తగారు వస్తారేమో అని..."

"గుడ్ ఐడియా! ఆవిడగార్ని తీసుకురా! పెద్ద ముత్తైదువుగా, సీనియర్ గృహిణిగా ఆమె కూడా మాట్లాడ్డం మంచిది"

"అత్తగారు రానంటున్నారు. నేనొక్కత్తినే వస్తున్నా... అన్నట్టు మా ఆయన్ని కూడా రమ్మన్నాను. బైటికెళ్ళారు. అట్నుంచి అటే రావొచ్చు. ఉంటా. బయల్దేరుతున్నా" సహజ రిసీవర్ పెట్టేసి రామలక్ష్మివైపు చిరునవ్వుతో చూస్తూ గుమ్మంవైపు వెళ్ళిపోయింది.

రెప్ప వేయకుండా సహజనే చూస్తూ, సోఫామీద కూచుని, బుసలుకొడుతూ, కొడుకుకోసం ఎదురుచూడ్డం ప్రారంభించింది రామలక్ష్మి.

"నువ్వు వెళ్ళకుండా ఉంటే బాగుండేది..." ఆ రాత్రి గదిలోకి రాగానే అన్నాడు ఉత్తమ్. "అమ్మ నానా రభసా చేసింది"

"అలాగా" సహజ సాదాగా అంది.

ఉత్తమ్ ఆమెవైపు ఆశ్చర్యంగా చూశాడు. "పైగా అమ్మని కూడా ఉద్యమాల్లోకి రమ్మన్నావట. ఆ ఎగతాళి ఎందుకు?"

"ఉద్యమాల్లోకి కాదు. మీటింగుకి సీనియర్ మహిళగా రమ్మన్నాను. ఎగతాళి కాదు. నిన్ను కూడా రమ్మన్నాను... రాలేదేం?"

"రాలేదు" ఉత్తమ్ ఇంకా సాదాగా అన్నా





డు. "నువ్వు పార్టిసిపేట్ చేయడం, నేను ప్రెస్‌కవరేజ్ ఇవ్వడం... అసహ్యంగా వుంటుందని రాలేదు''

సహజ ఆశ్చర్యంగా అతని మొహంలోకి చూసింది. "మొన్న మొన్నటిదాకా... ఇద్దరం కలిసే పనిచేశాంగా''

"అప్పుడు వేరు. ఇప్పుడు వేరు. ఇప్పుడు మనం భార్యాభర్తలం" ఉత్తమ్ విసుగ్గా అన్నాడు. "'భార్య అడ్వెంచర్స్ చేస్తోంటే భర్త దండోరా వేస్తున్నాడు' అని అందరిచేతా అనిపించుకోవడం నాకిష్టం లేదు''

"ఉత్తమ్..." భర్త వరస అర్థంగాని సహజ ఆశ్చర్యపోతూ అంది. "ఒక పాడుపని చేయొద్దు అని భార్యాభర్తలు కలిసి, ఏక కంఠంతో లోకానికి చెప్పడంలో తప్పులేదు ఉత్తమ్''

"సహజా..." ఉత్తమ్ నిట్టూర్చాడు. నిదానించి ఆమె మొహంలోకి చూశాడు.

"లోకం స్త్రీని గౌరవించాలని నువ్వు ఎలా కోరుకుంటున్నావో నేనూ అలాగే కోరుకుంటున్నాను. అందుకే నన్ను కన్నతల్లిని గౌరవిస్తున్నాను. అందుకే అమ్మను కష్టపెట్టే, అగౌరవించే పనులు మనిద్దరం చేయకూడదని అంటున్నాను. నన్నర్థం చేసుకో సహజా. తన కోడలు తనలాగే సంసారపక్షంగా బతకాలని అమ్మ ఆశ. అందుకే..."

"లోకంలోని స్వార్థం తనని బజార్లో పడేస్తూంటే స్త్రీ సంసారపక్షంగా బతకలేదు ఉత్తమ్''

"అదంతా అమ్మకి అర్థంకాదు..."

"నీకు అర్థమౌతోందిగా... అది చాలు''

ఉత్తమ్ బరువుగా నిట్టూర్చాడు. "నా ఒక్కడికే అర్థం అయితే చాలదు సహజా! అమ్మకి కూడా అర్థం కావాలి''

సహజ అతని కళ్ళల్లోకి తదేకంగా చూ






సింది. "ఈ విషయం పెళ్ళికిముందే నువ్వు చెప్పి ఉండాల్సింది..."

ఉత్తమ్ నీరసంగా మంచంమీద కూచు న్నాడు. "సహజా... ఐవాజ్ హెల్ప్‌లెస్. అయామ్ హెల్ప్‌లెస్. అమ్మ షరతులు చెప్తే నువ్వు నన్ను చేసుకోవేమో అని భయపడ్డా ను. నన్ను అపార్థం చేసుకోకు. కట్నానికి వ్యతిరేకమే. అయితే... అమ్మకాదు. ఆ విష యంలో అమ్మని ఒప్పించాను. ఇతర కోరిక లలో అమ్మని ఒప్పించలేను"

సహజ అతన్ని జాలిగా చూసింది. "ను వ్వు పొరపాటు చేశావ్"

ఉత్తమ్ ఉలిక్కిపడి చూశాడు. సహజ చిన్నగా నవ్వింది. "అయినా ఫరవాలేదు. యూగాట్ యువర్ వోన్ ఆపర్చ్యూనిటీ..."

ఉత్తమ్ ఆమె ఏం చెబుతుందోనని ఆందోళ నగా చూశాడు.

"యూఆర్ లక్కీ, ఉత్తమ్. ప్రతి ఇంట్లోనూ స్త్రీ తనకి చెందిన పురుషుణ్ణి మార్చాలన్న సిద్ధాంతాన్ని మనం ప్రచారం చేస్తున్నాం. ఇక్కడ అది రివర్స్ అయింది. ఇక్కడ ఒక పురుషుడు ఒక స్త్రీని ఎడ్యుకేట్ చేసే అవ కాశం ఉంది. అత్తయ్యని మార్చే ప్రయత్నం చేయి. ఆమె సానుభూతీ, సహకారం మనకి లభించేలా చూడు. నేనూ నీకు సహాయం చేస్తాను"

ఉత్తమ్ తటాలున సహజ చేతిని పట్టుకున్నా డు. ఆవేశంతో ఆమె మొహంలోకి చూశాడు. "సహజా... అమ్మకి నేను రుణపడివున్నాను. ఎందుకో తెలుసా? నిన్ను నా భార్యగా చేసుకో డానికి ఆమె అంగీకరించింది. ఆమెను మార్చేశక్తి నాకు లేదు. అయాం సారీ... సహజా... నేను జర్నలిస్ట్‌గా వుంటూ అవీ ఇవీ రాస్తూ ఎవడికో ఆగ్రహం తెప్పించి, బలైపోవడం అమ్మకి ఇష్టంలేదు. పెళ్ళ య్యాక ఆ వృత్తికి స్వస్తి చెప్పి, ఏదో ఉద్యోగం

చూసుకుంటానని మాటిచ్చాను. అందుకే ఇవాళ ఒక ప్రైవేట్ కంపెనీలో అసిస్టెంట్ మేనేజర్‌గా జాయిన్ అయ్యాను..."

"కంగ్రాట్స్! చెప్పవేం?"

"చెప్పకుండా ఎలా వుంటాను? డోంట్ డైవర్ట్. మనిషి జీవితంలో ఎన్నో ఆశ్రమాలు స్టేజస్ ఉన్నాయి. పెళ్ళికాకముందు అడ్వెంచర్‌గా ఏవేవో చేశాం. ఇప్పుడు గృహస్థులుగా సెటిల్ అవుదాం. నా మాట విను సహజా. ఎంజాయ్ లైఫ్. మిస్ టెంపెస్ట్‌గా నిలిచిపో. 'మిసెస్ టెంపెస్ట్' కావద్దు. అమ్మ కోసం, నా కోసం" ఉత్తమ్ ఉద్రేకంతో చెప్పి, సహజ కళ్లల్లోకి తదేకంగా చూశాడు.

సహజ మొహంమీద చిరునవ్వు వెన్నెల్లా మెరిసింది. "గుడ్‌నైట్ ఉత్తమ్''

ఉత్తమ్ కంగారుగా, బాధగా చూశాడు. "సహజా! నాకు గుడ్‌నైట్ చెప్పొద్దు. అది షార్ట్ టర్మ్ 'గుడ్‌బై'లా వినిపిస్తుంది నాకు''

సహజ పకపక నవ్వుతూ అతని చేతిని పట్టుకుంది.

సన్నగా గురక ప్రారంభించిన ఉత్తమ్‌ని చూస్తూ సహజ వెల్లకిలా తిరిగింది.

'మిస్ టెంపెస్ట్‌గా నిలిచిపో'

'మిసెస్ టెంపెస్ట్ కావొద్దు'

సంభవామి గృహే గృహే- ఉపక్రమణిక ద్వారా లోకానికి, స్త్రీ లోకానికి తను అందించిన స్ఫూర్తి తనకి కూడా స్ఫూర్తే. ఆ స్ఫూర్తిని విస్మరించి తను ఆత్మద్రోహం చేసుకోదు. ఈ నిర్ణయం ఈనాటిది కాదు... ఆనాటిది. తను నవల రాయడం ప్రారంభించి, దానికి ఉపక్రమణికరాసిన... ఆ... నా... టి.... ది...!

సహజ తనకి తెలీకుండానే నిద్రలోకి జారుకుంది...

★ ★ ★

"మామయ్యా... మీతో కొంచెం మాట్లాడాలి'' మామయ్య ఇరవైనాలుగ్గంటలూ నెమరువేసే వేరుశనగ్గింజల్ని టేబుల్‌మీద పెడుతూ అంది సహజ.

"రాశిఫలితాలు వర్కౌట్ చేస్తున్నా ఎల్లుండి ప్రారంభమయ్యే ఎన్నికల్లో ఏ పార్టీ గెలుస్తుందో, వీలైతే ఎన్ని సీట్లు గెలుస్తుందో తేల్చాలి. తల చెడిపోయే కాల్క్యులేషన్. తరవాత మాట్లాడవచ్చుగా. తొందరేం లేదుగా?" వేరుసెనగ పప్పులు నోటితో రుబ్బుతూ గోవిందరావు.

"ఎలాగా డిస్టర్బ్ అయ్యారు. మీతో కొంచెం మాట్లాడాలి..."

"ఏమిటో చెప్పు, త్వరగా''

"స్త్రీని గౌరవించాలా వద్దా, మామయ్యా?"

"గౌరవించితీరాలి. అందుకేగా నేను మీ అత్తయ్యను అంతగా గౌరవిస్తాను?"

"స్త్రీ సమస్యల పరిష్కారం కోసం నేను కృషి చేస్తున్నాను. స్త్రీ ఆత్మగౌరవంకోసం పాటుపడుతున్నాను. అది తప్పా మామయ్యా?"

"తప్పెట్లా అవుతుంది? యత్ర నార్యస్తు పూజ్యంతే... తరవాతేమిటి?... అన్నారుగా?"

"అయితే నామీద మీరు కోప్పడ్డారట..."

"మీ అత్తయ్య కోప్పడుతోందిగా''

"మామయ్యా... ఈనాడు స్త్రీ సమాజంలో అనేకరంగాల్లో నిర్లక్ష్యం చేయబడుతోంది. అవమానించబడుతోంది. ఈ క్షీణదశను దూరంచేసి స్త్రీ గౌరవాన్ని పునరుద్ధరించడానికి నేను కృషిచేస్తున్నాను... నా స్వాతంత్ర్యాన్ని అడ్డుకోవద్దని అత్తయ్యగారికి మీరు చెప్పండి, మామయ్యా''

"నన్నడిగితే అదంత సులువు కాదు. స్త్రీ జాతకం మారాలి. అంతే! ఎంతకృషి చేసినా అంతే!"

"మన కుటుంబానికి అపకీర్తి తెచ్చే పనులేవీ నేను చేయడంలేదు మామయ్యా. మనందరికీ గౌరవం తెచ్చే పనేచేస్తున్నా...




అత్తయ్యగారితో మీరు..."

"గౌరవం అంటున్నావు కాబట్టి చెప్తున్నా. నేను స్త్రీ అయిన మీ అత్తయ్యని గౌరవిస్తున్నా. నీ గురించి కూడా ఆమే ఆలోచిస్తుంది. ఎందుకంటే ఆమె ఆలోచనల్నీ, ఆమెనీ నేను గౌరవిస్తాను. నువ్వూ గౌరవించాలి. మనిద్దరం గౌరవించాలి''

"అది కాదు. మామయ్యా..."

"గొడవెందుకు? ఎన్నికల ఫలితాలు వర్కౌట్ చేసేశాక, నీ జాతకం రాస్తాను. మీ అత్తయ్యకీ నీకూ పొందుతుందో లేదో చెప్తాను. తరవాత సమస్యే ఉండదు. శాంతులు ఏవైనా అవసరం అయితే చెప్తాను. ఆ తర్వాత మీ అత్తయ్య మాటని నువ్వే గౌరవిస్తావు''

★ ★ ★

"ఉత్తమ్..."

"ఊ...."

"రేపు మద్యనిషేధం ర్యాలీ వుంది. చుట్టుపక్కల ఊళ్లనుండి దాదాపు పదివేలమంది వస్తున్నారు. అంతా ఆడవాళ్లే... పొద్దుటే వెళ్తున్నా..." అంది సహజ.

"వెళ్తున్నానని చెప్తున్నావా? వెళ్ళనా అని అడుగుతున్నావా?"

"ఏది చేసినా నీకు చెప్పమన్నావుగా!"

"రేపు... అమ్మ సంతాన గోపాలకృష్ణుడి ఆలయంలో నీచేత వ్రతం చేయిస్తోంది. నీకు తీరిక ఉండదు..."

"వ్రతం ఇంకోరోజు చేసుకుందాం"

"అబ్బబ్బ... సహజా, ప్రతీసారీ ఎందుకిలా మొండికేస్తావ్? నీకు నెల తప్పలేదని అమ్మ ఆవేదన పడిపోతోంది! అందుకే గుళ్లో వ్రతం ఏర్పాటుచేసింది. మరో సంవత్సరానికి గానీ రేపట్లాగా మంచిరోజు రాదట!" ఉత్తమ్.

"అత్తయ్య నాకు వ్రతం గురించి చెప్పలేదే!"

"ర్యాలీకి వెళ్తున్నా అని చెప్పావటగా? అప్పటిదాకా నువ్వు ఇంట్లోనే ఉంటావనుకుందిట. ఇప్పుడు నీకు చెప్పమంది. దయచేసి... వ్రతం చేసి అమ్మను సంతోషపెట్టు!"

★ ★ ★

"పిలిచారా, అత్తయ్యా?"

"ఆc! పిలవక తప్పుతుందా? ఇవాళ ఎక్కడికో వెళ్తున్నావటగా?"

"అయిదారుగురు మహిళలు ఒక అశ్లీల రచనలు చేసే రచయితని కలుసుకోవాలనుకున్నాం. అలాంటి రచనతో..."

"నా కోడలు అలా వెళ్ళడానికి లేదు. అదలావుంచు! ఇలా మాటని లెక్కించకుండా అక్కడికీ, ఇక్కడికీ తిరుగుతూ కాలక్షేపం చేస్తూ వుండిపోతావా, ఈ కొంపకి పిల్లాపాపల్ని ఇస్తావా? అని అడగడానికి పిలిచాను!"

"దేనికైనా సమయం రావాలిగా అత్తయ్యా..."

"నాకు తెలీకడుగుతాను... పిల్లలు కలగకుండా జాగర్తపడుతున్నావా? చేసిన వ్రతాలూ, నోములూ చెట్టుకూ పుట్టకూ చేరిపోతున్నాయ్?"

"అలా నేనెందుకు చేస్తాను?"

"తరువాత ఏడాదో, రెండేళ్లో ఇలా తిరగడానికి వీలుండదుగా! సహజా... నిజం చెప్పు! పిల్లలు వద్దనుకుంటున్నావా? ఇలాంటి విషయాలు అబ్బాయితో మాట్లాడలేను''

"మీరు నాయనమ్మ కావాలని తహతహలాడుతున్న సంగతి మీ కొడుక్కి తెలుసు, అత్తయ్యా!"

★ ★ ★

"వచ్చావా? పూర్తయిందామ్మా ఊరేగడం?"

లోపలికి వస్తున్న సహజకు రామలక్ష్మి ప్రశ్న ఆహ్వానం పలికింది. హాలుమధ్య సోఫాలో కొలువుతీరిన గజలక్ష్మిలా తిష్ఠవేసి కూచున్న తన అత్తగార్నీ, ఆ పక్కనే బిగుసుకుపోయిన మొహంతో కూచున్న ఉత్తమ్‌నీ

చూస్తూ, వాళ్ళ దగ్గరగా వెళ్ళింది.

"అమ్మ ఒక ప్రశ్న అడిగింది, వినపళ్ళేదా?" ఉత్తమ్ కసిరినట్టు అడిగాడు.

"నేను మా ఇంటికెళ్ళాను, ఊరేగింపులకి వెళ్ళలేదు..."

"మీ ఇల్లా? నీ ఇల్లు ఇదే అనుకున్నానే! ఓహో... పుట్టింటికెళ్ళావా?" రామలక్ష్మి సాగదీస్తూ అడిగింది.

"మీకు చెప్పే వెళ్ళాను. ఇంటిదగ్గర వెయిట్ చేస్తూ ఉంటాననీ, ఆఫీసునుండే వచ్చేటప్పుడు అలా రమ్మనీ, కలిసివద్దామనీ ఆయనకి ఫోన్‌చేశాను కూడా! ఆయనకోసం చూస్తూ... ఆలస్యమైంది''

"పుట్టింటి పేరు చెప్పి ఏ మీటింగులకెళ్ళావో అని వాడు తిన్నగా వచ్చాడు!" రామలక్ష్మి వెటకారంగా అంది.

సహజ 'అవునా?' అన్నట్టు భర్తవైపు చూసింది. ఉత్తమ్ విసుగ్గా లేచి, తన గదిలోకి వెళ్ళాడు. సహజ అతన్ని వెంబడించింది. ఉత్తమ్ లుంగీ కట్టుకుంటున్నాడు.

"ఉత్తమ్... నేను నిజంగా మా ఇంటికే. అదే- నా పుట్టింటికే వెళ్ళాను. నీకోసం అమ్మా నాన్నా ఎంతో ఎదురుచూశారు... నువ్వు''.

టర్కిష్ టవల్ భుజాన వేసుకుని వెళ్ళిపోతున్న భర్తను చూస్తూ ఆపేసింది సహజ. చకచకా వెళ్ళి టర్కిష్‌టవల్ని పట్టుకుంది. "నేను వీపు తోమకుండా స్నానం పూర్తవుతుందా?" అంది నవ్వుతూ.

ఉత్తమ్ బాత్‌రూమ్‌లోకి దూరి, గభాల్న తలుపు మూసుకున్నాడు...

★ ★ ★

నైటీ వేసుకుని, సహజ పడగ్గదిలోకి వెళ్ళింది. ఉత్తమ్ ఆమెకోసమే కాచుకున్నవాడిలా చదువుతున్న పత్రికని పక్కన పడేశాడు. సహజ మంచంమీద కూచుని అతన్ని నవ్వుతూ చూసింది. "కోపం తగ్గిందా?"

"నాది కోటలు దాటని కోపం! అందుకే ఇలా నలిగిపోతున్నా!" ఉత్తమ్ నవ్వే ప్రయత్నంచేశాడు.

"ఏం జరిగింది, ఉత్తమ్?"

"ఆరోజు, వ్రతంరోజు ర్యాలీకి వెళ్ళొద్దన్నాను... వెళ్ళావ్. వాడెవడో అబ్బీస్‌రైటర్ వద్దకి రాయబారం వెళ్ళొద్దంది అమ్మ, వెళ్ళావ్..."

"ర్యాలీకి వ్రతం అయ్యాకే వెళ్ళాను..."

"సహజా, నేను అమ్మని వొప్పించలేను, నిన్ను ఆపలేను! మీరిద్దరూ, తెలివిగా ఇద్దరికీ నన్నే రాయబారిగా చేసి, ఆడిస్తున్నారు!"

"నేను నిన్ను అలా వాడుకోవడం లేదు ఉత్తమ్!"

"అమ్మకి చెప్పమనీ, ఆమెని మార్చమనీ, అవకాశాన్ని ఉపయోగించుకొమ్మనీ ఉపదేశం చేశావ్, మరిచిపోయావా?" ఉత్తమ్ ఎగతాళిగా అన్నాడు.

"నువ్వు ప్రయత్నించడం లేదుగా!"

ఉత్తమ్ విరక్తిగా నవ్వాడు. "ప్రయత్నించడం లేదా? అమ్మ నీమీద పూర్తిస్థాయి యుద్ధం ప్రకటించకపోవడానికీ, ఏరోజుకారోజు నరకం క్రియేట్ చేయకుండా వుండటానికీ కారణం ఏమిటనుకున్నావ్? అది అమ్మ చేతగాని తనంకాదు! నా ప్రయత్నం! నామీదా; నామాట మీదా అమ్మకి ఉన్న నమ్మకం!"

సహజ మౌనంగా చూసింది.

"సహజా... అమ్మ సంగతి తెలీదు! ఆమె ఓటమిని అంగీకరించదు! అంగీకరించినట్టు కనిపిస్తే అది రాబోయే గెలుపుకి ఎత్తుగడ! సహజా... మళ్ళీ చెప్తున్నా.... నా మాటవిను... అమ్మ మాట గౌరవించు! కొంతకాలం పాటు ఆమె చెప్పినట్టు నడుచుకో!"

సహజ అతనివేపు తదేకంగా చూసింది. "ప్రతీ ఇంట్లోనూ ఒక 'ఆదిశక్తి' పుట్టాలనీ, ప్రతీఇంట్లో ఆడదే 'తను అబలకాదు ఆదిశక్తి' అంశ అని భావించి ఆత్మోన్నతికోసం పాటుపడాలనీ నేను అనుకున్న 'సంకల్పాన్ని, స్ఫూర్తినీ నీరుగారుస్తున్నావ్! అయినా నీమీద




నాకు కోపంలేదు! ఎందుకో తెలుసా? నా భర్త అయిన నిన్ను, అమ్మ గౌరవంకోసం ఆరాటపడిపోతున్న నిన్ను విమర్శించి కోప్పడే హక్కు నాకు లేదు. మార్చుకోవాల్సిన బాధ్యత వుంది!"

"సహజా..."

"నాకు నేను ఇచ్చుకున్న స్ఫూర్తి నన్ను ఆవిధంగా ఆజ్ఞాపిస్తోంది! నువ్వు కోరినట్టే కొంతకాలం పాటు కోడలిపిల్లగా, భార్యగా ఉంటాను. నా భర్తనూ, అత్తనూ మార్చే ప్రయత్నం చేస్తాను"

"థాంక్స్ సహజా!"

"అయితే నా జాతి ఆర్తనాదం నాకు వినిపించినప్పుడు నేను ఆగను, ఆగలేను. నన్ను ఎవరూ ఆపలేరు!"

"సహజా"

"నా ప్రయత్నాలకి నువ్వు అడ్డుతగిల్తే క్షమిస్తాను. ఎందుకంటే నువ్వు పురుషుడివి! స్త్రీ పురోభివృద్ధికోసం పాటుపడే ఒక ఆదర్శాన్ని స్త్రీ అడ్డుకుంటే సహించను, ఉత్తమ్!" సహజ కంఠం జేగంటలా ధ్వనించింది.

అతని చూపులు కిందికి వాలాయి...

★ ★ ★

నెలరోజులు గడిచిపోయాయి. సహజ భర్తకు భార్యగా, అత్తకు కోడలిగా వాళ్ళు అనుకున్న పద్ధతిలో, తను మాట ఇచ్చిన విధంగా ఒదిగిపోయింది. మనిషి శరీరంతో చేసేదే పనికాదు అని ఆమెకి తెలుసు. మనిషి మేధస్సుతో, హృదయంతో కూడా పని చేయొచ్చని కూడా ఆమెకి తెలుసు...

రాత్రి పన్నెండు కావస్తోంది. సహజకి నిద్రరావడంలేదు. ఒత్తిగిలి పడుకుని హాయిగా గుర్రుకొట్టుకుంటూ నిద్రపోతున్న ఉత్తమ్‌ని క్షణంసేపు తదేకంగా చూస్తూ వుండిపోయింది సహజ. తనకి నిద్ర ఎందుకు రావడంలేదో ఆమెకి తెలుసు. ఉన్నట్టుండి తన లోంచి ఉబుకుతున్న ఆనందం నిద్రని అంత దూరంలో వుంచింది! ఎవరో... ఎవరో... తన గర్భంలోకి ప్రవేశించినట్టనిపిస్తోందామెకి! నెల తప్పేదాకా, తను తల్లి కాబోతోందని ఏ ఆడదానికీ తెలీదు! కానీ తనకి తెలిసిపోతోంది. తను తల్లికాబోతోంది! ఎంత విచిత్రం! చెప్పినా ఎవ్వరూ నమ్మరు! తన పీరియడ్స్ తెలిసిన అత్త భర్త- అస్సలు నమ్మరు!

కానీ తను నమ్ముతుంది! తనకి తెలుసు... ఏదో అదృశ్య చైతన్యంతనలో ఈ రాత్రినుంచే తనలో ప్రాణంపోసుకుంటోంది! ఏదో చైతన్యాన్ని తను తనలో పొదివిపెట్టుకున్నట్టు ఏదో విచిత్రమైన అనుభూతి ఆమెని, ఆమె సర్వస్వాన్నీ ఆవరిస్తూ ఏవో నిశ్శబ్ద సంకేతాలు పంపిస్తోంది! సృష్టిలో ఎవరికేనా ఇలాంటి అనుభూతి కలిగివుంటుందా? మొద్దులా నిద్రపోతున్న భర్తని తట్టిలేపి తన అనుభూతికి అక్షరరూపం ఇవ్వాలనిపించిందామెకి. అతను నమ్మకపోవచ్చు! 'పిచ్చి ఊహ!' అనొచ్చు!

అది ఊహకావచ్చు. భ్రమ కావచ్చు. ఏదైనా కావచ్చు. తనకి నమ్మకంగా తెలుసు. తను తల్లికాబోతోంది.

కెరటాల్లా పొంగుతున్న ఆనందం నిద్రగా మారి సహజను ఆవరించుకుంది.

★ ★ ★

"నిజంగా! హాయ్! అమ్మకు చెప్పావా?" ఉత్తమ్ ఉత్సాహంగా అరిచాడు, నెలరోజులు గడచిన తరువాత ఒక ఉదయం.

"ఇలాంటి వార్త మొట్టమొదట భర్త వినాలి!" సహజ నవ్వుతూ అంది.

"థాంక్స్ డార్లింగ్! అమ్మకు నేను చెప్పనా?"

"యువర్ ప్లెషర్, ఉత్తమ్!" అంది సహజ.

రామలక్ష్మి కోడలు గడపతొక్కింతర్వాత మొట్టమొదటి సారిగా నవ్వింది. ఆమె ఆనందానికి కారణాలు రెండు. ఒకటి తనకి మనవడు పుట్టబోతున్నాడు. రెండు కోడలు

ఇంక చెప్పు చేతల్లో వుంటుంది.

సహజ తన అమ్మను చూడాలంది. ఉత్తమ్ ఆమెని తీసుకెళ్ళాడు స్వయంగా.

అమృతమ్మ పొంగిపోయింది.

తన తల్లీ ఆనందించింది. సహజ తల్లీ ఆనందిస్తోంది. కానీ ఇద్దరి ఆనందాల్లోనూ, ఏదో తేడా కనిపిస్తోంది ఉత్తమ్‌కి.

మనవడు పుట్టబోతున్నాడు అన్న ఆనందం తన తల్లిది. కూతురు తల్లి కాబో తోంది అన్న ఆనందం సహజ తల్లిది! ఎంత తేడా!

★ ★ ★

"ఇంకా ఎన్నాళ్ళోయ్! ఎప్పుడిస్తావ్ నా చేతులకి బాబుని?" సోఫాలో కూచున్న సహజను ఆశగా చూస్తూ అడిగాడు ఉత్తమ్. గర్భంలోపల శిశువు ఎదుగుతూ సహజ అందాన్ని అద్భుతమైన మోతాదులో పెంచుతోంది. బుగ్గలు పొంగి మెరుస్తున్నాయి. ఏదో గాంభీర్యం సహజ అందానికి హుందాతనాన్నిస్తోంది.

"తెలీదూ? మరో నాలుగు నెలలు... దాటాలనుకుంటా... ఉత్తమ్... అందరూ బాబు, బాబు అంటున్నారు. కానీ నాకు పాప పుడుతుంది, నాకు తెలుసు''

"డోంట్‌సే లైక్ దట్! బాబే!"

"నీకు తెలీదు ఉత్తమ్! నాకు తెలుసు! నాకు ఎప్పుడో తెలుసు. నా ద్వారా జన్మించడానికి చైతన్యం నాలో ప్రవేశించిన రోజే నాకు తెలుసు! నాకు ఆడపిల్ల పుడుతుంది!"

"చీటికీ మాటికీ నాతో అంటే అన్నావు! అమ్మతో అనకు. బాధపడుతుంది''

"ఏం?"

"మనవడిమీద ఆశలన్నీ పెట్టుకుంది! నాన్న మనవడిమీదే పంచప్రాణాలూ పెట్టుకున్నాడు''

★ ★ ★

సహజ ఆశ్చర్యంగా చూసింది. "శ్కానింగా? అల్ట్రాసౌండ్ శ్కానింగేనా? దేనికి?"

"ఊరికే! అంతా సవ్యంగా ఉందని గ్యారెంటీగా తెలుసుకోడానికి!" ఉత్తమ్ నవ్వుతూ అన్నాడు.

"బేబీ పెరుగుదల నార్మల్‌గా ఉందనీ, కంగారుపడాల్సిన అవసరం లేదనీ డాక్టర్ నెలనెలా చెప్తూనే ఉందిగా ఉత్తమ్! వొద్దు! పుట్టకముందే నాబిడ్డని ఎవరూ చూడ్డం నాకిష్టంలేదు!"

"డోంట్‌బీసిల్లీ!" ఉత్తమ్ నవ్వుతూ అన్నాడు. "ఎందుకో నాకు కంగారుగా వుంది! నువ్వు మామూలు ప్రెగ్నెంట్ లేడీలా లేవు. వేవిళ్ళులేవు! రొటీన్‌గా వచ్చే ప్రాబ్లమ్స్ లేవు''

"అవన్నీ లేకపోడం మంచిదేగా!" సహజ నవ్వుతూ అంది. "నాది మా అమ్మ పోలికట! నేను గర్భంలో వున్నప్పుడు అమ్మకి వేవిళ్లేలేవుట!"

"నాతృప్తి కోసం, నాధైర్యంకోసం శ్కానింగ్ చేసుకోవాల్సిందే! ప్లీజ్ సహజా! నీలో నా ప్రాణాలన్నీ పెట్టుకున్నా! టెక్నాలజీ అందుబాటులో వున్నప్పుడు కన్‌ఫర్మ్ చేసుకోడంలో తప్పేంటి? చేయకూడని పని చేయడం లేదుగా!"

సహజ అలసటగా చూసింది. "నీఇష్టం"

"థాంక్యూ! వెళ్ళి డేట్ ఫిక్స్ చేసుకొస్తా!" ఉత్తమ్ ఉత్సాహంగా వెళ్ళిపోయాడు.

★ ★ ★

ఆటో మెల్లిగా వెళ్తోంది. అల్ట్రా సౌండ్ శ్కానింగ్‌కి వెళ్ళేటప్పుడున్నంత హుషారుగా, తిరిగి వచ్చేటప్పుడు లేదు ఉత్తమ్. సహజ వాలుగా అతన్నే చూస్తోంది. ఉత్తమ్ మొహంమీద చెమటబిందువులు పూసల్లా అవుపిస్తున్నాయి. సహజలో ఏదో అర్థంకాని ఆదుర్దా ప్రారంభమైంది. ఎడంచేత్తో అతని కుడిచేతిని పట్టుకుంది. తనతో చెప్పనిది ఏదేనా చెప్పాడా డాక్టర్ అతనికి?

"ఉత్తమ్... ఎనీ థింగ్ రాంగ్? లోపల బేబీ





బాగుందిగా? డాక్టర్ ఇంకేమేనా చెప్పాడా?"

"నీకు చెప్పంది ఏదీ చెప్పలేదు. అంతా నార్మల్‌గా వుంది'' ఆమెవైపు చూడకుండా రోడ్డునే చూస్తూ అన్నాడు ఉత్తమ్.

సహజ మౌనంగా వెనక్కివాలింది. ఆమె చెయ్యి అతని చేతిని వదిలేసింది. తను ఊహించిందీ, చెప్పిందీ నిజమైనందుకా? తనలో ఆడపిల్ల ఉందని కన్‌ఫర్మ్ అయినందుకా? తన మాట నెగ్గలేదని ఉత్తమ్ బాధపడుతున్నాడా?

కొడుకునీ, కోడల్నీ చూడగానే రామలక్ష్మి ఆదరా బాదరా సోఫాలోంచి లేచింది. "ఏం చెప్పారు నాయనా?"

"నేను చెప్పిందే జరిగిందత్తయ్యా! ఆడపిల్లే! అంతా నార్మల్‌గా ఉందన్నారు. నాకు తెలీకుండా మీకొడుక్కి ఏదైనా చెప్పారేమో! భయపడిపోతున్నాడు'' సహజ అంది.

రామలక్ష్మి మొహం బిగుసుకుపోయింది. కొడుకు వేపు ఒకసారి చూసి, చూపుల్ని సహజవైపు మళ్ళించింది "అవునమ్మా... నువ్వు చెప్పినట్టే జరుగుతుంది! ఈ ఇంట్లో అడుగుపెట్టినప్పట్నుంచీ నువ్వు చెప్పిందేగా జరుగుతూంట!"

సహజ ఆశ్చర్యంగా చూసింది. "మీరేమంటున్నారో అర్థం కావటంలేదత్తయ్యా''

"ఏమనాలో, ఏం చేయాలో నాకు అర్థమైతేగా!" రామలక్ష్మి పాదాలు చప్పుడయ్యేలా నడుస్తూ భర్త గదివైపు వెళ్ళిపోయింది.

★ ★ ★

రాత్రి పదకొండు దాటింది. సహజ మంచంమీద వొత్తిగిల పడుకుంది. పక్కన, ఎడంగా వెల్లకిలా పడుకుని గది కప్పుకేసి చూస్తున్నాడు ఉత్తమ్. శ్కానింగ్ సెంటర్ నుండి తిరిగి వచ్చినప్పట్నుంచీ అతను పూర్తి మౌనం పాటిస్తున్నాడు! కంచంలో అటూ ఇటూ కెలికి అర్థాకలిగా కూడా తినకుండా చెయ్యి కడుక్కుని వచ్చేశాడు. పడుకున్నాక రెండుసార్లు తను పలకరించే ప్రయత్నంచేసింది. కసురుకున్నాడు. అతని మూగ బాధ ఆమెని శాంతికి దూరం చేసింది. మరో అరగంట గడిచింది.

నిద్రపట్టని సహజ అలసటగా కళ్ళు మూసుకుంది. మూగబాధకు మందులేదు! అతను నోరు తెరిస్తేగానీ తను ఏమీ చేయలేదు!

"సహజా..."

భర్త పిలుపు వినిపించి, సహజ కళ్ళు తెరిచింది. ఉత్తమ్ మంచంమీద లేచి కూచున్నాడు.

"ఊ..."

"సహజా... నువ్వు నన్ను ప్రేమించావు. అవునా?" ఉత్తమ్ తగ్గుస్వరంలో అడిగాడు.

"అడగాలా?" సహజ నవ్వింది.

"ఇప్పుడూ ప్రేమిస్తున్నావు. అవునా?"

"మన ప్రేమమీద వొట్టు, ఉత్తమ్''

"పొద్దుట ఆటోలో వస్తూంటే, ఏమిటో చెప్పమనీ, భయపడనీ అన్నావు. గుర్తుందా?"

పొడిపొడిగా ప్రశ్నలు అడుగుతున్న ఉత్తమ్‌ని సహజ ఆశ్చర్యంగా చూసింది. "ఎందుకు గుర్తులేదు? ఎందుకలా అడుగుతున్నావు?"

"చెప్తే భయపడవుగా?"

సహజ గుండె దడదడ కొట్టుకుంది. శ్కానింగ్ ఏం చెప్పింది? లోపలున్న తన పాప ఎలావుంది?

"ప్రయత్నిస్తాను... ఏమిటో చెప్పు!"

"నీ గర్భంలో ఆడపిల్ల ఉంది... ఆ ఆడపిల్ల... మనకి... అక్ఖర్లేదు''

"ఉత్తమ్!" సహజ దిగ్భ్రాంతితో అరిచింది. ఇందాకా దడదడ కొట్టుకున్న ఆమె గుండె చుట్టూ ఏదో ఉక్కుపిడికిలి బిగుసుకున్నట్టుగా వుంది. తటాలున లేచి కూచుంది.

"సారీ... సహజా... ఆ... పిల్ల... పుట్టడానికి వీల్లేదు... నువ్వు అబార్షన్..."

"నోర్మూయ్!" సహజ హూంకరింపు అతన్ని ఉలిక్కిపడేలా చేసింది. అతను తలెత్తి కంగారుగా చూశాడు.

"ఎంత సాహసం చేశావ్, ఉత్తమ్! ఆ మాటను వెంటనే వాపసు తీసుకో!"

"సహజా!" ఉత్తమ్ గద్దిస్తున్నట్టు అరిచాడు. అతని నిట్టూర్పు పాము బుసలా ఆ గదిలో ధ్వనించింది. "ఉదయం నుండి మూగవేదన, నరకం అనుభవిస్తున్నాను! నీకు ఎలా చెప్పాలో తెలీక నాలో నేను నలిగిపోయాను... చెప్పక తప్పదు... నువ్వు చేసుకోకా తప్పదు!"

"ఉత్తమ్" సహజ అరిచింది. "నీకు ఆడపిల్ల అంత పనికిరానిదైపోయిందా? ఆడది లేకపోతే నీకు ఈ శరీరం ఉండేది కాదు! ఆడపిల్ల లేకపోతే నీకు భార్య వుండేది కాదు! నిన్ను కనడానికి, నీకు ఈ పురుష శరీరాన్ని ఇవ్వడానికి ఒక ఆడది కావాలి! నీకు శారీరక సుఖం అందించడానికి ఒక ఆడది కావాలి! నీకు కొడుకుని అందించడానికి ఒక ఆడది కావాలి! నీ కొడుక్కి రేపు పెళ్ళిచేయడానికి ఒక ఆడది కావాలి! నీకు మాత్రం ఆడది పుట్టకూడదు! ఎంత విచిత్రం!

అసహజమైన నీ మనస్తత్వాన్ని ముందు నాకెందుకు చూపించలేదు? నేనెందుకు చూడలేకపోయాను? నాకిప్పుడు అర్థమవుతోంది!నీలో సగాన్ని మాత్రమే నాకు చూపించావు. సగాన్ని... అసలు సగాన్ని దాచిపెట్టావు! నన్నెందుకు మోసం చేశావు, ఉత్తమ్?" కన్నీళ్ళు సహజ బుగ్గలమీద జారాయి, ఉత్తమ్ అనే పురుషుడి లోతుని కొలిచే దారాల్లా.

"నేన్నిన్ను మోసం చేయలేదు!" ఉత్తమ్ గద్దించాడు.

"మోసం చేయలేదా? ఆడదాన్నైన నాతో







పరిచయం పెంచుకున్నావ్. స్త్రీ అభ్యున్నతి కోసం జీవితాన్ని అంకితం చేయాలనుకున్న నన్ను ఎంకరేజ్ చేశావ్! నన్ను ప్రేమించావు, నా ప్రేమని సంపాదించుకున్నావు! స్త్రీకోసం పోరాడుతున్న నాకు, మరో స్త్రీలాగా సహాయం చేశావు! నన్ను పెళ్ళి చేసుకున్నావు! నాతో దాంపత్య సుఖాన్ని అనుభవించావు! స్త్రీ తల ఎత్తుకు తిరిగేలా చేయాలని కలలు కంటున్న నాచేత స్త్రీ శిశువు తల గిల్లించేయాలని చూస్తున్నావు! ఇది మోసం కాదా?"

"సహజా... నేను... మోసగాణ్ణి కాదు... నీతో అబద్ధమాడాను... నన్ను క్షమించు... నాకు... నాకు ఆడపిల్ల అయినా అభ్యంతరంలేదు... మా అమ్మకీ, నాన్నకీ అభ్యర్లేదు''

సహజ రౌద్రంగా చూసింది. "మనకి ఏ బిడ్డ కావాలో కోరుకునేది మనం! వాళ్ళకి ఆ హక్కు లేదు!"

"ఒప్పుకుంటాను..." ఉత్తమ్ మెల్లిగా అన్నాడు. "కానీ... కానీ... ఇప్పుడు... ఈ ఇంట్లో ఆడపిల్ల పుట్టడానికి... వీల్లేదు... పుడితే... మానాన్న చచ్చిపోతాడు!"

సహజ అర్థంకానట్టు చూసింది. ఉత్తమ్ కళ్ళు ఎర్రగా అతని నిస్సహాయతని ప్రతిఫలిస్తున్నాయి.

"నాన్న జాతకాల ఎక్స్‌పర్ట్. నీకు తెలుసు! నాకు పెళ్ళయి, ఆడపిల్ల పుడితే బారసాలలోగా నాన్న చనిపోతాడు. జాతకంలో అలా రాసివుంది''

సహజ నవ్వాలో, ఏడవాలో తెలీక అతన్ని జాలిగా చూసింది. "ఉత్తమ్... నువ్వు ఆ కాశీమజిలీ కథ నమ్ముతున్నావా?"

"సహజా... నువ్వు చెప్పిందాన్ని నమ్మినట్టే, నాన్న నమ్మకాన్నీ నమ్ముతాను నేను!"

సహజ ప్రశ్నార్థకంగా చూసింది. "నేను చెప్పిందా?"

ఉత్తమ్ ఛాలెంజ్ చేస్తున్నట్టు చూశాడు. "యస్! 'సంభవామి గృహేగృహే' అన్న సూక్తిని క్రియేట్ చేసి, ఆ స్ఫూర్తితో ఆదిశక్తి నీలోకి ఆవేశించిందని నువ్వు అంటే ఎలా నమ్మానో, నాన్న మాటనీ అలాగే నమ్మాను!"

సహజ కళ్ళు వెడల్పుగా అయ్యాయి. "ఉత్తమ్, నేను రాసింది ఫిక్షన్! పూర్తిగా కల్పన!"

ఉత్తమ్ చిన్నగా నవ్వాడు. కల్పన... యదార్థం లేనిదే కల్పన లేదు అన్నావు గుర్తుందా? ఆ కల్పనలోంచే నువ్వు ఇన్స్పిరేషన్ పొందావు! ఆ స్ఫూర్తితోనే ప్రతీ యువతిలోనూ ఆదిశక్తి అంశం ఆవిర్భవించాలి అన్న నినాదంతోనే నువ్వు ఆ శక్తి నీలోకీ ఎందుకు ఆవహించకూడదు? అనుకున్నావు! ఆవహించిందని నిన్ను నువ్వు హిప్నటైజ్ చేసుకున్నావ్! అందుకే ఉద్యమించావు. ఆ నమ్మకంతోనే ఎదిరించావు, జయించావు! అట్లాగే, సరిగ్గా అట్లాగే మనవరాలు భూమ్మీదపడితే తను భూమిలోపలికి వెళ్ళిపోతాడని నమ్ముతున్నాడు! అది కూడా స్ఫూర్తే అని నా నమ్మకం! ఆ స్ఫూర్తితో ఆయన చచ్చిపోతాడు!"

సహజ నివ్వెరపోతూ వింది. బుగ్గలమీద ఆరిపోతున్న కన్నీటిని తుడుచుకుంది. నిదానించి ఉత్తమ్ కళ్ళల్లోకి చూసింది. "నీ ఆర్గ్యుమెంట్ తార్కికంగా వినడానికి బాగుంది. కానీ మీ నాన్నగారు పొందిన ఆ 'స్ఫూర్తి'కీ నా ఇన్స్పిరేషన్‌కీ చాలా, చాలా తేడా వుంది. ఆ రెండింటికీ చావు- పుట్టుకలకి ఉన్నంత తేడావుంది ఉత్తమ్. నేను పొందిన స్ఫూర్తి 'నిరంతరమరణం' నుండీ స్త్రీని రక్షించి, బతికించేది. మీ నాన్నగారి 'విపరీత స్ఫూర్తి' స్త్రీని గర్భస్థదశలోనే చంపేది!"

"సహజా! అనవసరంగా ఉద్రేకపడుతున్నావు! శ్కానింగ్ ఫలితం తెలిసినప్పట్నుంచీ చచ్చిపోతాడన్న భయంతో వణుకుతూ పిచ్చివాడైపోతున్న నాన్ననూ, ఆయన్నే సర్వస్వంగా అనుకున్న అమ్మనూ ఒకసారి గుర్తుచేసుకో! భ్రూణ హత్య పాపంకాదు, అబార్షన్ చట్టవిరుద్ధం కాదు! తెలిసీ ఒక మనిషిని చావనివ్వడం"

"చివరిసారిగా చెప్తున్నా ఉత్తమ్! నా గర్భంలోని 'ఆడపిల్ల' 'ఆడది' చావదు! నేను చావనివ్వను! నా పాపాయి చావాలంటే ఒక్కటే ఉపాయం! నన్ను చంపు!"

"సహజా!"

"దయచేసి ఇక్కణ్ణుంచి వెళ్ళిపో, ఉత్తమ్!"

"సహజా!"

"నాముందు నుంచీ వెళ్ళిపో!"

"స-హ-జా!"

"వెళ్తావా లేదా?" సహజ కేక చిన్న గుహలో సింహనాదంలా ఆ గదిలో సుళ్ళుతిరిగింది.

★ ★ ★

గుమ్మందగ్గర చప్పుడు సహజ ఆలోచనల్ని డిస్టర్బ్ చేసింది.

సహజ లేచి, నిలబడింది. అత్తమామలు ఇద్దరూ గదిలోకి వస్తున్నారు. జాతకచక్రాల్లో తిరుగుతూవుండే మామయ్య తన పెళ్ళయ్యాక ఈ గదిలోకి రావడం ఇదే మొదటిసారి.

ఇద్దరూ మంచంమీద పక్కపక్కనే కూచున్నారు.

కోడలివైపు దీనంగా చూస్తూ రామలక్ష్మి ప్రారంభించింది.

అరగంట తర్వాత గోవిందరావు అందుకుని జాతకాలూ, వాటి ప్రభావం వగైరా వివరించి, తన గండం గురించి చెప్పి, తన చావు బతుకులు ఆమె గర్భంలోని శిశువు చేతిలో, అంటే ఆమె చేతిలో వున్నాయన్నాడు.

తనకి ప్రాణబిక్ష పెట్టమన్నాడు.

ప్రాణం ఇవ్వడానికి భ్రూణం పోతే మరేం




ఫర్వాలేదన్నాడు.

రామలక్ష్మి తన పసుపుకుంకుమలు దక్కించమంది, కళ్ళొత్తుకుంటూ.

తమ ఒక్కగానొక్క కొడుకుని. కానీ కట్నం కోరకుండా ఆమె చేతిలో పెట్టినందుకు ఋణం తీర్చుకోమన్నారు. ఇద్దరూ.

ఎంతోమందికి, ఎన్నోసార్లు అనుకోకుండా గర్భస్రావాలు జరుగుతూనే వుంటాయి. సహజకీ ఒకసారి గర్భం నిలవలేదనుకుంటే పోయేదేమిటి? అంది రామలక్ష్మి.

"రెండోసారి ఆడపిల్లే తయారవుతే ఎట్లా?" సహజ అమాయకంగా అడిగింది.

"రెండోసారి ఖచ్చితంగా మనవడే! నేను జాతకం చూశానుగా!" గోవిందరావు గ్యారెంటీ ఇచ్చాడు.

తన తండ్రి రాయించిన జాతకం ప్రకారం తనకి మగసంతాన యోగమేలేదు- అంది సహజ.

'అర్థాలు' చేసుకోదంలో ఆరితేరిన రామలక్ష్మి సహజవైపు కొరకొరా చూస్తూ చివాల్న పైకి లేచింది. "అయినవాళ్ళని ప్రాధేయపడ్డంకన్నా, ఆ యమధర్మరాజునే అడుగుదాం. రండి!" అంటూ చరచరా గుమ్మంవైపు వెళ్ళిపోయింది.

★ ★ ★

రెండు రోజులు భారంగా గడిచాయి. భర్త పలకరించని సహజకు రెండురోజులూ మౌనంగా గడిచాయి.

మూడోరోజు మధ్యాహ్నం మామూలుగా భోజనానికి వెళ్ళింది సహజ. ఎన్ని గొడవలు వచ్చినా, ఎన్ని కోపతాపాలు వచ్చినా తను పస్తులు ఉండకూడదు! లోపలున్న పాపాయి కోసం అన్నింటినీ దిగమింగి, తను ఇంత ఆహారం మింగాలి!

డైనింగ్ టేబుల్ముందు మామూలుప్రకారం సిద్ధంగా కూచున్నాడు గోవిందరావు. కంచాలుసర్ది వడ్డిస్తున్నరామలక్ష్మి మొహం మండుతున్న కుంపటిలావుంది. సహజను చూడగానే ఆమె నవ్వే ప్రయత్నం చేసింది.

సహజ అన్నం గిన్నెలో సిద్ధంగా పెట్టిన గరిట అందుకుంది. "నేను వడ్డిస్తాను. మీరు కూచోండి అత్తయ్యా!"

"నువ్వు కూచో. ఒట్టి మనిషివి కూడా కావు!" అంటూ రామలక్ష్మి సహజ చేతిలోని గరిటను తీసుకుంది.

సహజ కుర్చీమీద కూచుంది. ఇద్దరికీ అన్నం వడ్డించిన రామలక్ష్మి, గిన్నెలోని వేపుడు ఇద్దరి కంచాల్లో వేసింది.

సహజ అన్నంముద్దని కంచంలో పడేసింది. "ఇది... బొప్పాయి కదూ, అత్తయ్య?" అని అడిగింది.

ఇవాళ కూరలేం రాకపోతేనూ, మీ మామగారు పెరట్లోంచి కోసి తెచ్చి వండమన్నారు. బొప్పాయి ఆయనకి ఇష్టం!"

"అత్తయ్యా... కడుపుతో ఉన్నప్పుడు బొప్పాయి తినడం ప్రమాదంగా?" సహజ సందేహిస్తూ అడిగింది.

"ఏమో తల్లీ! నాకేం తెలుసు? ఉత్తముడు కడుపున వున్నప్పుడు మా అత్తగారు రోజూ వండిపెట్టేది. గర్భిణీ స్త్రీలకి మాంచి పుష్టి అనేదావిడ!"

"అవును. నాకు బాగా జ్ఞాపకం" గోవిందరావు తింటూతింటూ అన్నాడు.

"వద్దులెండి. బొప్పాయి... తినకూడదంటారు... సాంబారు వేసుకుంటా..." అంది సహజ కలిపిన అన్నాన్నీ, వేపుడునీ ఎడంగా తోస్తూ.

"అలాగే... నీ ఇష్టం. ఏది కావాలనుకుంటే అదే తిను!" అంటూ సాంబారుపోసింది రామలక్ష్మి.

సాంబారుతోపాటు కంచంలో పడిన రెండు బొప్పాయి ముక్కల్ని భయంతో చూసింది సహజ. "బొప్పాయి ఇందులో కూడా వేశారా?"

"ఆ... ఏవో రెండు ముక్కలు పడుంటాయి. కూరలు రాలేదుగా!" రామలక్ష్మి కంఠంలో నిరుత్సాహం స్పష్టంగా ధ్వనించింది.

ఆ ముందు రోజు- పెరట్లో గన్నేరు చెట్టుచాటున తన అత్తయ్యా వారానికోసారి ఇంటికి వచ్చి గుడ్డలుతికి వెళ్ళే చాకలిదీ తగ్గుస్వరాల్లో మాట్లాడుకుంటున్న దృశ్యం తటాలున గుర్తొచ్చింది సహజకు. ఆమె గుండె దడదడ కొట్టుకుంది. మాట్లాడకుండా కంచంలో చెయ్యి కడిగేసి, లోటాలోకి మజ్జిగ పోసుకుని తాగింది సహజ. తనని విడ్డూరంగా చూస్తున్న అత్తమామల్ని పట్టించుకోకుండా, కంచం తీసుకుని వెళ్ళిపోయింది.

ఆ రాత్రి కూడా భోజనం చేయలేకపోయింది సహజ. నువ్వుల పచ్చడి. నువ్వుల పొడి. నువ్వులపిండి తగిలించిన వేపుడు. నువ్వులపొడి వేసి ప్రత్యేకంగా తయారుచేసిన పచ్చి పులుసు- తద్దినం స్పెషల్! సహజకి మజ్జిగ కూడా తాగాలనిపించలేదు. కంచం తీయకుండా, చెయ్యి కడుక్కోకుండా మౌనంగా లేచి వెళ్ళిపోయింది. అన్నం ముద్ద నోట్లో పెట్టుకోబోతూ ఆగి, మేడపైకి వెళ్ళిపోతున్న సహజవైపే చూస్తూవుండిపోయాడు ఉత్తమ్. అతని చూపులు తల్లివైపు ప్రశ్నార్థకంగా తిరిగాయి.

"ఏమో నాయనా, ఆవిడగారి వరస నాకు అర్థంకావడంలేదు! పొద్దుట కూరల్లేక బొప్పాయి వేపుడుచేశాను. సాంబారులో రెండు ముక్కలు విదిల్చాను. వడ్డన పూర్తయ్యేదాకా కూచుని, చెయ్యి కడిగేసి వెళ్ళిపోయింది. ఇప్పుడు మీ నాన్నగారికి ఇష్టం కదాని నువ్వులతో రెండు మూడు రకాలు చేశాను. చెయ్యి కూడా కడుక్కోకుండా వెళ్ళిపోయింది! హాయిగా ఆకల్లేదని చెప్పొచ్చుగా!" రెండు పూటలూ తను తయారుచేసిన వంటకాల్ని తినకుండా తెలివిగా వెళ్ళిపోయిన సహజమీద లోపల్లోపలే మండిపోతున్న రామలక్ష్మి అంది.

ఉత్తమ్ కోపంగా అన్నం కెలకడం ప్రారంభించాడు.

★ ★ ★

సహజ మంచంమీద వెల్లకిలా పడుకుంది. ఆకలి... తటాలున ఆమెకి అమ్మ గుర్తొచ్చింది. అమ్మ... ఔను. ఆకలి తీర్చేది అమ్మే. తనలోపల బజ్జున్న బుల్లిపాపకోసం, కోపాన్నీ, దుఃఖాన్ని, శతృత్వాన్నీ భరించి తిండితినాలనుకుంది తను! తనకోసం కాకపోయినా, పాపకోసం తినాలనుకుంది. అయితే తినకుండా తిరిగి వచ్చేసింది. ఉదయం నుండీ పస్తుంది. పాపకోసమే!

అయితే తన కూతుర్ని, ఇంకా భూమ్మీద పడని నెత్తురు ముద్దని హత్యచేసే ప్రయత్నాలు ప్రారంభమయ్యాయన్నమాట! పుట్టిన ప్రాణిని చంపడం మామూలే. పుట్టకుండానే సంహరించడం మనిషి ప్రత్యేకతా! ఆడదానిలా జీవించడం తప్పు! ఆడదానిలా పెరగడం తప్పు! ఆడదానిలా పుట్టడం తప్పు! చివరికి ఆడదానిగా గర్భంలో పడడమూ తప్పే! సహజ పిడికిళ్ళు బిగుసుకున్నాయి. తన గర్భవాసాన పడటం పాప చేసిన తప్పా?

తనని ప్రేమించి, ఆరాధించి, అర్థంచేసుకుని గౌరవించిన ప్రియుడు భర్తగా అయ్యాక మారిపోయాడు! ఎందుకు? ఎందుకు తనకీ శిక్ష? ఎందుకు 'తనకే ఈ శిక్షలు?

ఆవేదనతో, ఆవేశంతో, ఆగ్రహంతో, కసితో- సమాధానం కోసం తన మస్తిష్కాన్ని, హృదయాన్ని కెలుకుతున్న సహజలో ఏదో వెల్తురు తళుక్కుమంది! ఆ శిక్ష, ఆ శిక్షలు తనకే ఎందుకు విధించ బడుతున్నాయో ఆమెకి తటాలున అర్థమైపోయింది! లోపల తళుక్కుమన్న ఆ బ్రహ్మాండమైన వెల్తుర్లో, స్వచ్ఛమైన కాంతిలో ఆమె ప్రశ్నలకి సమాధానం స్పష్టంగా అవుపిస్తోంది!

సహజ ఇక పడుకోలేక ఒక్క ఉదుటున లేచి కూచుంది.





ప్రస్తుతం తన సమస్య ఏమిటి? స్త్రీ అయిన తన గర్భంలో 'సృష్టిజలం'లో ఊయల... లూగుతున్న 'చిన్నారి స్త్రీ'ని రక్షించడం. తను రక్షిస్తుంది. రక్షించి తీరుతుంది. సంభవామి గృహే గృహే అంటూ నినదిస్తూ తన గర్భగృహంలో ముస్తాబవుతూ, త్వరలో తన గృహంలో సంభవించబోయే స్త్రీ మూర్తిని, స్త్రీ శక్తిని తను కాపాడుతుంది. హత్యకు అందకుండా కాపాడుతుంది. సంహారానికి అందకుండా సంరక్షిస్తుంది.

ఏమైనాసరే. తను ఏమైనా సరే! ఎవరు ఏమైనా సరే!

★ ★ ★

మరుసటిరోజు ఉదయం- మూడు రోజులుగా మౌనవ్రతం పట్టిన ఉత్తమ్ మొదటిసారిగా సహజను పలకరించాడు.

"నీ వరస అర్థం కావడంలేదు. నిన్న రెండుపూటలూ భోంచేయలేదు. ఇవాళ అమ్మ ఇస్తే టానిక్కూ, టాబ్లెట్లూ వద్దన్నావట. ఎందుకు? భోజనం ఎందుకు మానేశావ్?"

సహజ తనలో నవ్వుకుంది. భోజనం తన లోపలున్న బుల్లిప్రాణంకోసం ఎన్ని గొడవలు వచ్చినా పస్తులు పడకుండా తినాలనుకుంది. అయితే విచిత్రంగా తినలేకపోయింది. పాపకోసమే.

"ఎప్పుడూ లేంది బొప్పాయి, నువ్వులూ భోజనంలోకి ప్రత్యక్షమయ్యాయి. శ్కానింగ్ ముందు ఒకరోజు బొప్పాయి తింటానంటే వద్దన్న అత్తగారే నిన్న గర్భిణీ స్త్రీకి బొప్పాయి చాలా మంచిది అన్నారు. బొప్పాయీ, నువ్వులూ కడుపుతో వున్నవాళ్లు తినకూడదు. అలాంటివన్నీ అబార్షన్‌కి ఉపయోగించే ఆయుర్వేదం చిట్కాలు. ఆడదానికి అలాంటి వాటిగురించి సహజంగా తెలిసిపోతుంది. నువ్వుల్తో తయారుచేసిన చిమ్మిలి నేను తిన్నాగా..." సహజ నవ్వుతూ అంది.

"అంటే... అంటే... మా అమ్మ... నీకు క్రూడ్‌గా అబార్షన్... సహజా! నీ మాటల్లోని అర్థం అదేగా?"

"ఉత్తమ్... అయాంసారీ... ఈ ఇంట్లో ఏది తినాలన్నా, ఏది తాగాలన్నా నాకు భయంగా వుంది"

"సహజా!"

"నేను ఇవాళే మా ఇంటికి వెళ్లిపోతున్నా. నన్నూ, నా గర్భాన్నీ మా అమ్మకి అప్పజెప్పి, హాయిగా విశ్రాంతి తీసుకుంటాను"

"సహజా... నన్నెందుకిలా కష్టపెడుతున్నావ్?" ఉత్తమ్ బొంగురుగా అన్నాడు.

"నా గర్భంలోని పిండంకోసం" సహజ ఉద్వేగంతో అంది. "పావుగంటలో నేను బయల్దేరుతున్నాను ఉత్తమ్"

సహజ కంఠంలో నిర్ణయం గంటలాగా ధ్వనించింది.

★ ★ ★

అమృతమ్మా, శ్రీమంతరావూ కూతురికి ఘనంగా సీమంతం చేశారు. పరిమళ, భానుమతి, ఇందులేఖ, కాత్యాయని ఫంక్షన్ అయిపోయాక గంటసేపు సహజతో గడిపారు. పరిమళకి సమ్మంధం కుదిరింది. కట్నంలేదు. భానుమతి, అడిగిలేదనిపించుకుని, అడ్జస్టైపోయే సమ్మంధం కోసం కాకుండా కట్నం వద్దనే వరుడికోసం వేచిచూస్తున్నానంది.

రామలక్ష్మీ, గోవిందరావూ వచ్చి, కోడల్ని దీవించి, భోంచేసి వెళ్ళిపోయారు.

"భోజనాలు ముగించి తమలపాకులు నముల్తూ కూచున్నారు శ్రీమంతరావూ, అల్లుడూ. ఏదో చెప్పాలని ఎదురుచూస్తున్నవాడిలా వున్న శ్రీమంతరావు ఉత్తమ్‌ని తదేకంగా చూశాడు.

"ఉత్తమ్... అమ్మాయి వచ్చిన రోజు నుంచీ చూస్తున్నా. ఇలా వస్తావ్. అలా వెళ్ళిపోతావ్. సహజకి తోడుగా ఇక్కడే పడుకోవచ్చుగా. ఈ సమయంలో భర్త పక్కనుంటే స్త్రీకి ధైర్యంగా వుంటుంది"

ఉత్తమ్ తన మామగారి మొహంలోకి

చూస్తూ మౌనంగా ఉండిపోయాడు. చాలా రోజులుగా పీడిస్తున్న ప్రశ్నలు అతనిలో మళ్ళీ తలెత్తుతున్నాయి. సహజ తల్లిదండ్రులకి అంతా చెప్పేసిందా? తనమీదా, తల్లిదండ్రుల మీదా... ఏం చెప్పివుంటుంది? అత్తా, మామా ఎవ్వరూ తనని ఆ విషయంగా ఒక్కమాట కూడా అడగలేదు ఎందుకు?

"అమ్మాయీ, నువ్వూ పోట్లాడుకున్నారా?" శ్రీమంతరావు ప్రశ్నించాడు.

ఉత్తమ్ చూపుల్ని దించుకున్నాడు. "సహజ ఏదేనా చెప్పిందా?"

"మీ ఇద్దరి గురించీ ఏమీ చెప్పలేదు. మామగారి ఆరోగ్యం బాగోలేదనీ, అత్తయ్యకి ఆయన్ని చూసుకోడమే కష్టంగా వుందనీ, అందుకే వచ్చేశాననీ చెప్పింది''

ఉత్తమ్ అదిరిపడి, తలెత్తిచూశాడు. అయితే, సహజ అసలు విషయం చెప్పలేదన్న మాట. సహజ... చెప్పలేదు. మొత్తం చెప్పేసివుంటుందని భయపడ్డాడు తను. సహజని తను ఇప్పట్లో అర్థం చేసుకోలేడా?

"పొద్దుపోయింది. వెళ్ళి పడుకో ఉత్తమ్'' అంటూ శ్రీమంతరావు లేచాడు.

"లేదండీ వెళ్తాను. నాన్న పరిస్థితి బాగాలేదు. అమ్మ భయపడుతుంది'' ఉత్తమ్ మెల్ల మెల్లగా అన్నాడు.

"పాపం! ఏమిటో గోవిందరావుగారు మరీ డీలాగా అగుపిస్తున్నారు. గెడ్డం పెంచేశారు. ఏమిటి ట్రబుల్?"

"ప్రత్యేకించి ఏమీలేదండీ. వయసైపోతోందిగా. వస్తాను. అత్తగారికి చెప్పండి'' ఉత్తమ్ వేగంగా గుమ్మంవైపు నడిచాడు.

★ ★ ★

'భారీ ఎత్తున పుత్రకామేష్టి యజ్ఞం' హెడ్డింగ్‌కింద అచ్చయిన వార్తని ఆసక్తిగా చదవసాగింది సహజ.

'రామాయణ కాలంలో పుత్రసంతానం కోసం దశరథమహారాజు చేసినట్టు చెప్పబడుతున్న 'పుత్రకామేష్టి' యజ్ఞం ఈ యుగంలో మొట్టమొదటిసారిగా నగరంలో నిర్వహించబడుతోంది. తొమ్మిది రోజులపాటు జరిగే ఈ యజ్ఞానికి దాదాపు నాలుగుకోట్ల రూపాయలు ఖర్చు కాగలవని యజ్ఞనిర్వాహకుడు స్వామి నిర్వికల్పానంద బ్రహ్మచారి తెలియజేశారు.

సంతానం లేని దంపతులూ, పుత్రికా సంతానం మాత్రమే వుండి పుత్రసంతానం లేని దంపతులూ, ఏకపుత్ర సంతానం కలిగి, ద్వితీయ పుత్రసంతానం లేనివారూ ఈ యజ్ఞంలో పాల్గొనవచ్చు. కాలంమారినా, ఆచార వ్యవహారాలు మారినా యజ్ఞయాగాదుల నిర్వహణలో మార్పు రాలేదనీ, అందువల్ల సత్ఫలితం లభించే అవకాశం వుందనడంలో సందేహం లేదనీ స్వామీ నిర్వికల్పానంద నొక్కిచెప్పారు.

యాభై ఎకరాల విశాలమైన 108 హోమకుండాలలో జరిగే పుత్రకామేష్టి యజ్ఞంలో దాదాపు రెండువేలమంది ఋత్వికులు పాల్గొంటారనీ, దంపతులకు విడివిడిగానూ, సామూహికంగానూ పుత్రకామేష్టి జరిపించే అవకాశాలు కల్పించబడ్డాయనీ, ఆసక్తివున్నవారు వరసగా తొమ్మిదిరోజులపాటు యజ్ఞంలో పాల్గొనే అవకాశం కూడా వుందనీ, ఒక్కొక్కరోజు కార్యనిర్వహణ యాజమాన్యానికి దంపతులు చెల్లించవలసిన రుసుము వివరాలు పుత్రకామేష్టి కార్యాలయంనుండి పొందవచ్చుననీ స్వామిజీ తెలియజేశారు.

రోజుకి రెండు లక్షలమంది పుత్రకామేష్టికి హాజరయ్యే అంచనా వుందనీ, అందరికీ భోజన వసతి సదుపాయాలు నామమాత్రపు సుంకంతో ఏర్పాటు చేయబడతాయనీ స్వామిజీ వివరించారు. సత్పుత్ర సంతానాన్ని కోరే దంపతులు కృతయుగం తరువాత ఈ దేశ చరిత్రలో ప్రస్తుతం నిర్వహించబడే పుత్రకామేష్టిలో యజమానులుగా పాల్గొని సత్ఫలితాలు పొందాలని స్వామిజీ అన్నారు...''

పుత్రకామేష్టి గురించిన ఇతర వివరాల్నీ, విరాళాల రూపంలో, వస్తురూపంలో యజ్ఞని




ర్వహణకి సహకరించి అందరికీ తండ్రి అయిన పరమాత్ముని అనుగ్రహం పొంద మని ఆస్తిక జనులకు స్వామీజీ ఇచ్చిన సందేశాన్నీ చదివి సహజ పేపర్ని టీపాయ్ మీద పెట్టింది.

"బాగుందికదూ?" పేపర్ని పెట్టేసిన కూతుర్ని చూస్తూ అన్నాడు శ్రీమంతరావు.

"ఏమిటి నాన్నా?"

"అదే! పుత్రకామేష్టి యజ్ఞం... ఎప్పుడో కృతయుగంలో జరిగిందని పురాణాలు చెప్తున్నాయి. ఇన్ని యుగాల తర్వాత ఇప్పుడు ఈ కలియుగంలో ఆ పుత్రకామేష్టియాగం చేయాలన్న సంకల్పం కలగడమే గొప్పసంగతి. ఎంతైనా మనదేశం..."

"... చక్కగా వెనక్కి వెళ్తోంది నాన్నా'' సహజ వాక్యం పూర్తిచేసింది. శ్రీమంతరావు అర్థం కానట్టు చూశాడు.

"పురాణాల రోజులు వేరు నాన్నా. ఈ రోజుల్లో 'పుత్ర-కామ-ఇష్టి' పేరుతో యాగం చేయడం అన్యాయం నాన్నా..."

"నువ్వనేదేమిటో, అన్యాయమేమిటో అర్థం కాలేదమ్మాయ్''

"పుత్ర కామేష్టి అంటే 'పుత్రి-కామేష్టి' కాదు- అనేకదా కొడుకులే కావాలి అంటే 'కూతుళ్ళు వద్దు' అనేగా అర్థం?

శ్రీమంతరావు ఆశ్చర్యంతో నోరు తెరిచాడు.

"పుత్రులే కావాలి, అంటూ పరోక్షంగా పుత్రికలు వద్దంటూ యజ్ఞాలు చేయడం పుత్రికల్ని, స్త్రీ సంతానాన్ని, స్త్రీ జాతిని కించపరచడం కాదా నాన్నా? అది మగ-పక్షపాతం పురుషాధిక్యత, పురుషాహంకారం కాదా?"

శ్రీమంతరావు ఇబ్బందిగా చూశాడు. "అంత దూరంగా అన్వయం చేయడం... అనవసరమనిపిస్తోంది సహజా! కొడుకులు లేనివాళ్లు కొడుకులు కావాలని అనడంలో తప్పేముంది?"

సహజ చిన్నగా నవ్వింది. "నాన్నా... నాకు 'అమ్మ కావాలి. నువ్వొద్దు నాన్నా' అని నేను నీతో అంటే ఎట్లావుంటుంది నాన్నా?"

శ్రీమంతరావు కనుబొమలు పైకి కదిలాయి. "కష్టంగా వుంటుంది..."

"ఇదీ అంతే నాన్నా'' సహజ నవ్వుతూ అంది. "ఆ రోజులు వేరు. ఈ రోజుల్లో స్త్రీ పురుషులిద్దరూ సమానం అనే నినాదాలు వింటున్నాం. ప్రభుత్వం కూడా ఆ పాటే పాడుతోంది. కాలం మారింది. కాలరాచబడినవాళ్లు హక్కులకోసం నిలదీస్తున్నారు. పోరాటాలు సాగిస్తున్నారు. కులవివక్ష ఎంత ప్రమాదకరమో, స్త్రీ-పురుష వివక్ష కూడా అంతే ప్రమాదంకరం నాన్నా''

"...ఔను సూక్ష్మంగా ఆలోచిస్తే... నిజమే అనిపిస్తోంది''

"స్త్రీని కించపరిచే ఇలాంటి పుత్రకామేష్టి దురాచారాన్ని అనుమతించకూడదు నాన్నా'' సహజ ఆవేశంగా అంది.

"హుఁ! అనుమతించకపోడానికీ, అనుమతించడానికీ మనం ఎవరం?"

"మనుషులం నాన్నా!" సహజ గంభీరంగా అంది. "జాతి తప్పు చేస్తే అది నీతిగా మారిపోదు. అంచేత మనిషి ఒంటరిగా అయినాసరే ఎలుగెత్తి తప్పుపట్టాలి'' శ్రీమంతరావు ఏం చెప్పాలో తెలీనివాడిలా మౌనం వహించాడు.

"పుత్రకామేష్టిని- పుత్రుడే కావాలన్న పక్షపాత యజ్ఞకర్మని, పుత్రులుగానే పుట్టిన పురుషులందరూ గుడ్డిగా సమర్థించవచ్చు. సమర్థిస్తారుకూడా. అయితే పుత్రికలుగా పుట్టిన స్త్రీజాతి సమర్థించదు, క్షమించదు''

"సహజా'' శ్రీమంతరావు కంగారుగా అన్నాడు. సహజ తత్వం తెలిసిన అతనికి ఆమె వాలకం, ఆవేశం భయం కలిగిస్తున్నాయి.

"సహజా... నువ్వు తీవ్రంగా రియాక్ట్ అవుతున్నావు. నీ వాలకం చూస్తే.. మళ్ళీ ఈ

కొత్త రొంపిలోకి దగలావున్నావు. నా మాట విను సహజా! ఎవరో ఏదో చేసుకుపోతూంటే నువ్వు బాధపడ్డం. ప్రస్తుతం నువ్వు మామూలు మనిషివి కావు. యువతివి కావు, తల్లి కాబోతున్న స్త్రీవి''

"నేనూ, నాలోని పాపా... ఇద్దరం ఈ దురాగతాన్ని ఖండిస్తాం నాన్నా'' సహజ నవ్వుతూ, స్థిరంగా అంది.

శ్రీమంతరావు కంగారుగా చూశాడు. "నేను... నిన్ను ఎక్కడికీ కదలనివ్వను. నేను నిన్ను అనుమతించను. అంతే''

సహజ తండ్రివైపు విచారంగా చూస్తూ నవ్వింది. "పెళ్ళయిన రోజునుండీ నా అత్తగారూ, మామగారూ, వంతపాడే భర్తగారూ, ఇలాగే ప్రతీదానికీ అనుమతించం అన్నారు నాన్నా! ఇటుకమీద ఇటుక, మరో ఇటుక పెట్టి నా చుట్టూ ప్రాకారం కట్టుతూ కూచున్నారు నాన్నా... అందుకే... ఆ ప్రాకారాలు దాటి వచ్చేశాను''

"సహజా...!"

"అవున్నాన్నా... నా స్వాతంత్ర్యాన్ని హరించే ప్రయత్నం చేశారు. నా గర్భంలోని పాప స్వాతంత్ర్యం హరించే ప్రయత్నం చేశారు. నా బిడ్డను నవమాసాలు మోసి, నాబిడ్డకు జన్మనిచ్చే నా స్వాతంత్ర్యాన్ని హరించే ప్రయత్నం చేశారు. జన్మించే స్వాతంత్ర్యాన్ని నా పాపాయినుండి హరించే ప్రయత్నం చేశారు. పుట్టకముందే నా బిడ్డను, నా తల్లిని పొట్టన పెట్టుకునే ప్రయత్నం చేశారు''

"స...హ...జా..." శ్రీమంతరావు బొంగురుగా అరుస్తూ పైకి లేచాడు. కూతురిపక్కన కూచుని, వణుకుతున్న చేతిని ఆమె భుజం మీద వేశాడు "అంటే... అంటే..."

"అంటే అంతే నాన్నా! నా గర్భస్థ శిశువును లోపలే నిర్దాక్షిణ్యంగా చంపే ప్రయత్నం చేశారు. శ్కానింగ్ జరిగిన మరుక్షణంనుంచీ



నేను, నా పుట్టని బిడ్డమీద కత్తులు దూసిన 'నా కూతురి శత్రువుల్ని' ఎదరిస్తూనే వుండి పోయాను. వెన్నుపోటుకు వెరిచి ఇక్కడికి వచ్చేశాను''

"అమ్మా..." శ్రీమంతరావు బొంగురుగా అన్నాడు. "ఈ నరకం గురించి నాకెందుకు చెప్పలేదు?"

"ఒక స్త్రీ అయిన నా బిడ్డ గౌరవాన్ని, హక్కుని కాపాడ్డానికి నేను అత్తారింటిని వదిలి ఇక్కడికి వలసవచ్చాను నాన్నా! 'నిన్ను అనుమతించను' అన్న ఇంట్లోంచి వచ్చేశాను. ఈ ఇల్లూ నాతో అదే మాట అంటుందా నాన్నా?" అశ్రువులు సహజ కళ్లల్లో మెరిశాయి.

శ్రీమంతరావు తటాలున సహజని తన రెండు చేతుల్తో పొదివి పట్టుకున్నాడు. అతని వేళ్లు ఆమె వీపుని నిమురుతూ ధ్వనిలేని భాషలో అతని వాత్సల్యాన్ని ఆమెకి వినిపిస్తున్నాయి.

"ఈ ఇంట్లో నీ స్వాతంత్ర్యం, నీ బిడ్డస్వాతంత్ర్యం, నువ్వూ, నీ గర్భంలోని శిశువూ స్వేచ్ఛగా వుంటారు తల్లీ''

సహజ తల వెనక్కి వాల్చి ఆనందభాష్పాల జలతారు తెరగుండా తండ్రి మొహంలోకి చూసింది.

"నా స్త్రీ జాతిని చిన్నబుచ్చి అవమానించే పుత్రకామేష్టిని నేను నిరసించాలి నాన్నా''

శ్రీమంతరావు గర్వంగా చూస్తూ తన అరచేతిని సహజ తలమీద పెట్టి, ఆమె బుగ్గమీద ముద్దెట్టుకున్నాడు. ఆ ముద్దులో ప్రేమా, వాత్సల్యం, గర్వం పెనవేసుకుని ధ్వనించాయి.

సహజ తండ్రి కౌగిలినుండి విడిపించుకుని పైకి లేచింది. అశ్రువులతో, ఆనందాశ్రువులతో తడిసిన బుగ్గల్ని తుడుచుకుంది. "నా

ఫ్రెండ్స్‌కి ఫోన్‌చేసి వస్తాను నాన్నా! పుత్రకామేష్టి పట్ల స్త్రీ వ్యతిరేకతను మేం బహిరంగంగా వెల్లడి చేయాలి''

"అమ్మ గుడినుంచి రాగానే ఇద్దరం వెళ్దామా?"

"ఫోన్ ఇంటిపక్కనే వుందిగా'' అంటూ సహజ గుమ్మంవైపు వెళ్ళింది.

★ ★ ★

విశాలమైదానంలో 'పుత్రకామేష్టి ప్రతిఘటన గోష్టి' ప్రారంభమైంది. సహజ తీసుకువచ్చిన చైతన్యం వారంరోజుల్లో చాలామంది మహిళల్ని, యువతుల్ని, విద్యార్థినులని ఉద్యమం వైపు మళ్ళించాయి. మహిళా యూనివర్సిటీ వైస్‌ఛాన్సలర్, రిజిస్ట్రార్, ప్రిన్సిపాల్, వివిధ మహిళా కళాశాలల లెక్చరర్లు, ఉపాధ్యాయినులు, ఇతర ఉద్యోగినులు, నిరుద్యోగినులు, గృహిణులు... ఇలా అన్నిరంగాలకూ చెందిన మహిళలు ప్రతిఘటనోద్యమంలో చేరిపోయారు.

జిల్లాలోని ఇతర ఊళ్ళ విద్యార్థినులూ, ఉద్యోగినులూ వారంరోజుల ప్రయత్నం ఫలితంగా ఉద్యమంతో చేతులు కలిపారు. కరపత్రాలూ, వాల్‌పోస్టర్లూ పబ్లిసిటీ ఇచ్చాయి. కార్యవర్గం ఎన్నుకోబడింది.

పుత్రకామేష్టి- స్త్రీ జాతిని అవమానించే కార్యక్రమం అవడంవల్ల దానిని అనుమతించరాదంటూ ఉద్యమ సమాఖ్య తరపున సహజ కేంద్ర, రాష్ట్ర ప్రభుత్వాలకూ, రాష్ట్ర గవర్నర్‌కూ, రాష్ట్రపతికీ వినతిపత్రాలు పంపింది.

స్వామీజికి విజ్ఞప్తి చేసింది.

పురుషులు కూడా అధిక సంఖ్యలో మైదానానికి తరలివచ్చారు. ప్రముఖ మహిళలు చాలామంది పుత్రకామేష్టిని నిరసిస్తూ ఉపన్యసించారు. చివర కల్చరల్ క్రూసేడర్‌గా, మిస్ టెంపెస్ట్‌గా పాపులర్ అయిన సహజ ఉపన్యసిస్తున్నట్టు ప్రకటించారు.

సహజ ప్రసంగం స్త్రీజాతి వ్యక్తిత్వం పట్లా, స్థానంపట్లా, ఎదుర్కొంటున్న సమస్యలపట్లా ఆమెకి ఉన్న అవగాహనకి అద్దంపట్టింది.

స్త్రీ అయిన సరస్వతిని విద్యకు అధిదేవతగా ఆరాధిస్తారు.

స్త్రీ అయిన పార్వతిని శక్తికి అధిదేవతగా ఆరాధిస్తారు.

స్త్రీ అయిన లక్ష్మిని ఐశ్వర్యానికి అధిదేవతగా ఆరాధిస్తారు.

దేవతాతత్వం ఆపాదించి ఆరాధించే స్త్రీని, నిజజీవితంలో మానవుడు ఏ స్థానంలో వుంచాడు?

స్త్రీకి నిజమైన అర్థంలో స్వాతంత్ర్యం లేదు. పైకి కనిపించే బాహిరమైన ఛాయా స్వాతంత్ర్యం మాత్రమే ఆమెకు బిక్షగా ఇవ్వబడింది. అంతరంగ స్వాతంత్ర్యం ఆమెకి లేదు. స్త్రీకి ఆర్థిక స్వాతంత్ర్యం లేదు. వాక్ స్వాతంత్ర్యం లేదు. ఆలోచనా స్వాతంత్ర్యం లేదు. అయితే అన్ని స్వాతంత్ర్యాలూ ఉన్నట్టు నమ్మించబడుతోంది.

గర్భంలో శిశువుగా వున్న దశనుండీ, కాలం చేసేదాకా స్త్రీ అంచెలంచెలుగా మోసగించబడుతోంది. ఆమె శరీరంతో, హృదయంతో, ఆత్మతో వ్యాపారం సాగుతోంది. నిజజీవితంలో వరకట్నం హత్యలూ, మానభంగాలూ, బలవంతం వ్యభిచారాలూ, నగ్నంగా ఊరేగింపులూ వగైరా అన్యాయాలే కాకుండా, జాతి సంస్కృతికి అద్దంపట్టే కళాసాహిత్యం రంగాల్లో కూడా స్త్రీకి అన్యాయం జరుగుతోంది. కారణం: వ్యాపారం. స్త్రీ శరీరంతో వ్యాపారం. మనసుతో వ్యాపారం. ఆత్మతో వ్యాపారం.

కొడుకే గొప్ప అని అంటే పురుషుడే గొప్ప అని పుత్రకామేష్టి అనే పేరు చెప్తోంది. ఇది స్త్రీ జాతిని రాష్ట్ర వ్యాప్తంగా, దేశవ్యాప్తంగా, విశ్వవ్యాప్తంగా కించపరచి, అవమానించే యజ్ఞం.

పురుషులకి శరీరాలు ఇవ్వడానికి తల్లిగా




ఒకస్త్రీ కావాలి!
శారీరక ఆనందం ఇస్తూ సంతానాన్ని అంది వ్వడానికి భార్యగా ఒక స్త్రీ కావాలి!
కొడుకులకి కట్నం తెచ్చే కోడలుగా ఒక స్త్రీ కావాలి!
అయితే కూతురుగా ఒక స్త్రీ పుట్టకూడదు!
ఎంత విచిత్రం!!

స్త్రీ శిశువుల్నీ, గర్భస్థ శిశువుల్నీ నల్లుల్ని చంపినట్టు చంపుతూవుంటే, కొన్నేళ్ల తరువాత స్త్రీ సంతతి తగ్గిపోతుంది! సమతుల్యత పోతుంది! ఒక్కొక్క ఆడపిల్లను నలుగురైదుగురు ఉమ్మడిగా పెళ్లాడే వ్యవస్థ వచ్చి తీరుతుంది!
మనదేశంలో స్త్రీ రకరకాలుగా సంహరించబడుతోంది!
ఆడపిల్లను కన్నందుకు కోడలు చంపబడుతోంది!
అడిగినంత కట్నం అందివ్వనందుకు కొత్త పెళ్లికూతురు చంపబడుతోంది!
ఆడపిల్లగా పుట్టినందుకు నెలల, రోజుల శిశువు చంపబడుతోంది!
ఆడపిల్లగా గర్భంలో పడినందుకు భ్రూణంగానే చంపబడుతోంది!

ఇప్పుడు మనదేశంలోని స్వార్థం, మనదేశంలోని పురుషాహంకారం, పురుషాధిక్యత ఇంకొక అడుగు ముందుకు వేస్తున్నాయి.

ఆడపిల్ల తల్లిగర్భంలో పడకుండానే ఆపివేసే ప్రక్రియ.

అదే పుత్రకామేష్టి యజ్ఞం!

యుగాల అగాధాల్లో ఖననం అయిపోయిన, పురాణాలపుటల్లో కల్పనగా కరిగిపోయిన పుత్రకామేష్టి అనే సరికొత్త ఆయుధాన్ని తీశారిప్పుడు. స్త్రీతత్వం తల్లిగర్భంలో ప్రవేశించకుండా, కేవలం పురుషతత్వమే ప్రవేశించేలా చేసే ఆయుధం ఇది! ఈ ఆయుధంతో విత్తనంగా మారని అజ్ఞాత దశలోనే మన స్త్రీ జాతిని మగవాడు చంపేసే ప్రయత్నంలో వున్నాడు. ఆ హీనప్రక్రియకు శ్రీకారం చుడుతున్నాడు.

నేను అర్థం చేసుకున్నంతవరకూ, ఈ పుత్రకామేష్టి అన్నది ఒక విచిత్రమైన, శక్తివంతమైన కండోమ్! అది స్త్రీ గర్భంలోకి చాలా తెలివిగా, జాగ్రత్తగా పురుషలక్షణాలున్న క్రోమోజోమ్స్‌నే అనుమతిస్తుంది. స్త్రీ లక్షణాల క్రోమోజోమ్స్‌ని వేరుచేసి, నిరోధిస్తుంది.

ఈ పుత్రకామేష్టి నిజంగా పుత్రుల్ని ప్రసాదిస్తుందా? దానికి అంతశక్తి వుందా? ఈ అధునాతన యుగంలో లేదు అనే సమాధానం చెప్తారు! అయితే, శక్తివున్నా లేకపోయినా పుత్రుల్ని మాత్రమే పొందాలి అన్న ఆలోచన కలిగించే లక్షణం అందులోవుంది!
అదిచాలు... అదిచాలు మన స్త్రీ జాతిని అవమానించడానికి!
అదిచాలు మన స్త్రీజాతి నిషిద్ధ వస్తువు అని చెప్పడానికి!
అదిచాలు స్త్రీ, పురుషుడికి సమానురాలుకాదు అని చెప్పడానికి!

హర్షధ్వానాల్ని వింటూ సహజ కాసేపు ఆగింది.

"పుత్రుడే కావాలన్న కోరికను సమర్థించే పుత్రకామేష్టి పురుషజాతి పరుషమైన అహంకారానికి ప్రతీక!

"మగ సంతానం వాంఛనీయం, ఆడ సంతతి వాంఛనీయం కాదు అంటూ వేద మంత్రాల సాక్షిగా చాటే పుత్రకామేష్టి అసమానతని పెంచే అధమప్రక్రియ.

"నా జాతిని కించపరిచే పుత్రకామేష్టిని నేను అనుమతించను! నా ప్రతిరూపమైన స్త్రీ శిశువును అడ్డుకునే పుత్రకామేష్టిని నేను నిరసిస్తాను! నిందిస్తాను! పురుషజాతిని గొప్పగా చిత్రించే ఆ పుత్రకామేష్టిని నేను అంగీకరించను! స్త్రీజాతిని చిన్నబుచ్చే ఆ పుత్రకామేష్టిని జరగనివ్వను! జరగనివ్వను! జరగనివ్వను! నా ప్రాణం పోయినాసరే జరగనివ్వను!"

వేలాది మహిళా కంఠాలు పుత్రకామేష్టికి

పాడే చరమగీతంలా ప్రతిధ్వనించేయి.

★ ★ ★

"పుత్రకామేష్టిని నిరసించిన మహిళా ప్రభంజనం!"

"మిస్ టెంపెస్ట్ కాదు, మిస్ హరికేన్!"

"పుత్ర కామేష్టి కాదు, అది పురుషాహంకారం! సహజ"

"నా ప్రాణం పోయినాసరే, పుత్రకామేష్టిని సాగనివ్వను'' కల్చరల్ క్రూసేడర్

రకరకాల శీర్షికలకిందవున్న వార్తల్ని చదువుతున్న ఉత్తమ్‌కుమార్ గుండె దడదడ కొట్టుకుంది. ఏ పేపరు చూసినా సహజ పేరే! సహజ ప్రసంగ పాఠం. సహజ స్టేటిమెంట్. సహజతో ముఖాముఖి. సహజ! సహజ! సహజ!

నిండు గర్భిణీ అయిన సహజ నిర్ణయాన్ని పత్రికలు పొగిడిపారేస్తున్నాయి. ఆమెకి కనపడ్డం ఇష్టంలేక తను బహిరంగ సభకు వెళ్లలేదు. అతనికిగతం గుర్తొస్తోంది. సహజ క్రియేట్‌చేసే న్యూస్‌ని రిలే చేసే స్పెషల్ రిపోర్టర్లా తను పనిచేశాడు! ఆ రోజులు ఎంత బాగున్నాయి.

నిండు గర్భిణి సహజ, తన ప్రాణంపోయినా సరే పుత్రకామేష్టిని జరగనివ్వను అంటూ శపథం చేసింది! ఆమె తత్వం తనకి తెలుసు. ఒకసారి నిర్ణయించుకుంటే వెనుదిరిగేది ఆమె నిఘంటువులో లేదు! నిండుగర్భిణి.. ఆవేశంలో విశ్రాంతిలేని శ్రమతో ఆమెకి ఏదేనా అయితే! సహజకి ఏదేనా అయితే...

లోపల్లోపలే కంపించిపోతూ ఉత్తమ్‌కుమార్ పైకి లేచాడు..

★ ★ ★

"నీ నిర్ణయం మార్చుకో సహజా!"

"ఏ నిర్ణయం?"

"పుత్రకామేష్టిని ప్రతిఘటించడం..." ఉత్తమ్ కూమార్ ప్రాధేయ పూర్వకంగా చూశాడు.

సహజ విశాలనేత్రాలు ఇంకా విశాలంగా అయ్యాయి. "ఎందుకు మార్చుకోవాలి?"

"నీకోసం... నీ గర్భంలోని పాపకోసం... నాకోసం"

"విచిత్రంగా మాట్లాడుతున్నావు ఉత్తమ్ నాకోసం ఎందుకు మానాలి? నీకోసం ఎందుకు మానాలి?" సహజ అంది. "పాపకోసం నేను పుత్రకామేష్టిని ప్రతిఘటించి తీరాలి! ప్రతిఘటించకపోతే పాప స్థానంలో బాబు ఉండాలని నేను కోరుకున్నట్టవుతుంది. ప్రతిఘటించకపోతే ఈ దేశంలో, ఈ లోకంలో ఏ స్త్రీ గర్భంలోనూ స్త్రీ శిశువు పెరగకూడదని చెప్పినట్టవుతుంది! ఆడజన్మ హీనమైందని ఒప్పుకున్నట్టవుతుంది!"

ఉత్తమ్ నిస్సహాయంగా చూశాడు. "నా బాధా, నా భయం నీకు అర్థం కావడంలేదు సహజా... పుత్రకామేష్టి జరిగే సమయానికి నీకు ప్రసవించే టైం దగ్గరపడుతుంది. ఈమధ్యలో ఉద్యమం నడుపుతూ, విశ్రాంతి లేకుండా... నీకు ఏమైనా అయితే నేను సహించలేను సహజా''

సహజ అతన్నే చూస్తూ వుండిపోయింది. మెల్లిగా ఆమె కళ్లల్లో తడి చోటు చేసుకోసాగింది. "అబార్షన్ చేసుకోవడం, నాకు ఏమైనా అవడమేగా! ఏమైనా అయివుండొచ్చుగా? అప్పుడు సహించగలవనే అనుకున్నావా ఉత్తమ్?"

"సహజా... ఆ విషయం ఇప్పుడు దేనికి? అదంతా గతం... మరిచిపోదాం"

"గతాన్ని వర్తమానంలో గుర్తు చేసుకో ఉత్తమ్. అది భవిష్యత్తుకి మంచిది!"

"మాటవరసకి అన్నాను అబార్షన్ విషయం మరిచిపోదామన్నాను... అసలు గతాన్ని కాదు... ఆ గతాన్ని అనుక్షణం స్వగతంలో గుర్తు చేసుకుంటూనే వున్నాను సహజా! నాకు నాకు ఆ గతం కావాలి... మళ్లీ ఆ గతం కావాలి సహజా!" ఉత్తమ్ దీనంగా




అన్నాడు.

సహజ కళ్లల్లో నీళ్లు తిరిగాయి. "ఆ గతాన్ని... ఆ నిన్ను నేను మరిచిపోలేను ఉత్తమ్... రోడ్డు మీద శవంలా పడున్న నన్ను కాపాడిన నిన్ను... కాత్యాయని విషయంలో సహాయం చేసిన నిన్ను... నా అభిరుచిని నీ అభిరుచిగా ప్రతిధ్వనింపచేసిన నిన్ను... ఒక ఆడదాని హృదయంతో నా తపననీ, ఆరాటా న్నీ అర్థం చేసుకున్న నిన్ను... నన్ను ప్రే మించిన నిన్ను... నేను మరిచిపోలేను ఉత్తమ్!"

"సహజా!"

"కానీ... సంభవామి గృహేగృహే ఫార్ము లాని నా హృదయంతో అర్థం చేసుకుని ఇంటింటా ఒక ఆదిశక్తి ఆవిర్భవించాలన్న ఆశయాన్ని అమృతవాక్కులా అంగీకరించిన నువ్వు, నాద్వారా, ఆ ఫార్ములాని పరిచ యంచేసి, ప్రయోగం చేస్తున్న నా ద్వారా మన ఇంటిలో ఒక ఆదిశక్తి జన్మించే అవకాశా న్ని, అదృష్టాన్ని నిర్దయగా ఖండించే ప్రయ త్నం చేశావు! దాన్ని కూడా మరిచిపోలే కుండా వున్నాను, ఉత్తమ్!"

సహజ మాట అతని గుండెను కత్తిలా కోసింది. "నన్ను... క్షమించు సహజా... ఆశయానికీ, ఆచరణకూమధ్య ఎన్నో ఆమ డల దూరం ఉంటుందనుకునేవాళ్లే ఎక్కువ. దురదృష్టవశాత్తూ నేను ఆ గుంపులో చేరిపో యాను... నీలాగా ఆశయం ఆచరణ ఒకే నాణేనికి రెండువైపులు అని భావించే శక్తి నాకు లేకుండాపోయింది"

"థాంక్స్ ఉత్తమ్, ఫర్‌ది కాంప్లిమెంట్!" సహజ నవ్వుతూ అంది.

★ ★ ★

అసమానతను పెంచే పుత్రకామే ష్టిని ఆపమంటూ మహిళావేదికలు చేసిన విజ్ఞప్తిని ప్రభుత్వం పట్టించుకోలేదు. టీవీ ద్వారా, రేడియోద్వారా, పేపర్లద్వారా ఆడ పిల్లని మగపిల్లవాడితో సమానంగా చూడ మంటూ నిత్యనినాదం అందించే ప్రభుత్వాని కి పుత్రకామేష్టి విషయంలో గుడ్డితనం, చెవు డూ పట్టుకున్నాయి.

ప్రతిఘటనని స్త్రీల అజ్ఞానంగా అభివర్ణించా డు విలేకర్ల సమావేశంలో నిర్వికల్పానంద బ్రహ్మచారి.

పుత్రకామేష్టి రెండు రోజుల్లో ప్రారంభం కానుంది. మొదటిరోజు అయిదువేలమంది దంపతులు యజ్ఞ యజమానులుగా పాల్గొంటున్నట్టు యజ్ఞం కమిటీ అనౌన్స్ చేసింది. ఒక కేంద్రమంత్రీ, ఇద్దరు రాష్ట్ర మంత్రులూ ప్రారంభోత్సవానికి విచ్చేస్తున్నా రు. ఏర్పాట్లు ముమ్మరంగా సాగుతున్నాయి.

పుత్రకామేష్టి ప్రతిఘటనవేదిక తన కార్య క్రమాల్ని ముమ్మరం చేసింది. ప్రారంభో త్సవం రోజు ప్రతిఘటించడానికి అవసర మైన కార్యాచరణ పథకం రూపొందించ డంలో సహజ తల మునకలుగా ఉంది.

ఓ ప్రముఖ దిన పత్రిక సహజతో ఇంట ర్వ్యూ ప్రచురించింది. తనలోంచి తనే ఇన్స్ పిరేషన్ పొందిన సహజ నిజజీవితంలో వరక ట్నదురాచారాన్ని ఎదిరించడంతో స్త్రీ విమో చన కార్యరంగంలోకి ప్రవేశించిసాధించిన అనేక ఘనవిజయాలను వివరించింది పత్రిక.

తన కల్చరల్ క్రూసేడ్‌లో చేదోడు వాదోడు గా వ్యవహరించిన ఉత్తమ్‌కుమార్ అనే ఫ్రీలా న్స్ జర్నలిస్టుని వివాహం చేసుకున్న సహజ ప్రస్తుతం గర్భవతి. నేడే రేపో ప్రసవించేస్థి తిలో ఉన్నా కూడా వెనుదీయకుండా పుత్రకా మేష్టి ప్రతిఘటన కార్యక్రమంలో అహెూరాత్రా లు కృషి చేస్తోంది.

సహజ తన సరికొత్త ఉద్యమంలో విజయం సాధిస్తుందా! వేచిచూడాల్సిందే! అంది పత్రిక చివరిగా.

★ ★ ★

అలసిపోయి, అర్ధరాత్రికి ఇంటికి వచ్చిన సహజను అమృతమ్మ కౌగిలించుకుంది. "ఎ



లా అలిసిపోయావో చూడు! ఈ పుత్రకామేష్టి ఇప్పుడే రావాలా! విశ్రాంతి తీసుకోవాల్సిన సమయంలో ఈ విప్లవాలు ఎందుకు తల్లీ నీకు? ఎవరికీ పట్టని వ్యవహారాలన్నీ నీనెత్తినే వేసుకుంటావు''

కన్నీళ్లు కారుస్తున్న తల్లిని సహజ చిరునవ్వుతో చూసింది.

"డాక్టర్ తొమ్మిదో తేదీ అన్నాడుగా అమ్మా! ఇంకా మూడు రోజులుందిగా?" సహజ నవ్వుతూ అంది. "నీకూతురికీ, మన వరాలికీ ఏం భయంలేదులే! పొద్దుటే ఊరేగింపుగా వెళ్లడం, ప్రారంభోత్సవాన్ని ప్రతిఘటించి ఆపడం హాయిగా తిరిగి రావడం! అంతేగా? ఆ తరువాత నీ ఒళ్లో తలపెట్టుకుని కదలకుండా పడుకుంటానుగా!" సహజ నవ్వుతూ అంది.

"ఆ... అన్నం పెట్టేయ్. మధ్యాహ్నం నుంచీ మంచినీళ్లు కూడా ముట్టలేదు అమ్మాయి!" శ్రీమంతరావు భార్యని తొందర పెట్టాడు.

★ ★ ★

పుత్రకామేష్టి యజ్ఞానికీ, దాని ప్రతిఘటనకీ సంబంధించిన న్యూస్‌పేపర్ రిపోర్ట్స్ అన్నీ చదివి, విసుగ్గా పేపర్లని గిరాటేశాడు ఇన్స్‌పెక్టర్ పీతాంబరం. యజ్ఞానికి ప్రతిఘటన, హోమానికి ప్రతిఘటన! ప్రతీదానికీ ప్రతిఘటనే! ప్రతీదానికీ పోలీసు రక్షణ! కసిగా అనుకున్నాడతను. కొన్నాళ్ల తర్వాత పెళ్లికీ, పేరంటానికీ కూడా పోలీసు రక్షణ కావాల్సి వుంటుంది.

ఎవడు ఏ తిక్క కార్యక్రమం తలపెట్టినా అది తిరిగి తిరిగి తన డిపార్ట్‌మెంట్ తలకి చుట్టుకుంటుంది. పీతాంబరం టైమ్ చూసుకున్నాడు. పదకొండున్నర! రాత్రి పదకొండు దాటితే గానీ తను ఆ రోజు న్యూస్ పేపర్ చూడలేదు! మోగుతున్న టెలిఫోన్ అందుకున్నాడతను. ఇప్పుడు ఎవరు ఫోన్ చేస్తారో అతనికి తెలుసు. ఎస్.పీ! పుత్రకామేష్టి పరిరక్షణ ఫైనల్‌టచ్ గురించి అడగడానికి... పీతాంబరం అంచనా కరెక్టే.

"యస్సర్!" అన్నాడతను కాసేపు విని. "అన్నీ పూర్తి చేశాను సర్! అయిదు వందల మంది సాయుధ పోలీసుల్ని నియమించాను సర్! బారికేడ్లు రాత్రే ఫిక్సైపోతాయి సర్!"

"సెంట్రల్ మినిస్టరూ, ఇద్దరు స్టేట్ మినిస్టర్సూ... ఆ ముగ్గుర్లో ఇద్దరు సతీమణుల్తో సహా పుత్రకామేష్టి చేస్తున్నారు! ఇప్పుడే వర్తమానం వచ్చింది! ఏదేనా గొడవ జరిగితే కొంపలంటుకుంటాయి! ఆడమూకతో వ్యవహారం!"

"అది నా కొదిలేయండి సర్. ఎవ్విరిథింగ్ విల్‌బీ అండర్ కంట్రోల్ సర్! ఆడవాళ్లైనంత మాత్రాన కంగారు అఖ్ఖర్లేదు సర్. ప్రొహిబిషన్ మూవ్‌మెంట్‌లో చూస్తున్నారుగా సర్! లాఠీలు ఎత్తితే లంగాలు చేత్తో పట్టుకుని పరుగు లంకించుకుంటారు సర్!" పీతాంబరం నవ్వుతూ అన్నాడు.

"బీ మోర్ కేర్‌ఫుల్! మనం ఏదేనా చేస్తే 'పోలీసులు తొందరపడకుండా వుంటే బాగుండేది!' అనేస్తారు చివరికి''

"ఐనోసర్! యస్సర్! యజ్ఞం ప్రారంభోత్సవం జరుగుతుంది. యజ్ఞం జరుగుతుంది. మినిస్టర్లు పుత్రకామేష్టి చేస్తారు సర్! ఇంకో మూడొందలమందిని ఇప్పుడే డిప్లాయ్ చేస్తాను సర్! తమరు రిలాక్స్ అవండిసర్! గుడ్‌నైట్ సర్!" పీతాంబరం రిసీవర్ని పడేసి, మళ్లీ అందుకున్నాడు...

★ ★ ★

వేలాదిమంది స్త్రీలతో ఆప్రాంతం క్రిక్కిరిసివుంది. సహజా, ఇతర మహిళలూ ఇచ్చే సూచనలు వినడానికి తయారుగా వున్న ఆ వనితా జనసమూహం కెరటాలులేని, నిశ్శబ్ద సాగరంలా వుంది. సహజ కొంచెం ఎత్తుగావున్న అరుగుమీద నిలబడింది. నిండు గర్భంతో పరిపూర్ణత సంతరించుకున్న ఆమె బొద్దుగా ముచ్చటగావుంది.




"పుత్రకామేష్టిని ప్రతిఘటిస్తున్న మన ఉద్యమం, కేవలం ఉద్యమంకాదు, అది పుత్రికామేష్టి!" అంది సహజ.

చప్పట్లు మారుమోగాయి.

"యజ్ఞంలో స్త్రీలు పాల్గొనకుండా నిరోధించాలి!"

"పరోక్షంగా స్త్రీ జాతిని అధమంగాచూసే, అవమానించే పుత్రకామేష్టిని మనం సాగనివ్వకూడదు! ఆడపిల్లగా జన్మించే హక్కును పుత్రకామేష్టి మంత్రాలతో, తంత్రాలతో నిరోధించాలన్న సంకల్పాన్ని, సంప్రదాయాన్ని మనం ఆ యజ్ఞగుండంలోనే బూడిద చేయాలి!" సహజలోని భావోద్వేగం అక్కడున్న ప్రతి హృదయాన్నీ అదృశ్య తరంగాల ద్వారా ఆక్రమిస్తోంది.

"కదలండి! నడుం బిగించండి! గొంతులు విప్పండి! పుత్రకామేష్టిని ఆపండి!" సహజ మాటల్లోని చైతన్యం, ఉత్సాహం, ఉద్రేకం వాతావరణానికి కొత్త ఊపిరి పోశాయి. సహజ కిందికి దిగింది.

పుత్ర కామేష్టి ప్రతిఘటన ఉత్సాహంతో ముందుకు అడుగువేసింది.



విశాలమైన మైదానంలో తాత్కాలిక నిర్మాణం రూపంలో వెలసిన పుత్రకామేష్టి పురం చుట్టూ వందలాది మంది పోలీసులు రక్షణవలయంగా ఏర్పడున్నారు. ప్రధాన మండపంలో ప్రారంభోత్సవ కార్యక్రమం ప్రారంభమైంది. ఆరుగురు కూతుళ్లు మాత్రమే ఉండి, పుత్రుడనే వాడులేని కేంద్రమంత్రి, తనకి రాజకీయవారసుడు జన్మించి తీరాలన్న కోరికతో స్వామి నిర్వికల్పానంద బ్రహ్మచారి పాదాలకు నమస్కరించి, జ్యోతి వెలిగించడానికి ఉద్యుక్తుడయ్యాడు.

మంత్రి జ్యోతి వెలిగింపు కార్యక్రమానికి నేపథ్య సంగీతం అందిస్తున్నట్టు దూరంనుంచి సముద్రఘోషలా నినాదాలు వినిపించడం ప్రారంభించాయి. నినాదాలనూ నల్లజెండాలనూ కౌంటింగ్ తర్వాత కాల్చి పారేసే బ్యాలెట్ పేపర్లుగా భావించే మంత్రి జ్యోతిని వెలిగించాడు. వెంటనే నిర్వికల్పానంద బ్రహ్మచారి స్వామివారి ప్రసంగం పుత్రకామేష్టి గొప్పతనాన్ని వర్ణించడం ప్రారంభించింది

★ ★ ★

"మీ యజ్ఞం పుత్రకామేష్టి.. మా ప్రతిఘటన పుత్రికామేష్టి!"

"పుత్రకామేష్టి అనే పురుషకామేష్టి ఆపండి!"

"పుత్రకామేష్టిలో మాస్త్రీ బలిపశువుకావడం సహించం!"

"పుత్రకామేష్టికాదు, పురుషకామేష్టి!"

"పుత్రకామేష్టిలో పాల్గొనే స్త్రీలు ఇవతలికి రావాలి!"

ముందు నడుస్తూ సహజ అందిస్తున్న నినాదాలు వేలాది కంఠాలలో ప్రతిధ్వనిస్తున్నాయి.

వేలాది స్త్రీ కంఠాలు రణరంగంలో ఆదిశక్తి పూరించే శంఖాల్లా ధ్వనిస్తున్నాయి.

ఒకదాన్నొకటి తరుముకుంటూ వచ్చే ఆగ్రహతరంగాల్లా ముందుకు ముంచుకువస్తున్న మహిళల పైటలు రంగురంగుల విజయపతాకాల్లా గాలిలో ఎగురుతున్నాయి.

కెరటాల ఉధృతిని ఆపడానికి ముందుకు వెళ్తున్న కాకీగోడలా పోలీసులు కదిలారు.

కానీ కెరటాల ఉధృతికి గోడ చెల్లా చెదురై పోయింది.

బారికేడ్లు పుత్రకామేష్టి యజ్ఞంలో ఉపయోగించే సమిధల్లా, పుల్లల్లా తునాతునకలైపోతున్నాయి...

నిమిషాలు గడుస్తున్నాయి. నినాదాల హోరు. తొక్కిసలాట. తోపుళ్లు. ఒక్క క్షణంసేపు పోలీసుల చేతుల్లోంచి 'అదుపు' జారిపోయింది... స్త్రీ సైన్యం ఆగ్రహావేశాలతో వున్న తేనెటీగల గుంపుల్లా బ్యారికేడ్లనీ, తెరల్నీ, గేట్లనీ చీల్చుకుంటూ పుత్రకామేష్టిపుర ప్రవేశం చేసింది. కోటలోపల ముట్టడి ప్రారంభమైంది...

పుత్రకామేష్టి ప్రారంభ మంత్రాల్ని 'పుత్రికామేష్టి' నినాదాలు అవలీలగా మింగేసి తమ గర్భంలో దాచుకుంటున్నాయి. యజ్ఞగుండాల్లో అప్పుడప్పుడే ప్రజ్వరిల్లడం ప్రారంభించిన జ్వాలల్ని ఆర్పే ప్రయత్నంతో, మహిళల ఆగ్రహం మంటలై ముందుకు దూకింది. ప్రధాన యజ్ఞమంటపాన్ని సమీపిస్తోంది.

స్త్రీ శక్తికి ఆవేశ క్షీరాన్ని అందించే ధేనువులా సహజ ముందు వెళ్తోంది...

అధికారుల ఆదేశం పోలీసు లాఠీలకి ప్రాణం పోసింది. నేలమీద బూట్లు పరుగెడుతున్నాయి. లాఠీలు గాలిలో నాట్యం చేస్తున్నాయి. నినాదాలు లాఠీల్ని వెక్కిరిస్తున్నాయి.

యజ్ఞవాటిక యుద్ధరంగంగా మారిపోయింది. తొక్కిసలాట. తలలు పగిలిన, ఎముకల విరిగిన స్త్రీల ఆర్తనాదాలు...

ఉన్నట్టుండి బరువుగా ఊపిరిపీల్చుకుంటూ అడుగు ముందుకు వేస్తున్న సహజను ధూళిమేఘంలోంచి, గురిచూసి మరీ దూసుకువచ్చిన రెండు కాకీ శరీరాలు మొర






టుగా ఢీకొన్నాయి.

సహజ నేలమీద వెల్లకిలా పడిపోయింది. ఎన్నో పాదాలు ఆమె శరీరాన్ని తాకుతున్నాయి. పాదాలూ, బూట్లూ తాకుతూ సృష్టిస్తున్న నొప్పి సహజకి తెలియడంలేదు. ఆమె లోని సర్వస్వం- ఆమెలోని పాప రక్షణకోసం మౌనంగా, నిశ్శబ్దంగా బొబ్బలు పెడుతోంది. సహజ చేతులు ఆమె కడుపుమీద అతుక్కుపోయిన కవచాల్లా వుండిపోయాయి.

కొంచెందూరంలో నిలబడి పోలీసుల్ని రెచ్చగొడుతున్న ఇన్స్పెక్టర్ పీతాంబరం దృష్టి నేలమీద పడి ఉన్న సహజ మీద పడింది. రాత్రి పేపర్లో చదివిన ఇంటర్వ్యూ వ్యాసం అతనికి గుర్తొస్తోంది.

కాత్యాయనిని వివస్త్రగా ఊరేగించిన రాక్షసులు చట్టానికి లొంగడంలో ఆమె కీలక పాత్ర వహించింది.

పీతాంబరం అప్రయత్నంగా పళ్ళుకొరుక్కున్నాడు. తన భార్యా బిడ్డలద్వారా తనని బ్లాక్‌మెయిల్ చేయించిన శక్తి సహజే అయి వుండొచ్చన్న అనుమానం అతనికి ఎప్పట్నించో వుంది.

ఆ పగ పీతాంబరం పాదాల్ని కదిలించింది. జనాన్ని తరిమిగొడుతున్న తన సైనికుల్ని చేరడానికి వెళ్తున్న వాడిలా అతను ముందుకు పరుగెట్టాడు. అతని కుడికాలి బూటుకాలు గురి తప్పకుండా వెల్లకిలా పడి వున్న సహజ పొట్టని తాకింది. పగ, కసి, కోపం అతని బూటులోకి ప్రవేశించింది. సహజ కెవ్వుమంది. పీతాంబరం తన పని అయినట్లు తప్పుకున్నాడు.

'కిక్ హర్!' మెలికలు తిరుగుతున్న సహజ శరీరాన్ని కోపంగా చూస్తూ కర్కశంగా ఆర్డరిచ్చాడు పీతాంబరం.

తమ అధికారి బూట్ల జాడల్లో వినయంగా

నడిచే పోలీసుల బూట్లు అపరంజి తీగను నిర్దాక్షిణ్యంగా, రాక్షసంగా మోదే ఇనప సమ్మెటల్లా తాకుతున్నాయి. సహజ శరీరం... నిండు గర్భిణి సున్నిత శరీరం అటూ ఇటూ... అటూ ఇటూ...

"ఆపండిరా! మీరు మనుషులేనా!" ఓ అమ్మాయి లాఠీ దెబ్బలు తింటూ వచ్చి అడ్డం పడింది.

"ఇందూ!" పీతాంబరం ఆశ్చర్యంతో అరిచాడు. "నువ్వెందుకొచ్చావ్ ఇక్కడికి?"

ఇన్స్‌పెక్టర్నీ అతని కూతుర్నీ చూస్తున్న పోలీసుల లాఠీలూ, బూట్లూ కదలడం మానేశాయి.

"ఇప్పుడో అప్పుడో ప్రసవించే గర్భవతిని తన్నించే బుద్ధి నీకెట్లా పుట్టింది నాన్నా?" ఇందులేఖ గర్జించింది.

పీతాంబరం తటాలున కూతురి జబ్బపట్టుకున్నాడు. "ఫో ఇక్కణ్ణుంచి!" అంటూ విసురుగా తోయబోయాడు.

ఇందులేఖ రెండుచేతులూ అతని ఛాతీ మీదికి లేచాయి. ఆమె తోసిన తోపుకి పీతాంబరం వెనక్కితూలిపడ్డాడు. ఇందులేఖ సహజ దగ్గరగా నేలమీద కూలిపోయింది.

ఆత్రంగా, భయంగా సహజని కదిపింది ఇందులేఖ. "అక్కయ్యా... సహజక్కయ్యా..." ఇందులేఖ భోరున ఏడుస్తూ సహజ తలని రెండుచేతుల్తో పైకెత్తింది. సహజ మొహంమీద రక్తం మరకలు... మట్టి... ధూళి...

"అక్కయ్యా..."

సహజ తల మెల్లిగా కదిలింది. కళ్ళు నెమ్మదిగా విచ్చుకున్నాయి.

"అ...క్క...య్యా..." ఇందులేఖ బావురుమంది.

"ఇం...దూ... నా... పాప... పాప..." సహజ కంఠం వణుకుతోంది.

ఇందులేఖ అప్రయత్నంగా సహజ పొట్టవైపు చూసింది. సహజ చేతులు పొట్టని తాపడం అయిపోయివున్నాయి! ఇందులేఖ సహజ చేతులమీద తన చేతిని వేసింది.

"పాప... ఇందూ... నా... పా...ప..."

"పాపకేం కాదక్కయ్యా... భయపడకు... అక్కయ్యా..."

సహజ బలహీనంగా కళ్ళుమూసుకుంది. ఆమె శరీరానికి బాధ తెలియడంలేదు... తన గర్భంలోని పాప పంపుతున్న ఏవో సంకేతాలు, నిశ్శబ్దంగా ఆమె సర్వస్వానికీ వినిపిస్తున్నాయి...

ఏడుస్తున్న ఇందులేఖ తటాలున తలతిప్పి, రాయిలా నిలబడ్డ తండ్రివైపు హీనంగా చూసింది. ఆమె ఏడుపు ఆగిపోయింది.

"వెళ్ళిపో ఇక్కణ్ణుంచి! ఇంకో క్షణం ఇక్కడుంటే నిన్ను ఈ చేతుల్తో చంపేస్తాను!"

పీతాంబరం తన కూతురి కళ్ళలో భీకరంగా ప్రతిఫలిస్తున్న మృత్యువుని చూస్తూ, అసంకల్పితంగా వెనక్కి అడుగువేశాడు...

ఆడవాళ్ళు పరిగెట్టుకొస్తున్నారు. కాత్యాయని, పరిమళ, భానుమతి, హారతి... ఇంకా ఎందరో...

  

సహజ మెల్లిగా కళ్ళు తెరిచింది. తనని పిలుస్తున్న వాళ్ళని తన పెద్దపెద్ద కళ్ళతో కలయజూసింది. అందరి మొహాల్లో దుఃఖం. అందరి కళ్ళల్లో అశ్రువులు, అందరి కళ్లలో అగ్నిగోళాలు.

"సహజా... ఎలావుంది?" డాక్టర్ సుశీల ప్రేమగా అడిగింది.

"నా... పాప... డాక్టర్... ఎత్తుకోమంటోంది... డాక్టర్..." అప్రయత్నంగా సహజ మూలిగింది. "నా... చిట్టితల్లి... నా లోపల... తప్పటడుగులు... వేస్తోంది... డాక్టర్... నా... తల్లి... చేతిని పట్టుకుని... నడిపించండి... డాక్టర్..."

"సహజా!" డాక్టర్ సుశీల సహజ తల నిమిరించి "నీ పాపకేం కాదు. సహజా... నీ




బంగారు చేతులు... నీ చిన్నారిని... రక్షించాయి సహజా!"

సహజ మొహంమీద చిరునవ్వు వెన్నెల్లా మెరిసింది. ఆమె శరీరంలో ఏదో కదిలిక... అసంకల్పితంగా సహజ మూలిగింది.

కేర్‌మన్న పసిపాప ఏడుపు ఆమె మూలుగుతో శృతికలిపింది... ఆడవాళ్లు సహజ చుట్టూ తమ శరీరాలతో గోడకట్టేశారు. కొంగుల్తో గది కట్టేశారు.

★ ★ ★

"ఏదీ... నా తల్లి ఏదీ...? ఎక్కడ?" శ్రీమంతరావు ఆడవాళ్ళని తోసుకుంటూ లోపలికి జొరబడ్డాడు.

చుట్టూ నుంచున్న, కూచున్న స్త్రీల మధ్య, ఏదో రాక్షసహస్తం నరికి పారేసిన తీగలా పడున్న తన కూతుర్ని చూస్తూ, ఎడంచేత్తో గుండెను అదుముకున్నాడతను. "సహజా..."

"నాన్నా... సహజ చూపుల్ని తిప్పి తండ్రిని చూస్తూ అంది. "నాన్నా... పాప... పాప... నాన్నా..."

శ్రీమంతరావు కూతురి తల దగ్గర కూలబడిపోయాడు "సహజా... ఎందుకు తల్లీ నీకీ శిక్ష? ఎందుకు తల్లీ...?"

"సహజా'' ఉత్తమ్‌కుమార్ రొప్పుతూ వచ్చి అరిచాడు.

"ఉత్తమ్... వచ్చావా? నేను... పాపను... కన్నాను... చూశావా...?"

"వాళ్లు... ముందుగా రానివ్వలేదు సహజా... రాలేకపోయాను సహజా..." ఉత్తమ్ పసిపిల్లాడిలా ఏడ్చాడు. "నీ పాప... మన పాప... నాక్కావాలి సహజా''

సహజ తలదగ్గర కూచుని, ఆమెను సున్నితంగా లేవనెత్తి తన ఛాతిని ఆమె వీపుకు ఆన్చుకున్నాడు. "సహజా... ఎలా ఉంది. నీకు? నిన్ను వెంటనే హాస్పిటల్‌కి తీసుకెళ్తాను..."

"నేను ఇక్కణ్ణుంచి... రాను... రాలేను... ఉత్తమ్''

"సహజా..." ఉత్తమ్ దీనంగా అరిచాడు.

"నాకు... ఫర్వాలేదు. ఉత్తమ్... కావాలంటే... డాక్టర్ని అడుగు''

"సహజని కదపకండి'' అంటూ డాక్టర్ సుశీల నెత్తురుముద్దలా తన చేతుల్లో ఉన్న పాపని సహజ వొళ్లో పెట్టింది.

వణుకుతున్న సహజ చేతులు తన కూతుర్ని మెల్లిగా నిమిరాయి. "నా తల్లిని ఈ లోకంలోకి తెచ్చాను...నా కూతురు వచ్చేసింది... నేను జయించాను''

"అమ్మా... సహజా..." శ్రీమంతరావు కూతురు స్థితి చూసి బావురుమన్నాడు.

ఉత్తమ్ తన చెంపని సహజ చెంపకు అదిమాడు. "సహజా... నువ్వు లేందే నేను బతకను సహజా... నువ్వు త్వరగా కోలుకోవాలి సహజా''

"ఉత్తమ్..." అంటూనే సహజ తండ్రివైపు చూసింది.

"నాన్నా... ఏడవకు నాన్నా... నేను చావను నాన్నా... నాకు చావులేదు. నాన్నా... 'సంభవామి గృహే గృహే' అన్నాగా... నాన్నా'

అంతసేపూ మూగగా రోదిస్తున్న స్త్రీలంతా, ఆశ్చర్యంగా సహజ మొహంలోకి చూశారు... చూస్తూ వుండిపోయారు.

... ... ...

ఉన్నట్టుండి యజ్ఞశాలలో మంత్రాలు ఆగిపోయాయి. యజ్ఞదీక్షలో వున్న స్త్రీలలో కొందరు ఇటు పరిగెట్టుకొస్తున్నారు. ఎవరో స్త్రీ ప్రసవించి చావుబతుకుల్లో వుందన్న వార్త ఆ స్త్రీలని యజ్ఞగుండాల ముందునుంచి పైకి లేపింది. పసుపురంగు దీక్షావస్త్రాల్లో తననే చూస్తున్న ఆడవాళ్లని సహజ కన్నార్పకుండా చూస్తోంది.

"సహజా... నువ్వు జయించావు. పుత్రకా

మేష్టి ఆగిపోయింది. సహజా!" పరిమళ ఉద్రేకంతో చెప్పింది.

"సహజ నవ్వింది. అలా నవ్వుతూనే ఉండిపోయింది. నవ్వు ఆపిన సహజ చూపులు వొళ్లో బజ్జున్న పాపమీదికి వాలాయి. ఆమె చేతులు తన కూతుర్ని స్పృశిస్తూ, స్పృశిస్తూ ఉండిపోయాయి. అలసటతో ఆమె కళ్లు మూతలుపడ్డాయి. సహజ పెదవులు అదురుతూ కదిలాయి.

"సంభవామి... గృహే గృహే..." సహజ కంఠం తగ్గుస్వరంలో కూడా స్పష్టంగా ధ్వనించింది.

"సహజా..." ఎన్నో ఎన్నో కంఠాలు ఆప్యాయంగా అరిచాయి.

పరిమళ సహజ ఒళ్లోని పాపని అందుకుని లేచి నిలబడింది. పాపవైపు ఒకసారి చూసి, పరిమళ తల పైకెత్తింది.

"సంభవామి గృహే గృహే" పరిమళ కంఠం శంఖనాదంలా ధ్వనించింది.

చుట్టూ గుంపుగా నిలబడ్డ ఎంతోమంది, ఎంతోమంది స్త్రీల కంఠాలు చేసిన నినాదంతో అక్కడి వాతావరణం ప్రకంపించింది.

"సంభవామి గృహే గృహే!"



తనలో నిద్రాణంగా వున్న శక్తిని జోలపాడుతూ ఇంకా నిద్రపుచ్చే స్త్రీకి ఈ నవల అంకితం

– వక్కంతం సూర్యనారాయణరావ్





# 'నిర్జీవయాత్ర'పై సమీక్షలు

ఏప్రిల్ చతురలో ప్రచురితమైన సత్యవోలు సుందరశాయి నవల 'నిర్జీవ యాత్ర'పై మాకందిన సమీక్షలలో ఉత్తమంగా ఉన్న ఐదింటిని ఈ దిగువ ప్రచురిస్తున్నాం.

## నైతిక సమర్థత ముఖ్యం

*(ప్రథమ బహుమతి రు: 100/- పొందిన సమీక్ష)*

ఈ నవల్లో రచయిత పోలీసువ్యవస్థ, రాజకీయనాయకుల వైఖరి, ఉన్నత, మధ్యతరగతి ప్రజల జీవనశైలి వంటి భిన్నాంశాలను స్పృశించి, విశ్లేషించి వాటిని కథలో పాత్రలకన్వయిస్తూ నడిపిన కథాకథనశైలి అద్భుతం. అంతేకాదు. పాత్రలకనుగుణంగా వాస్తవాలని మలచకుండా వాస్తవాల కనుగుణంగా పాత్రలను మలచగల్గటంలో రచయిత ప్రతిభ ప్రదర్శించారన్నది నా అభిమతం.

'సమర్థత'ను విభిన్నకోణాల్లో చూపేయత్నం జరిగింది. భౌతిక జీవితంలో పైకెదగాలన్న తపన కారణంగా, అంతరాత్మను అణగదొక్కితే, భౌతిక ఉత్థానం ఏ స్థాయిలో ఉంటుందో, నైతికపతనం కూడా అదేస్థాయిలో ఉంటుందనటానికి కృష్ణస్వామి పాత్రే ఉదాహరణ. నైతికవిలువల పతనాన్ని లెక్కచేయకుండా స్వీయ ఆరోహణకు అడ్డదారులు తొక్కే 'సమర్థత'ను ఈ పాత్ర ద్వారా విశ్లేషించటం అద్భుతంగా వుంది.

ప్రజల్లోకి చొరవగా వెళ్లి, వాళ్ళ సమస్యలకు పరిష్కార మార్గాలను చూపిస్తూ పైకెదగాలనుకున్న కరుణాకర్ 'సమర్థత'కు బలమైన అండ కరవై, రాజకీయ రాక్షసుల చేతిలో బలిపీఠాన్నెక్కవలసివచ్చింది.

ఉన్నతుడైన తండ్రి మహాప్రస్థానం కూడా కన్నకొడుకు హెూదాముందు తలవంచింది. సమీపంలో ఉండి కూడా హెూదా అనే అడ్డుగోడ కట్టుకున్న 'కుహనా సమర్థుడు' స్వామి తన తండ్రికి తలకొరివి సైతం పెట్టలేకపోవటాన్ని రచయిత బాగా వర్ణించారు. కానీ రక్తపాశం ఏ కొడుకునూ, తన కన్నతండ్రి విషయంలో మరీ అంత దిగజార్చదేమో?

తన పైఅధికారి చిక్కులో పడ్డప్పుడు, ఆ పరిస్థితులను తనకనుకూలంగా మలచుకొని, హెూదా సోపాన అధిరోహణలో ఎస్.పి. రంజిత్ సఫలీకృతుడవుతాడు. స్వామి తన జీవితానికి అన్వయించుకున్న 'సమర్థత'ను ఆయనపైనే ప్రయోగించి విజయం సాధించిన రంజిత్ పాత్రను మలచిన విధానం బాగుంది.

నైతికవిలువలు లేని ఎదుగుదల అధోపాతాళ అవరోహణానికే దారితీస్తుందన్న వాస్తవాన్ని ఈ నవల ద్వారా రచయిత మనకు చెప్పేందుకు యత్నించారు.

-జె. విఠల్‌రావు
హైదరాబాద్.

## జరుగుతున్న చరిత్రే

*(రెండవ బహుమతి రు: 75/- పొందిన సమీక్ష)*

'నిర్జీవయాత్ర' నవల సమకాలీన జీవనానికి చక్కని ప్రతీకలా వుంది.

కానీ నవలలో కథకు ఏమాత్రం సంబంధం లేకున్నా రచయిత తనకు తెలిసిన విషయాలు పాఠకులకు తెలియజేయాలన్న తపనవల్లో, లేక మరెందువల్లో కొన్ని సన్నివేశాలు అనవసరంగా జొప్పించారు.

ఉదాహరణకు: ఈమధ్యే ఓ ప్రముఖవ్యక్తి చేసుకున్న రెండవ వివాహం గూర్చి, ఆ వివాహంవల్ల ఏర్పడిన వారి కుటుంబకలహాలను గూర్చి.

మొన్నామధ్య కొందరు ఉన్నతాధికారులు తమ పిల్లలకోసం చేసిన ఎమ్సెట్ గందరగోళం గూర్చి, స్వామి కూతురు కౌస్తుభ ద్వారా నేటి యువతరం ప్రవర్తన చెప్పడం.

రూపాదేవి ద్వారా ప్రయివేటు హాస్పిటల్స్ మోసాల్ని గూర్చి రాయడం.

ఇలా ఎన్నో అవసరంలేని విషయాల్ని నవల్లో ఎందుకు జొప్పించారో అర్థం కాదు.

ఏదైనా ఒక సంఘటన జరిగితే రాజకీయ నాయకులందరూ తమ లబ్ధికోసం ఆ సంఘటనను తమకనుకూలంగా ఎలా మలచుకోవాలని చూస్తారో కరుణాకర్ హత్యోదంతంతో చక్కగా వివరించారు.

పోలీసు వ్యవస్థలో విలువలెంతగా మారిపోయాయో, ఎందుకు మారిపోయాయో చక్కగా వివరించినా స్వామి సౌందర్య ప్రేమను పొందేందుకు వాళ్ల తల్లితండ్రులకు కావలసిన పనులు చేసిపెట్టాడని రాసిన రచయితే మరో దగ్గర పోలీసువారు ఉద్యోగనిర్వహణలో ఎంతో అమూల్యమైన (తమ) కాలాన్నేదో ప్రజాసేవకోసమే వృధాచేసేస్తూ తమ స్వంతపనుల కోసం సమయం కేటాయించుకోలేరన్నట్లుగా రచయిత చిత్రించడం చూస్తే... రచయిత ద్వంద్వవైఖరిలో రాశాడనాలో, లేక పోలీసు అధికారుల్ని గూర్చి బాలన్సుడ్గా రాస్తేనే మంచిదనుకున్నాడో అర్థంకాదు.

నిజానికి కథనంలో ఎక్కడా కంటిన్యుటీ దెబ్బతినకపోయినా కొన్నిచోట్ల పోలీసు డిపార్టుమెంటుని గూర్చి ఎక్కువగా ఏకరువు పెట్టడంవల్ల కథనంలో కంటిన్యుటీ దెబ్బతిన్నట్లు అన్పించింది. ఏది ఎలా వున్నా ఈ నవల మాత్రం సమాజపు 'సజీవ' చిత్రణే అని ఖచ్చితంగా చెప్పొచ్చు. ఇంత మంచి నవల రాసిన రచయితకు, ప్రచురించి పాఠకులకందించిన 'చతుర'కు అభినందనలు!

**-పి. హిమబిందు,**
సూళ్లూరుపేట.

# చేదు నిజం

***(మూడవ బహుమతి రు: 50/- పొందిన సమీక్ష)***

**చ**తుర నవలా సాంప్రదాయాన్ని పూర్తిగా పుణికిపుచ్చుకున్న నవల ఏప్రిల్ నెల 'నిర్జీవ యాత్ర'. చెప్పింది చాలా మామూలు విషయాన్నే... కాని చెప్పిన విధానం విభిన్నమైంది. రాజకీయనాయకులు, పోలీసులు, క్రిమినల్స్... వీళ్ల సక్సెస్మీద ఇప్పటికి లెక్కలేనన్ని నవలలు వచ్చాయి. కాని ఎలాంటి మెలోడ్రామాలు, సూపర్మేన్ హీరోలు లేకుండా పోలీసు వ్యవస్థను ఇంత సూక్ష్మంగా పరిశీలిస్తూ, అందునా ఉన్నతస్థాయి అధికారుల అంతరంగాల్లోకి తొంగిచూసి, వారి ఆలోచనాతీరును, అనుసరణ సరళిని, వారి వృత్తి ప్రవృత్తుల్ని, ఎత్తు పైఎత్తుల్ని, సంఘర్షణను ఇంత విలక్షణరీతిలో విశ్లేషించిన నవల ఇదే మొదటిది కావచ్చు.

నవల్లో కొన్నిచోట్ల రచయిత కావాల్సిన దానికంటే ఎక్కువ స్వేచ్ఛ తీసుకుని కథాగమనానికి అడ్డుపడుతున్నట్లుంది. తాను రాసేది వ్యాసం కాదు, నవల అన్న విషయం అక్కడక్కడ రచయిత మరిచారేమో అన్పిస్తుంది. ఏమైనా ఉప్పు, కారం, మసాలా లేని షుగర్ పేషంట్ భోజనంలాంటి సబ్జెక్టును, పేషంట్లు కాని వాళ్లు కూడా ఇష్టపడేంత 'శుచి'గా ప్రెజంట్ చేసిన రచయిత అభినందనీయుడు.

నవల ముగింపు చేదునిజంలా వుంది. క్రిమినల్స్ క్రీనీడలో బతికే దైన్యస్థితినుండి మనకిక విమోచన లేదా?

**-డా॥ పి. వెంకటరామిరెడ్డి,**
చెట్టపల్లి




## సామాజిక దర్పణం

*(నాలుగవ బహుమతి రు: 50/- పొందిన సమీక్ష)*

**చ**దివింపజేసే గుణం, సామాజిక స్పృహల ను కొలమానంగా తీసుకుంటే, 'నిర్జీవయాత్ర మంచి నవల. ఓ పోలీసు ఉన్నతాధికారి మనస్సులో వ్యక్తిత్వానికీ, ఉద్యోగ ధర్మానికీ మధ్య జరిగిన సంఘర్షణ నేపథ్యంగా, పోలీసు వ్యవస్థపై రాజకీయాల దుష్ప్రభావాన్ని, వివిధస్థాయి అధికారుల మధ్య జరిగే ప్రచ్ఛన్న యుద్ధాన్ని ప్రస్ఫుటింపజేసిన తీరు బాగుంది. స్వామి పాత్ర నేటి సమాజంలో మధ్యతరగతినుండి ఉన్నతస్థాయి కెదిగిన సగటు మనిషికి దర్పణం. కరుణాకరన్, రంజిత్, కౌస్తుభల పాత్ర చిత్రణ వాస్తవికతకు దగ్గరగా ఉంది.

అయితే రంగదాసు, పంకజ్, రాజారాం వంటి పాత్రలు కథాపరంగా అనవసరం. రాజకీయ ఊరేగింపుల ప్రహసనం మొదలుకొని ప్రైవేట్ హాస్పిటల్స్ దురాగతాలూ, కోచింగ్ సెంటర్ల అక్రమాలవరకూ రచయిత ఎన్నో సామాజిక రుగ్మతలను పాఠకుల ముందుంచారు. ప్రస్తుత సమాజంలోని సమస్యలను ఆవిష్కరించడంలో కృతకృత్యుడైన రచయిత, ఆ సమస్యలకు పరిష్కారాలనూ సూచించి ఉండాల్సింది. గాంధీమాష్టారి పాత్ర చిత్రణ ద్వారా, ఓ ఆదర్శభావాన్ని ఛాయామాత్రంగా సూచించినా, మారుతున్న సమాజానికి సరిపడిన, పరిష్కారాన్ని చూపకపోవడంతో ముగింపు అసంపూర్తిగానే అనిపించింది. స్వంతకొడుకులనే సరిదిద్దలేని గాంధీమాష్టారి వ్యక్తిత్వ చిత్రణ ద్వారా రచయిత పరిష్కారాన్ని ఆశించడం, సమంజస మనిపించదు.

-కె.యస్.వి. వరప్రసాద్,
విజయనగరం

## రాజకీయ కాలుష్యం

*(అయిదవ బహుమతి రు: 50/- పొందిన సమీక్ష)*

'నిర్జీవయాత్ర ఒక నవలలాకాక, విశ్లేషణాత్మక రచనలా ఉండి, చదివేటప్పుడు, ఒకవిధంగా విసుగునే కలిగించింది. రచయిత చెప్పదలచుకున్నదేమిటో కథలోని సంఘటనలు, సంభాషణల ద్వారా పాఠకులు గ్రహించగలగాలి కానీ, రచయితే సూటిగా తన అభిప్రాయాలను పాఠకులకు అందించే ప్రయత్నం తప్పనిసరైతే మాత్రమే చేయాలి.

కరుణాకర్ హత్యతో కథా ప్రారంభం జరిగింది. ఐతే, కరుణాకర్ హత్యకి బలమైన కారణం కనిపించదు. ప్రజలకు సహాయపడుతూ, తన పలుకుబడి పెంచుకుంటున్న యువకుడిని, తమవైపు ఆకర్షించడానికి రాజకీయ పక్షాలు ప్రయత్నిస్తాయి కానీ, హింసకి దూరంగా ఉండి, ఇంకా రాజకీయాలలో చేరనివాడిని హత్య చేయించే స్థితికి, మన రాజకీయాలు ఇంకా దిగజారలేదు.

మిగిలిన కథలో, రాజకీయ నాయకుల ఒత్తిడి, పోలీస్‌శాఖలోని అంతర్గత విభేదాలతో సతమతమౌతూ, తన హెూదా ఏర్పరచిన గీతదాటి వచ్చి, తమ్ముడైన కరుణాకర్‌ని కాపాడలేని పోలీస్ అధికారి డి.ఐ.జి. స్వామి అంతర్మథనాన్ని రచయిత వివరించారు. ఉన్నతస్థాయిలో ఉన్నవారి మధ్య సంబంధాలు విందులు, వినోదాలకే పరిమితమౌతాయని, ఒకరి కష్టాలని మరొకరికి చెప్పుకోడానికి హెూదా అడ్డు వస్తుందని, కూతురు ఇంటికి చేరకముందు వనజ పడే ఆందోళనవల్ల విశదమౌతుంది.

స్వామి ట్రాన్స్‌ఫర్‌తో కథ ముగిసినా, ఎంతోమంది పోలీస్ అధికారులు నిజజీవితంలో ఇటువంటి నిర్జీవయాత్రని సాగిస్తున్నారనేది నిజం. ఈ నిర్జీవయాత్ర, జీవయాత్రగా మారాలంటే రాజకీయ కాలుష్యాన్ని అరికట్టే ప్రజాచైతన్యం అవసరం.

-రవిప్రసాద్,
భువనేశ్వర్

# వ్యాపారాలు వెయ్యివిధాలు




ప్రపంచంలో ఎక్కువ ఆదాయాన్ని, ఆనందాన్ని ఇచ్చే వ్యాపారాల్లో జంతువుల శరీరభాగాలతో చేసే వ్యాపారం ఒకటి అంటున్నాడు న్యూజిలాండ్‌కి చెందిన ఈ పెద్దమనిషి. రకరకాల జంతువుల కొమ్ములతో ఎన్నో రకాల గృహాలంకరణ వస్తువులను తయారుచేసి అమ్మే ఇతడి షాపు ఎప్పుడూ కస్టమర్స్‌తో కిక్కిరిసి వుంటుందట. గిరాకీనిబట్టి ఉత్పత్తి కూడా వుండాలి కాబట్టి ఎప్పటికప్పుడు కొమ్ముల జంతువులకోసం వెతుకుతూ వుండవలసిందే అంటాడీయన. ఇతగాడి అవిశ్రాంత జీవహింసా వ్యాపారంలో అతడెంత ఆనందంగా వున్నదీ అతడి మొహమే చెబుతుంది అంటారు చాలామంది.

# చిత్తర కథలు

## గుర్నాధం బదిలీ

ఆఫీసుకు చేరుకునేసరికి పది నిమిషాలు లేటైపోయింది. కిక్కిరిసిన బస్సులు, స్కూటర్లూ, ఆటోలు అన్నీ బయల్దేరే సమయం ఒక్కటే! అందరికీ త్వరగా గమ్యం చేరుకోవాలన్న ఆత్రమే! ట్రాఫిక్ జాం కాకేమవుతుంది? ట్రాఫిక్ సిగ్నల్స్ ఉండనే ఉన్నాయి.

సెక్షన్ వైపు నడుస్తుంటే అటెండర్ వెంకటేశు ముసిముసిగా తనలోతను నవ్వుకుంటూ రావడం కనిపించింది. ఏమిటీ విశేషం అనుకుంటూ నా సీటువైపు నడిచాను. పక్కసీటులో గుర్నాధం కునికిపాట్లు పడుతున్నాడు. బహుశా వెంకటేశు నవ్వుకి ఇదే కారణమై ఉంటుంది. రోజూ ఉన్నదేగా అనుకుని టేబుల్‌పై ఫైల్సు సరిచూసుకోసాగాను.

"టీ తెస్తాను... డబ్బులిస్తారా సార్!" అటెండర్ అడిగాడు.

గుర్నాధం టిఫిన్ లాగిస్తున్నాడు. మహానుభావుడు! ఇంట్లో ఏం చేస్తాడో మరి! ఆఫీసుకు పాతిక గజాల దూరంలోనే ఇల్లు! ఆఫీసు టైంకి పది నిమిషాలు ముందు బయల్దేరినా టైంకి చేరగలడు! అయినాసరే రోజూ ఆఫీసుకు వచ్చాకే టిఫిన్ కార్యక్రమం ప్రారంభిస్తాడు. రాగానే కాస్సేపు మంత్రాలు చదువుకుని దైవస్తుతి చేసుకుంటూండగానే నిద్ర ముంచుకొస్తుందతనికి. ఎదురుగా ఫైళ్లు ఉన్నచోటే ఉంటాయి. ఇతగాడు మాత్రం కళ్లు సగంసగం మూసి తెరుస్తుంటాడు. ఒకసారి దిక్కులు పరికించి ఎవరూ గమనించకపోతే నిశ్చింతగా ఉంటాడు. ఎవరైనా తనని చూస్తున్నట్లనిపిస్తే చూసిన వ్యక్తివైపు కోపంగా, అసహనంగా చూసి హుష్...మని నిట్టూరుస్తాడు మళ్లీ 'ష్...ష్.. అయ్యబాబోయ్' అని ఏదో చదవబోతాడు. మళ్లీ ముంచుకొస్తుంది నిద్ర. ఇక ఎవరేమైనా అనుకోనీ... నాకేం? "నవ్వి పోదురుగాక నాకేటి సిగ్గు?" అనుకుని... నిశ్చింతగా నిద్రిస్తాడు. ఆఫీసరుగారొచ్చినా ఎదురుగా కాగితాలు చదువుకొంటున్నాడనే అన్పించేలా కళ్లు వాల్చి వుంటాయాయె.

ఇక ఒంటిగంట దాటిందంటే లంచ్‌టైం ఎప్పుడెప్పుడా అని ఎదురు చూస్తుంటాడు గుర్నాధం. టైం అవగానే లంచ్ ముగించి కబుర్లు మొదలెడతాడు. ఎంతసేపూ వాళ్లావిడా... వాళ్లపిల్లలు... బంధువులు.. ఇదే వరస! సెక్షన్‌లో పన్లుచేసుకునేవారికి డిస్టర్బెన్స్ అన్న స్పృహ లేకుండా గొల్లున నవ్వుతూ చెబుతుంటాడు. వాళ్లావిడ ఏదో బాంక్‌లో ఆఫీసరట! ఇతగాడి గర్వానికి అది కూడా ఒక కారణమే! అంతేకాదు ఎదుటివారిని గురించి వ్యంగ్య విమర్శలు చేయటం అతని ప్రత్యేకత. తరువాత మూడు, మూడున్నరకి అటెండర్ టీ తెచ్చి పెడితే అమందానంద కందళిత హృదయారవిందుడై దాన్ని గ్రోలి ఇక జీతాల లెక్కలు, ఎరియర్లెప్పుడిస్తారని ఆరాలు తీయటం ప్రారంభిస్తాడు. బోనస్ ఎంతవస్తుంది, సిఎం ఏమేం లేహ్యాలు తింటాడు వంటి చర్చలు కాస్సేపు కొనసాగించి, పనున్నా లేకపోయినా ఓసారి ఆఫీసరుగారి గదికి వెళ్లి పలకరించి, బుద్ధిమంతుడిగా, పనిమంతుడిగా, అమాయకచక్రవర్తిగా

ఆయన ఎదుట నటిస్తాడు. ఆనక అయిదయ్యే వరకూ నిర్లజ్జగా, నిశ్చింతగా, నిర్భయంగా నిద్దరోతాడు. ఇక ఆఫీస్‌టైం మరో పావుగంట ఉందనగా మొహం కడుక్కువచ్చి ఫైల్సు సర్దేసి వెళ్లడానికి తయారవుతాడు.

ఈ గుర్నాధం గొడవ ఈనాటితో, రేపటితో అయ్యేది కాదులెమ్మని అర్జెంటుగా వెళ్లాల్సిన ఫైలు ఓపెన్ చేశాను. చాలా తప్పులున్నాయి. సరిదిద్దాల్సిన గుర్నాధం నిద్రమత్తులో అన్నీ వదిలేశాడు. వాటిని సరిచేసి పంపించేసరికి

మర్నాడు నేను ఆఫీసుకు వచ్చేసరికి సెక్షనంతా కోలాహలంగా ఉంది. గుర్నాధం శివాలు తొక్కుతున్నాడు. సంగతేమిటని విచారిస్తే గుర్నాధాన్ని బ్రాంచ్ ఆఫీసుకి బదిలీ చేశారని తెలిసింది.

ఎం.డి.గారు రాగానే ఆయన ఛాంబర్లోకి వెళ్లి గొల్లుమన్నాడు గుర్నాధం. విషయమేమిటని విచారించిన ఎం.డి.గారు "అదేంటయ్యా! నువ్వే ట్రాన్స్‌ఫర్ కావాలని కోరావుగదా" అన్నాడు నవ్వుతూ.



రోజూకంటే లేటైపోయింది. తనపై పని భారం పడబోయే సూచన కన్పించగానే చెప్పాపెట్టకుండా అకస్మాత్తుగా ఆఫీసు మానేస్తాడు గుర్నాధం. అక్కడెక్కడో పుండు అయిందనో, కడుపు నొప్పిగా ఉందనో ఫోన్ కొట్టి నిశ్చింతగా ఇంట్లో కూర్చునేసరికి మిగతావారే అతగాడి డ్యూటీ చెయ్యక తప్పదు మరి!

"నేను కోరటం ఏమిటండీ నా పిండాకూడూ... ఈ ఉద్యోగంలో ఉన్నంతవరకూ నేను ఈ ఆఫీసులోనే, ఈ సెక్షన్‌లోనే తప్ప మరెక్కడా పనిచెయ్యను" అన్నాడు కళ్లు తుడుచుకుంటూ.

"పని చేసేవాడికి ఏ సెక్షనైతే ఏమిటయ్యా! అయినా ఇదిగో నీవిచ్చిన అప్లికేషన్ నువ్వే చూడు" అంటూ అందించారు ఎం.డి.గారు.

హెడ్‌ఆఫీసునుండి బ్రాంచి ఆఫీసుకి బదిలీ చెయ్యమని అప్లికేషన్ రాసి ఉంది. చేతి రాత తనదే! కింద సంతకమూ తనదే!

ఇది ఎలా జరిగింది?

"గుర్నాథం! ఇప్పుడు మనం చేసేదేమీ లేదోయ్! ప్రస్తుతానికి వెళ్లి జాయినవ్వు. తరువాత నిన్ను నా సెక్షన్‌కే రప్పించుకుంటాను సరేనా?"

"అక్కడ నేను ఎన్ని రోజులు ఉండాల్సి వస్తుంది సార్!" ఏడవబోయి ఆగిపోయాడు గుర్నాథం.

"కనీసం ఆర్నెల్లో సంవత్సరమో'' అంటూ రిలీవింగ్ ఆర్డరందించారు ఎం.డీగారు.

మిత్రులంతా ఘనంగా వీడ్కోలు పార్టీ ఇచ్చారు. కృతజ్ఞతలు చెప్పబోయిన గుర్నాధానికి గొంతు పూడుకుపోయి మాటలు రాలేదు దుఃఖంతో.

"బీ రిలాక్స్... డోన్ట్‌వర్రీ... అయినా పనిచేసుకు బతికేవాళ్లం... ఏ బ్రాంచ్ అయితే ఏముందిలే' ఓదార్చారు ఎం.డిగారు.

"కాద్సార్! ఆ బ్రాంచి ఇన్‌ఛార్జి ఛండశాసనుడు. ఒక్కరోజంటే ఒక్కరోజు కూడా అక్కడ నేను పనిచెయ్యలేను సార్' అంటున్న గుర్నాధం కళ్లు ఆగకుండా వర్షించసాగాయి.

అందుకు అసలు కారణం అర్థమైన కొలీగ్స్ ముసిముసిగా నవ్వుకున్నారు గుర్నాధం చూడకుండా. ఎలాగైతేనేం సెండాఫ్ పార్టీ ముగిసింది. అందరూ ఇళ్లకి వెళ్లిపోయారు.

మర్నాడు బ్రాంచ్ ఆఫీసులో జాయినయిన గుర్నాధానికి తన అప్లికేషన్ కథ ఎలా జరిగిందో ఎంత గింజుకున్నా అర్థం కాలేదు. ఎవరో ఫ్రెండు అడిగితే ఓ రోజు సెక్షన్ బదిలీ కోసం అప్లికేషన్ రాసి పెట్టాడు గుర్నాధం. మిత్రుడు రాకపోయేసరికి అది అతని ఫైల్లోనే ఉండిపోగా, ఓ రోజు కునికిపాట్లు పడుతూ నిద్రమత్తులో తనే సంతకం పెట్టాననీ, అది ఛైర్మన్ వద్దకి వెళ్లాల్సిన ఫైలుగనుక అది సరాసరి ఆయనకే చేరిందనీ, ఆయనగారు బదిలీకి అంగీకరిస్తూ సంతకం చేశారనీ... అతనికి అర్థం కానేలేదు ఈనాటివరకూ.

-జ్యోతిరాణి

---

# ఫస్టుర్యాంకు

"మా వాడికీసారి కూడా ఫస్టుర్యాంకు వచ్చిందోయ్!" ఆనందం పళ్లికిలిస్తూ చెప్పాడు.

"అలాగా!" అన్నాను నవ్వు ముఖంపెట్టి.

"మీ వాడికి పదో ర్యాంకువచ్చిందిటగా'' అన్నాడు వాడు పుండు మీద కారం చల్లినట్టు.

"మరే!" అంటూ ఫైల్లో తలదూర్చాను! రోజూ వీడి ఆర్భాటాలు వినలేక చస్తున్నాను! ఈ ఊర్నించి ట్రాన్స్‌ఫర్ చేయించుకుంటే బావుండుననిపిస్తోందికూడా. ఆనందానికి, నాకూ ఒకే వయసుగల అబ్బాయిలున్నారు. చాలాకాలంగా పక్కపక్క ఇళ్లల్లో కాపురముంటున్నాం! మొదట్లో పిల్లలు ఇద్దరూ కలిసే ఇంటికి దగ్గర్లోనే ఉన్న కాన్వెంటుకెళ్లేవారు! ఆనందం కొడుకు ఎప్పుడూ మా వాడికంటే తక్కువ మార్కులు తెచ్చుకుంటూ, తక్కువ ర్యాంకుల్లో ఉండేవాడు! ఒక్కసారి కూడా వాడికి ఫస్టుర్యాంకు వచ్చిన పాపాన పోలేదు. దాంతో ఈ సంవత్సరం వాళ్లబ్బాయిని ఇంటికి మూడు కిలోమీటర్ల దూరంలో ఉన్న మరో స్కూలుకు మార్పించాడు ఆనందం! బోలెడు డొనేషను, మోపెడు పుస్తకాలు, ఫీజులు, బస్సులో వెళ్లటం, రావటం క్యారియరు... ఉదయం లేచినప్పటినించి వాడిని చంద్రమండలానికి పంపుతున్న హడావిడి జరుగుతుంది. అది చూసి వళ్లు మండుతుండేది నాకు. అయితే ఆ స్కూల్లో

చేరింది మొదలు ఏ టెస్టుపెట్టినా క్వార్టర్లీక యినా, హాఫియర్లీకయినా, ఫస్టుర్యాంకు తెచ్చుకుంటున్నాడా కుర్రాడు. ఫస్టుర్యాంకు అంటూ కొడుకు గురించి ఆనందం పొగుడుతుంటే నాకు చిర్రెత్తుకొచ్చేది. మావాడి మీద కోపం రాసాగేది!

దాంతో మా ఆవిడను సాధించసాగాను. "వీడిని గారం చేసి పాడుచేస్తున్నావు. అస్తమానం టివి ముందు కూచుంటాడు. ఫస్టు ర్యాంకు రమ్మంటే ఎలా వస్తుంది! పక్కింటి కుర్రాడిని చూసి బుద్ధి తెచ్చుకో' అంటూ తల్లీ

స్కూలు ఆవరణ, గదులు, విశాలంగా అన్నీ కొత్తగా అందంగా కనిపించాయి. మా ఆవిడ మాట నిజమేననిపించింది. తీరా ఆరా తీస్తే ఆ స్కూలు కరస్పాండెంటు నా పాత ఫ్రెండేనని తేలింది. తీరిగ్గా కాఫీగట్రా అయ్యాక ఫీజు వివరాలు కనుక్కున్నాను. కాసేపు పిచ్చాపాటి మాట్లాడాక, ఆనందం కొడుకు పేరు, ఇతర వివరాలు చెప్పి వాడికొస్తున్న ఫస్టుర్యాంకులకు టీచర్లను అభినందిస్తూ మాట్లాడాను!

అదంతా నా స్కూలు గొప్పదనం సుమా



కొడుకులను తిట్టిపోయసాగాను.

"వాళ్లబ్బాయిని వాళ్లు మంచి స్కూల్లో చేర్పించారు! డొనేషన్లకు జడిసి మీరు అలా చేర్పించలేదు. పిల్లల్ని మంచి స్కూల్లో చేర్పిస్తే మంచి మార్కులొస్తాయిగానీ మధ్యన నన్ను తిడతారేంటి" అంటూ గయ్యిన లేచింది మా ఆవిడ.

సరే అనుకుని ఆనందం వాళ్ల అబ్బాయి చదివే స్కూలు అడ్రసు కనుక్కునివెళ్లాను.

అన్నట్టు ఫోజిచ్చాడు కరస్పాండెంటు.

ఇంతలో స్కూలు గంట మోగింది. స్కూలు ఆవరణలోని పిల్లలను చూసి నా భృకుటి ముడిపడింది. కరస్పాండెంటుని అడిగాను ఆనందం వాళ్లబ్బాయి చదివే క్లాసులో స్ట్రెన్త్ ఎంత?

"ఒక్కడే..." అన్న కరస్పాండెంట్‌వైపు పిచ్చిచూపులు చూడసాగాను నేను.

**ఎ.జయలక్ష్మిరాజు**

Edited, Printed and Published by Ramoji Rao for Vasundhara Publications, Printed at Colorama Printers Pvt. Ltd. Hyderabad. Tel: 290328; Office Address: CHATURA Telugu Monthly, Eenadu Compound, Somajiguda, Hyderabad. Tel: Hyderabad: 318181, 399444; Madras: 470434; Vijayawada: 476685; Visakhapatnam: 52211; Tirupati: 5291; Anantapur: 22977; Rajahmundry: 71390; Karimnagar: 8316.

